


# క్రొత్త ఎక్కువ శక్తివంతమైన
# సూపర్ 777 డిటర్జెంట్ బార్

## నాణ్యతను గురించిన పొగడ్తలు కేవలం పొగడ్తలే కావనీ, నిజమని నిరూపించే హామీ కూడా ఇస్తుంది.

ఇప్పుడు క్రొత్త సూపర్ 777 డిటర్జెంట్ బార్‌తో నాకు లభిస్తుంది అన్నిటికంటే ఎక్కువ తెలుపు. దీని డిటర్జెంట్ ఫార్ములా మునుపు కంటే ఎక్కువ మేలైనది. అందుకే ఇది మునుపు కంటే ఎక్కువ నురుగ ఇస్తుంది, ఎక్కువ బట్టలు ఉతుకుతుంది, ఎక్కువ మన్నిక వస్తుంది. అంచేతే ఇది ఇతర అన్ని డిటర్జెంట్ బారులు మరియు సబ్బుల కంటే ఉత్తమమైనది!

వాడి చూడండి...మీరూ విస్తుపోయి చూస్తారు, మరి-మరి దీన్నే కొంటారు.

Shilpi DM 2/83 Tel.

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.

Colgate
DENTAL CREAM
Colgate
STOPS B

కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ముులా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

# దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

GK&E B82 86 TL,

## వాణిశ్రీ

'జి. వి. జి.'గారు సినీనటి "వాణిశ్రీ"తో ఇంటర్వ్యూ చేసిన వ్యాసం చదువుతుంటే మా కళ్ళముందు "వాణిశ్రీ"గారి చిత్రాలే కనిపిస్తున్నట్టు అనిపించింది.

గుమ్మనూరు స్వర్ణశ్రీ, ఆలూరు.

* * *

11–11–83 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో మా అభిమాన అందాల అగ్రనటి వాణిశ్రీగారి ఇంటర్వ్యూ ఈ సంచికకే హైలైట్ అని చెప్పవచ్చు. చాలా కాలం తర్వాత మీ (మా) పత్రికపై మా అభిమాన నటిని చూసి ఎంతగా ఆనందించామో మాటలలో వర్ణించలేము. వాణిశ్రీ ఇంటర్వ్యూతో పాటు ఆమె ముఖచిత్రం కూడా వేస్తారని ఊహించిన మాకు కొంత ఆశాభంగం కలిగిందనే చెప్పాలి. మా సూచనను గమనించి ఆలస్యంగానైనా మా కోరికను ఇంత అందంగా నెరవేర్చినందుకు మెనీ మెనీ థాంక్స్.

వేమూరి వాణి, కరీంనగర్.

* * *

దీపావళి సంచికలో దివ్వెల వెలుగులు — జ్ఞాపకాల పొరలు (నటి వాణిశ్రీతో ఇంటర్వ్యూ) ప్రచురించి నా జ్ఞాపకాల పొరలు వెలికి తీసేరు.

నేను చదువుకునే రోజుల్లో, వాణిశ్రీ నటించిన 'మరపురాని కథ' చూసి నిజంగా కొద్ది రోజులవరకూ రికవర్ కాలేకపోయాను.

వాణిశ్రీ సినిమాలు వీలైనంతవరకూ మిస్ చేసేదాన్ని కాదు. ఆవిడ యాక్షన్ అంటే అంత యిష్టం.

మళ్ళీ యిన్ని రోజుల తర్వాత ఆవిడతో ఇంటర్వ్యూ, చదువుతుంటే చాలా హేపీగా అనిపించింది.

తన పాపతో, తన క్యారక్టర్ స్టిక్ స్మైల్‌తో అందంగా వున్న వాణిశ్రీని చూస్తుంటే చిరకాల స్నేహితురాల్ని చాలాకాలం తర్వాత చూస్తున్నంత ఆనందంగా అనిపించింది.

గాజుల అచ్చాయమ్మ, గుంటూరు.

## మీ అభిప్రాయం చెప్పండి

పై శీర్షికతో నేను పంపిన ప్రశ్నావళి సహృదయంతో స్వీకరించి ప్రచురించినందుకు సంపాదకులకు కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు సమర్పిస్తున్నాను. ఉత్సాహంతో, అధిక సంఖ్యలో పాల్గొని 'ప్రశ్నావళి'కి జవాబులు పంపిన ఆంధ్ర ప్రజలందరికీ పత్రికాముఖంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. వ్యక్తిగతంగా ధన్యవాదాలు తెలుపుకోలేని నా అసమర్థతకు మన్నించమని కోరుతున్నాను.

ఎ. వి. ఆర్. కె. రావు, న్యూఢిల్లీ.




## వ్యాసాలు

దసరా సంచికలో డా. గుమ్మనూరు రమేష్ బాబుగారి "భారతీయ కల్యాణ సంస్కృతి" లో మనజాతి సంప్రదాయం చాలా గొప్పదనివర్ణిస్తూ కల్యాణ సంప్రదాయం గురించి, అందులోని వివిధ ఘట్టాల గురించి వర్ణిస్తూ వాటికి అనుగుణంగా కొన్ని సంస్కృత వాక్యాలు వివరించి ఘనంగా పొగిడారు. మన దేశంలోనే రకరకాల పెళ్ళి విధానాలు అవలంబిస్తున్న యితరమతాలు, కులాలవారు డా. రమేష్‌గారు వివరించిన పద్ధతులకు భిన్నంగా ఉండడం అందరికీ తెలిసిన విషయమే. "ఆలుమగల తలంబ్రాల వేడుక", "వరుని కాశీయాత్ర" మొదలగు ఘట్టాలు సచిత్రంగా విశదీకరించుటలో ఆయన చాలా శ్రమ తీసుకున్నారు. కాని యీ తంతులేవీ జరపకుండా ఎన్నో యితర సులభ మార్గా[illegible] జరిగే వివాహాల వధూవరులకు యీ శ్లోకాలు, జాతకాలు, తిథి నక్షత్రాలు చూచి శుభప్రదంగా జరిపిస్తున్నామన్న తృప్తితో అర్ధరాత్రులందు జరిపే వివాహాల వధూవరులు ఏమైనా ప్రత్యేకమైన అదృష్టాలు, సుఖము పొందుతున్నారా? పెళ్ళి తంతు జరిపే పురోహితులవారు వీలైనంత మేరకు జనాన్ని మోసంచేసి అందరిని అప్పులపాలు చేయడమేకాక, వారివారి స్థితికి మించిన సరుకులు మూటలు కట్టుకోడానికి ఈ సంస్కృతి ఉపయోగపడుతుందేమోగాని మరే ఉపయోగం లేదుగదా!

డా. రమేష్‌బాబుగారు ఈ రోజులలో కూడా మూఢనమ్మకాలను సమర్థించే రచనలు చేయడం శోచనీయం.

దాసరి నరేంద్ర, గుంటూరు.

* * *

"బోయింగ్ 747 ని చూసి ఆర్. పి. 135 అనుకున్నారా?"లో ప్రచురించిన విషయాలు చాలా ఆశక్తిదాయకంగా ఉన్నాయి. దక్షణకొరియా విమానాన్ని, రష్యా వారు కాల్చిన తీరు, మరియు వాటికి సంబంధించిన అంశాలు, బొమ్మలు చాలా చక్కగా ప్రచురించారు.

కె.యస్. శ్రీనివాసరావు, జగ్గయ్యపేట.

## సీరియల్

క్రొత్త సీరియల్ "అనురాగ తరంగాలు" ప్రారంభంలోనే మా మనస్సులను తరంగాలలో ఊపింది. కాని మొట్టమొదటే లీల మనస్సు విరిచేయడం అంతగా నచ్చకపోయినా ఇది ఏ మలుపును తీసుకెళ్ళుతోందోనని మేము వచ్చే సంచికకై ఎదురు చూస్తున్నాము.

ఎం. డి. శిరాజుద్దీన్, మాదారం.

## యక్షగానం

"యక్షగానం" సీరియల్‌తో వెలువడిన (28–10–83)సంచిక నాకెంతో సంతోషాన్ని కలిగించింది. చిరస్మరణీయురాలైన నా అభిమాన రచయిత్రి కీ. శే. మాదిరెడ్డి సులోచనగారి కలం నుండి వెలువడిన "యక్షగానం" చదువుతుంటే యక్షగానం ఆలాపించినట్లుంది. 'జీవన మురళి", "మూగ ముత్యాలు" సీరియల్స్‌కూడా వాస్తవికతకు దగ్గరగా వున్నాయి.

గోన శివరామకృష్ణారెడ్డి, కొనిదేడు.

* * *

'యక్షగానం' ప్రారంభమే ఎంతో అపురూపంగా ఉంది.

ఎస్. ఇందుముఖి, హైదరాబాద్.

## ధర్మపథం

4–11–83 నాటి ఆంధ్రసచిత్ర వారపత్రికలో 'ధర్మపథం' శీర్షికన శ్రీ బులుసు వేంకట రమణయ్యగారి "మనః పరిశీలన" విషయాన్నీ చక్కగా వివరించారు. అవును మరి. చెడ్డవారి మనస్సు ప్రవర్తనవల్ల తెలుసుకోవచ్చు. మంచివారి మనస్సు యథార్థ స్థితివల్ల తెలుసుకోవచ్చు.

జి. వి. ఎం. కాళిదాసు, సింధనూరు.

## "ఆడవారు"

25–11–83 వ తేదీన వెలువడిన మీ పత్రికలో విశ్వనాధ గణపతిరావుగారు వ్రాసిన "కోరిక" కథ చదివాక వెంటనే ఈ లేఖ వ్రాయాలనిపించింది. ఒక రకంగా చెప్పాలంటే వారు "ఆడవారు" అంటే అందరూ ఒకే తీరు అనే ఉద్దేశ్యంతో వ్రాశారు. కానీ, ఆ కథ చదివిన మాకు చాలా అసంతృప్తి కల్గింది. ఒక విధంగా కోపం కూడా వచ్చిందనే చెప్పాలి. కొంత మంది అతను వ్రాసిన విధంగా ఉంటే ఉండవచ్చేమోకానీ; ఒక కూతురు అయి ఉండి అలా స్వార్థోచితంగా అంటుందీ అనటము ఆడవాళ్ళని కించపరచటమే అవుతుంది. అంతగా తండ్రి లేకపోయినా చిన్నప్పటి నుంచి పెంచి పెద్దచేసిన అండలేని తల్లిని వదిలేసి మనం వేరే ఉందామని కొంచెం ఇంగితజ్ఞానమున్న ఏ కూతురు అనదు. అంటే రచయితగారు అసహజంగానే ఆలోచించారని అనుకుంటున్నాను

కె. మాధవి, హైదరాబాదు. ★

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం : 16–12–'83
రుధిరోద్గారి నామ సం. మార్గశిర శు. ఏకాదశి
సంపుటము 76 సంచిక 14
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు. 1-50
ఆరు మాసాల చందా రు. 42-90
పోస్టులో ఏడాది చందా రు. 85-80
ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003.

విషయానుక్రమణిక



కథలు :
మధ్యతరగతి మమతలు ... 8
కోటివిద్యలు ... 23
సింహసేనాపతి ... 33
కొత్తవెలుగు ... 56

సీరియల్ నవలలు :
యక్షగానం ... 16
గోరంత దీపం ... 26
అనురాగ తరంగాలు ... 50

వ్యాసాలు, శీర్షికలు :
ఉత్తరాలు–4, న్యూఢిల్లీ లేఖ–6, లోకంపోకడ–7, వ్యక్తిగతం,వారఫలం–14, డాక్టర్‌సలహాలు–22, ఫాలాక్షునిడైరీ–25, 'వేమన' పద్యాలు – 32, మంత్రాలయ ప్రభువులు – 38, సినిమా – 42, సరాగమాల – 48, ప్రశ్నావళి – 55, ధర్మపథం–64, హైదరాబాద్ నోట్‌బుక్, అవీ–ఇవీ–అన్నీ – 65.

# భారతి

## భారతి పాఠకులకి మనవి

భారతి మొదటి సంచిక వెలువడి 1984 జనవరితో 60 సంవత్సరాలు పూర్తి అవుతుంది.

ఈ 60 సంవత్సరాలలో మా భారతిలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఎన్ని మార్పులు వచ్చినప్పటికి భారతి తెలుగువారి సంస్కృతికీ, వారి సంస్కృతిలోని ఉత్తమమయిన అంశాలకీ, ప్రతిబింబంగా ఉంటూ వచ్చింది. ఇకముందు కూడా ఈ సంప్రదాయాన్నే భారతి కొనసాగించగలదు.

కొన్ని సంవత్సరాలుగా భారతిలో కథలకి (చిన్నవికావి, పెద్దవికాని) అంతగా చోటు ఉండటంలేదు! ఈ లోపాన్ని సరిదిద్దటం కోసం ఇకమీద భారతిలో కథలనీ, నవలలనీ ఎక్కువగా ప్రచురించటానికి నిశ్చయించుకున్నాము!

పాత భారతి సంచికలతో పరిచయం కలవారికి ఇదేమీ కొత్తగా ఉండదు. ఒకప్పుడు భారతిలో ఇప్పుడు కొన్ని వార పత్రికలలో, మాస పత్రికలలో ఉన్నట్లు కథలూ, నవలలూ పుష్కలంగానే ఉండేవి!

కథలూ, నవలలూ ఎక్కువగా వేసినంతమాత్రాన భారతిలో పడే కవిత్వానికీ, వ్యాసాలకీ ఎటువంటి కొరతా ఉండదని వేరే చెప్పనక్కరలేదు!

వీలువిపట్టి, భారతి స్థాయిని అనుసరించి అట్టనికూడా మార్చగలము!

భారతికి ఎప్పటిలాగే పాఠకుల ఆదరాభిమానాలు లభించగలవని ఆశిస్తున్నాము!

కర్తి

# చిలికితే చెత్త పయికి వస్తుందేమో!

వీధిలో ఎవరినయినా అడిగి చూడండి — ''మధూ లిమాయె ఎవరు?'' అని. ''మధూ దండావతే చుట్టమేమో!'' అని ఆ మనిషి సమాధానం చెప్పవచ్చు. అంతకన్నా ఆయనకి తెలిసి ఉండదు. రాజనారాయణని గురించి అడిగితే, ''ఆయనే కదా జనతా ప్రభుత్వంలో ఉన్న తమాషా మనిషి?'' అనవచ్చు వీధిలో కనిపించిన ఆయన. ''తలకి రంగు రుమాలు కట్టుకునేవాడు, జనతా పార్టీని నాశనం చేసేశాడు.''

నిజానికి రాజనారాయణ, లిమాయెలు తమాషా మనుషులు కానేకాదు. ఇద్దరూ కలిసి జనతా పార్టీని ధ్వంసం చేశారు. అది ఇక తిరిగి కోలుకోలేదు. ఇద్దరూకూడా ఏ మాత్రం ప్రాముఖ్యం లేనివారే, ఇద్దరూ కట్టటంకన్నా విరక్కొట్టటమే బాగా తెలిసినవారే, ఇద్దరూ ఇతరులచేత దుర్వినియోగపడటానికి సిద్ధంగా ఉన్నవారే. ఇలాంటివాళ్ళు చేతికందినదానినల్లా నాశనం చేస్తారు. రాజకీయపక్షాలు, ప్రభుత్వాలు, సంస్థలు, కుటుంబాలు — ఒకటేమిటి, ఏది నాలుగు కాలాలపాటు నిలిస్తే మంచిదో దానిని ధ్వంసం చేసే రకం వీరిది.

అరుణ్ గాంధీ అనే ఆయన (మహాత్ముడి మనుమడు) ఒక పుస్తకాన్ని రాసి, వెలువరించాడు. అందులో జనతా పార్టీ చరిత్రని శ్రీ మొరార్జీ దేశాయి లేఖల ద్వారా తెలుపటానికి ప్రయత్నించాడు ఆయన. శ్రీ దేశాయి రాసిన లేఖలనీ, వాటికి వచ్చిన జవాబులనీ,




శ్రీ దేశాయికి వచ్చిన ఉత్తరాలనీ శ్రీ గాంధి ప్రచురించాడు. ఇదంతా చదివితే బాధగా ఉంటుంది. జనతాపార్టీలో చీలికకి కారణం రెండు సభ్యత్వాల సమస్యే అని చెప్పబడుతోంది. అంటే, రాష్ట్రీయ స్వయం సేవక సంఘం, జనతాపార్టీలలో సభ్యత్వం అన్నమాట. ఈ సమస్యని గురించి శ్రీ లిమాయె అప్పుడప్పుడు అసహ్యమయిన ఉత్తరాలు రాసేవాడు. గడుసువాడు కనుక ఆయన తన ఉత్తరాలలో పెద్ద మాటలు వాడేవాడు — తనొక లెనిన్ అయినట్లు ఏవేవో ''డయలెక్టిక్స్''ని గురించి రాసేవాడు. శ్రీ లిమాయె తన లేఖలని దూతలద్వారా పంపేవాడని తెలుస్తుంది. ఏమయితేనేమి శ్రీ దేశాయి తరుచు శ్రీ లిమాయెని చర్చలకి పిలిచేవాడు కాని శ్రీ లిమాయె ఏదో సాకు చెప్పి వచ్చేవాడు కాదు. ''భయమా, మొహం చాలకనా?'' అని శ్రీ గాంధీ అడుగుతాడు. మొహం చాలకనే అని నా అభిప్రాయం.

న్యూఢిల్లీలోని సెయింట్ థామస్ స్కూలుని సందర్శించిన బ్రిటిష్‌రాణి రెండవ ఎలిజబెత్‌ని ఆమె కారు వరకూ పల్లకీలో ఊరేగిస్తున్న దృశ్యం. ఫొటోలో అలా ఉన్నా నిజానికి రాణి మధ్యలో నిలబడి పల్లకీతోపాటు నడిచారు.



రెండు సభ్యత్వాల సమస్య ఉత్తుత్తిదే. ఎందుకంటే రష్యావారికి తమకి తలవంచని ప్రధానమంత్రిగాని, విదేశాంగమంత్రికాని ఉండటం ఇష్టంలేదు. ఇది ఇలాగ ఉండగా జనతా మంత్రివర్గంలో ఒకరికొకరు పరిచయం లేని జనం చాలామంది చేరారు. ఒక మంత్రివర్గంలో పనిచేసేవారిమధ్య పరస్పరావగాహన, విశ్వాసమూ ఉండాలికదా? ఇవి రెండూ లోపించాయి.

సోషలిస్టులకి శ్రీ దేశాయి అంటే ఇష్టం లేదు. 1934లో శ్రీ దేశాయి నాసిక్ జెయిలులో ఉన్నప్పుడు కీ. శే. జయప్రకాశ నారాయణ, పండిత్ నెహ్రూలు ఆయనని తమ కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో చేరమని పిలిచారుట. గుజరాత్‌లో సర్దార్ పటేల్ పలుకుబడి తగ్గించేందుకు తనకి (శ్రీ దేశాయికి) అక్కడి పెత్తనం ఇస్తామన్నారుట. నెహ్రూ విధానాలంటే సర్దార్ పటేల్‌కి అంత ఇష్టంలేదు. అందుకని కాంగ్రెసుని చీల్చివెయ్యటానికి పండిత్ నెహ్రూ ప్రయత్నించారన్నమాట. వాళ్ల ఎత్తులు శ్రీ దేశాయికి నచ్చలేదు. ''మీతో కలవను'' అని ఆయన స్పష్టంగా చెప్పేశారు. సర్దార్ పటేల్, పండిత్ నెహ్రూ మధ్య తగువులో సోషలిస్టులు పండిత్ నెహ్రూ పక్షాన్నే ఉన్నారు. సోషలిస్టులు ఎప్పుడూ ఇంతే. వాళ్లకి నాయకుడనేవాడు పార్టీ బయట ఉండాలిసిందే. వాళ్లలో కొందరి సహాయంతో పండిత నెహ్రూ తమ పార్టీలో చీలికలు తీసుకురాగలిగాడు. ఆయన కుమార్తె శ్రీమతి గాంధీ ఆ సంప్రదాయాన్నే కొనసాగిస్తున్నారు. ఏ క్షణంలోనయినా సరే, సోషలిస్టులలో సగంమంది ప్రభుత్వం వయిపే ఉంటారు. (ఆ ప్రభుత్వం ఎవరిదయినాసరే!) మరొక సగం ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉంటారు. భారతీయసోషలిస్టులు ''శిఖండి'' లాంటి వాళ్ళు. వాళ్ల ఆలోచనలు అన్నీ అయోమయంగా ఉంటాయి. జనతా ప్రభుత్వంలో ఉన్న సోషలిస్టులే ఆ పార్టీ పతనానికి కారకులు అయ్యారు. ఇలాంటి తాడూ బొంగరంలేని వాళ్ళు పెత్తనం చేసినంతకాలమూ దేశంలో మంచి ప్రతిపక్షం అవతరించలేదు.

వీళ్లుకాక పండిత బహుగుణ లాంటి ప్రబుద్ధులూ ఉన్నారు. వాళ్లకి పార్టీలు

మార్చటం తప్ప వేరేమీలేదు. శ్రీ గాంధీ పుస్తకంలో చాలా భాగం పండిట్ బహుగుణకి సంబంధించిన విషయాలు ఉన్నాయి. అసలు ఈ పుస్తకం పేరు "బహుగుణ విలాసాలు" అంటే బాగా ఉండేదేమో! ఈ పండితుడు చాలా గొప్పవాడు— అత్యవసర పరిస్థితిలో శ్రీమతి గాంధితో ఉన్నాడు, ఆ తరువాత జనతాతో, ఆ పిదప శ్రీ చరణ్ సింగ్‌తో, మళ్లీ శ్రీమతి గాంధితో (ఆమె అధికారంలోకి రాగానే). ఇప్పుడేమో ఒక సమయిక్య ప్రజాస్వామ్య సంఘటనలో ఉన్నాడని తెలుస్తోంది.

ఇన్ని పిల్లిమొగ్గలు వేసి ఇలాంటి వాళ్లు ఇంకా ఎలాగ తమ కాళ్లమీదనే నడవగలుగుతున్నారు. ఇంగ్లాండులో శ్రీమతి థాచర్ యొక్క కుడిచెయ్యి అనతగిన మంత్రి సెసిల్‌పార్కిన్‌సన్ తన సెక్రటరీ గర్భం దాల్చటానికి కారకుడయ్యాడు. అయితే ఆమెని పెళ్లి చేసుకోనన్నాడు. దీనివలన పెద్ద గొడవ వచ్చింది. ఈ గొడవతో ఆయన ఉద్యోగం ఊడింది. నేను చెప్పిన పుస్తకాన్నిబట్టి బహుగుణ చాలా సరసుడని తెలుసుకున్నాను. కాని ఆయన ఇంకా రాజకీయాలలోనే ఉన్నాడు. అంతేకాదు ఎందరో పార్లమెంటు సభ్యులని తన చేతికింద ఉంచుకోగలుగుతున్నాడు. దీనంతటినీ గురించి ఆలోచిస్తే — రాజకీయవాదులకి చెల్లినది మామూలు మనుషులకి చెల్లదు, అనిపిస్తుంది నాకు. కాంగ్రెసు (ఇందిర) పార్టీ నాయకుడు మొయిలీ ఎవరికో ఒక జనతాపార్టీ వ్యక్తికి కొన్ని లక్షల రూపాయలు లంచం ఇవ్వబోయాడుట, పార్టీ మార్పించేందుకు. ఆయన ప్రయత్నం నెగ్గలేదు. అయితే, మొయిలీకి ఏ కష్టమూ రాలేదు. బహుశ, అతనికి ఈ సంఘటన ఫలితంగా "మంచి మార్కులు" పడతాయేమో కూడా! గాంధీ పుస్తకం ప్రకారం జార్జిఫెర్నాండెజ్ కొన్ని విదేశీ కంపెనీలవద్ద ధనం వసూలు చేశాడు కాని తను సోషలిస్టునే అంటాడు. మధూలిమాయె తరుచు రష్యా మాతని సందర్శించుకునివచ్చి తటస్థ ఉద్యమంమీద రాసేస్తూ ఉంటాడు. వీళ్లంతా మళ్లీ మంత్రులయి కోట్ల రూపాయలమీద పెత్తనాలు చేస్తారేమో! ఇంకేమయినా ఉందా...

ఇతర ప్రజాస్వామ్యాలలోనూ ఇలాంటి పరిణామాలు వచ్చే ఉండాలి. మట్టినీళ్లని చిలికితే చెత్త పయికి వస్తుంది. అలాగే ఇక్కడా మథనంలో చెత్త పయికి వస్తోందేమో! కొంచెం నిలకడరాగానే ఈ చెత్త అంతా కిందికి దిగిపోతుందేమో! ఈ ఆలోచనలు బాగానే ఉన్నాయి కాని అప్పటికి మరీ ఆలస్యమయిపోతే? ఒక సమాజం భరించగల చెత్తకి పరిమితి అంటూ ఉండదూ? రాజకీయాల చెత్త మాత్రం తక్కువదా? రాజకీయ కాలుష్యం కన్నా చెడ్డది ఉండదు—అని నేనంటే బహుగుణ, లిమాయెలు అంగీకరించకపోవచ్చు... 




"జననీ జన్మభూమిశ్చ—స్వర్గాదపి గరీయసీ"—

మూర్తికి పాండిత్యంతో పెద్దగా పరిచయం లేకున్నా ఆ ఆర్యోక్తి స్ఫురణకు వచ్చింది, బస్ తమ స్వంత వూరి బస్‌స్టాండ్‌లోకి వచ్చి ఆగేసరికి.

అన్నీ తనకు పరిచయమున్న బజారులే ... అయినా నాటికీ నేటికీ ఏవో మార్పులు ...కొత్త కొత్త కాఫీ హోటళ్ళు, సినిమాహాళ్ళు వెలిశాయి. రోడ్లు కొంచెం వెడల్పు చేశారు... మరీ ఈవూరి ఎం.ఎల్.ఎ. మంత్రి అయిన తర్వాత ఆమాత్రం డెవలప్‌మెంట్ లేకపోతే ఎలా ?— రిక్షాలో కూర్చుని తను పుట్టి పెరిగిన వూరుని గురించి కొంచెంసేపు ఆలోచించాడు మూర్తి.

తర్వాత అతడి ఆలోచనలు తన వాళ్ళమీదికి మళ్ళాయి ...

'ఇప్పుడు తను హఠాత్తుగా వూడిపడటం చూసి అమ్మ నాన్న ఎలా అనుభూతి చెందుతారో? ఏమని వ్యాఖ్యానం చేస్తారో ?... తమ్ముడు... చదువు పూర్తయ్యే వుంటుంది. ఏదో ఒక వుద్యోగంలో ప్రవేశించి వుంటాడు. పెళ్ళి కూడా ... ఏమో. జరిగే వుండొచ్చు... వాడివల్లనైనా అమ్మ, నాన్న మవశ్శాంతి పొందగలిగితే అదేచాలు' — మూర్తి కళ్ళు అప్రయత్నంగా చెమర్చాయి.

'పట్టుదలలు పంతాలు తనను తనవాళ్ళకు దూరం చేశాయి... అందరూ వుండే ఎవరూ లేనివాడుగా బ్రతికాడు తను ఇంత కాలం' — తమ యిల్లు సమీపిస్తున్న కొద్దీ దుఃఖం పెల్లుబికి వస్తోంది మూర్తికి.

అయినా నడిబజారు. తను బేలగా మారితే రిక్షావాడు అపహాస్యం చేస్తాడు. తమాయించుకొని తమ యింటి ముందుకు వచ్చాక రిక్షా ఆపమని వాడికి డబ్బులిచ్చి పంపివేసి గేటు తెరిచి లోపలికి వచ్చాడు.

రెండు వాటాలుగా భాగించబడిన డాబా యిల్లు... ఒక వాటా అద్దెకు యిచ్చి ఒక వాటాలో మూర్తి వాళ్ళుండే వాళ్ళు... ఇప్పుడు రెండు వాటాల తలుపులూ మూసి వున్నయ్ ... తమవాళ్ళు ఏ వాటాలో వుంటున్నారో అర్థంకాక సూట్‌కేస్ క్రిందపెట్టి కాసేపు వరండాలోనే నిలబడిపోయాడు. కొద్దిసేపు గడిచింది. రెండు వాటాల్లోంచీ ఎవరూ బయటికి రాలేదు. ఇక లాభంలేదనుకొని "అమ్మా !" అని కొంచెం పెద్దగా పిలిచాడు.

"ఎవరూ !"— మరుక్షణం తలు పుతెరుచుకొని బయటికి వచ్చింది మూర్తి తల్లి కిష్టమ్మ.

"పెద్దాడా ! నువ్వా !!"— ఆమె కనులు మిలమిల మెరిశాయి. ఆ తన్మయత్వాన్ని తట్టుకోలేక "ఏవండీ... పెద్దాడు వచ్చాడు" అని అరిచింది లోపలవున్న భర్త చలపతిని వుద్దేశించి.

తర్వాత కొడుకు భుజంమీద అనునయంగా చేయివేసి "పరాయివాడిలా ఇక్కడే నిలబడి

పోయావ్ ?... పదరా పెద్దాడా లోపలికి''— అని తల్లి అనేసరికి క్రిందవున్న సూట్‌కేస్‌ను చేతికి తీసుకొని చలనమున్న బొమ్మలా ముందుకు నడిచాడు మూర్తి.

''ఏరా పెద్దాడా... కోడలు పిల్లలు కులాసాయేనా ?''— భుజం మీది కండువాతో తడిచెయ్యి తుడుచుకొంటూ ఇవతలికి వచ్చారు చలపతిగారు.

''అయ్యో, మీరు మజ్జిగ పోసుకోకుండా లేచివచ్చారేం ?... పెద్దాడు లోపలికే వచ్చే వాడుగా ?'' అంది కిష్టమ్మ భర్త భోజనం మీంచి లేచివచ్చేసరికి.

''అంత ఆకలి అనిపించటంలేదే ఈపూట... పరేగాని పెద్దాడా నేనడిగింది చెప్పలేదే ?''

—తండ్రి కళ్ళలో అనిర్వచనీయమైన ఆనందాన్నిచూశాక మూర్తిలోని అన్నిసంశయాలు తీరిపోయాయి.

''అంతా బాగానే వున్నారు నాన్నా''— చెప్పాడు సమాధానం.

''మరి అమ్మాయినీ పిల్లల్నీ కూడా తీసుకు రాకపోయావా ?''—

—అలా ప్రశ్నించిన తల్లివైపు చిత్రంగా చూశాడు మూర్తి...ఏ కోడళ్ళి తాముకాదన్నారో అపవిత్రులమైపోయామని భావించారో, కన్న కొడుకును సైతం దూరం చేసుకున్నారో— ఆ కోడల్ని గురించి ఇప్పుడు ఇంత ఆరాటమా ? అమ్మ, నాన్నలలో ఎంత మార్పు !... అసలు ఇప్పుడు తను వింటున్నదీ, చూస్తున్నదీ అంతా... నిజమే !?— సమాధానం లేకుండా నిలబడి పోయాడు.

''ఏమే...పెద్దాడి స్నానానికి నీళ్ళుతోడు... వాడు భోంచేసి వచ్చాక అన్నీ తీరుబడిగా మాట్లాడుకోవచ్చులే''— అన్నారు చలపతిగారు.

''అట్లాగేనండి... రారా పెద్దాడా...'' అని లోపలికి వెళ్ళింది కిట్టమ్మ. తల్లిని అనుసరించాడు మూర్తి.

''కేశవ ఏడమ్మా...''— అంటూ బావి దగ్గర స్నానం చేస్తూ నీళ్ళు తోడిస్తున్న తల్లిని అడిగాడు మూర్తి తమ్ముణ్ణి గురించి.

''వాడికేంరా... చదువు పూర్తి కాగానే కష్టపడి ఉద్యోగం వేయించారు మీ నాన్న... ఇప్పుడు పెళ్ళాం చేతిలో కీలుబొమ్మ...వెధవ... లక్షణమైన సంబంధం అని చేసి నెత్తిన కుంపటిలా తగిలించుకున్నాం ఆ గయ్యాళిని...'' చెప్పింది కిష్టమ్మ.

తను వూహించుకున్నట్లుగానే తమ్ముడి చదువుతోపాటు పెళ్ళికూడా జరిగిపోయిందన్న మాట... కానీ, తనకు తెలియనీయలేదు... మొదట్నుంచీ తనంటే ఎంతో అభిమానం కనపరిచే కేశవకూడా... ఈ అన్నయ్యను మరిచి పోయాడు... ఏమిటో బాధ కాసేపు మెలికలు పెట్టింది మూర్తి హృదయాన్ని.



# మధ్యతరగతి మమతలు

''కేశవ... వాడి భార్య...?'' అడిగాడు పైకి.

''ప్రక్క వాటాలోనే వుంటున్నారు ... వాడు ఆఫీసుకు... ఆవిడ వాళ్ళ పుట్టింటికి... దాని పుట్టిల్లు ఈవూరేలే. వాళ్ళ యిల్లుకూడా పక్కవీధిలోనే తగలడింది...'' — తల్లి కటువైన సమాధానం.

ఇంత కాలమూ తన భార్యను వ్యతిరేకించారు. తనని కాదన్నారు. ఇప్పుడు తమ్ముడి భార్యంటే గిట్టటంలేదు. అలా తమ్ముణ్ణీ దూరం చేసుకుంటున్నారు. ఏం మనుషులు అమ్మ, నాన్న ?— భోంచేసి తీరుబడిగా పడుకొని ఆలోచిస్తున్నాడు మూర్తి.

ఇంతకాలమూ తను ఈ యింటికి దూరం కావటానికి కారణం విశాల... అసలు ఆమె చేసిన నేరం ఏమిటి ?...

మూర్తి కళ్ళముందు గతం గిర్రున తిరిగింది ఒక్కసారిగా...

* * *

అవి మూర్తి కొత్తగా వుద్యోగంలో చేరిన రోజులు... అతిగా స్నేహితులవెంట తిరగటం అతడికి మొదట్నుంచి అలవాటులేదు... వంట

## గూడు చినబోయింది

అందాల పంజరం
అలరించుకొని యుంటి
అందులో నొక చిలుక
అందాల చిలక !

అందమైనది చిలుక
అమృతభాషిణి చిలుక
చిలుక బాసలు వింటె
చిత్తముప్పొంగేది

ఏటి కెదురీతలో
ఏమరగ కొన్నేళ్ళ
గూటిలోని చిలుక
గూడొదిలి పోయింది

గూడొదిలి పోయింది
పంజరం మిగిలింది
గతము గూర్చిన తలపు
కలతలే మిగిలాయి

ఎగిరిపోయిన చిలుక
యెపుడు తిరిగొస్తుంది ?
కలతపడ్డ మనసు
కిల శాంతి యెపుడు ??

— లతిక

చేసుకొని తినటం, ఆఫీసు తప్పితే యిల్లు— తీరిక వేళల్లో పుస్తక పఠనం చేస్తుండేవాడు.

రోజులు గడుస్తూండగానే ఎదురింట్లో వుండే రాఘవయ్య మాష్టారితో పరిచయం ఏర్పడింది మూర్తికి... మధ్య మధ్య వాళ్ళింటికి వెళ్ళటం లోకాభిరామాయణం మాట్లాడటం చేస్తూండేవాడు... ఆ మాస్టారి ఒక్కగానొక్క కూతురు విశాల... వాళ్ళ యింటికి వెళ్ళినప్పుడల్లా ఆమెకూడా కనిపించేది. సిగ్గు అనకుండా మూర్తితో మాట్లాడేదికూడా... ఏదో ఒక విషయంమీద చర్చ జరుగుతూండేది.

విశాల అందంతోపాటు ఆమె అణకువ, తెలివితేటలు మూర్తికి నచ్చాయి... మొదట్లో రాఘవయ్యగారు వున్నప్పుడు మాత్రమే సాగే చర్చలు ఆయన ఇంట్లో లేనప్పుడు కూడా వాళ్ళిద్దరూ యధేశ్చగా మాట్లాడుకొనే స్థాయికి వెళ్ళిపోయింది. ఇది గమనించిన మాస్టారు ఒక రోజు విశాలపై మూర్తి అభిప్రాయాన్ని అడిగారు.

''విశాలంటే నేను, నేనంటే విశాల — ఇద్దరం ఇష్టపడుతున్నాం మాస్టారూ...''

''కాబట్టి పెళ్ళిచేసుకుంటాం మాస్టారూ అంటావ్ ?''

''నిస్సందేహంగానండీ.''

''నీ మనసు నాకు తెలుసు మూర్తీ ... కానీ, అంత్యనిష్ఠూరం కంటే ఆదినిష్ఠూరమే మంచిది అంటారు. అలాగే విశాల విషయంలో నీవంత ఖచ్చితమైన నిర్ణయానికి వచ్చాక నీకో నిజం చెప్పకతప్పదు. ప్రస్తుతం అది నీకు అనవసరమనిపించవచ్చు. అయినా లోకులు పలు కాకులు ... విశాలను వివాహం చేసుకున్నాక రేపు నలుగురూ తలో రీతిగా వ్యాఖ్యానిస్తుంటే నీ మనసు చివుక్కుమనే అవకాశంవుంది ... ''

మాస్టారి మాటలను మధ్యలోనే అడ్డగించాడు మూర్తి.

''మీరు చెప్పదలుచుకున్నది ? ... మీ వర్ణాంతర వివాహం గురించేగా ?''

''ఆ విషయం కూడా నీకు విశాల చెప్పే సిందన్నమాట .. మరి నేను పెద్దలను ఎదిరించి వర్ణాంతర వివాహం చేసుకున్న వ్యక్తిని ... నా భార్య చనిపోయినా ఆమె రక్తం పంచుకు పుట్టిన బిడ్డే ఈ విశాల ... ''

''అన్నీ తెలిసే నేను విశాలను వివాహం చేసుకోవటానికి నిర్ణయించుకున్నాను మాస్టారూ.''

''ఆకర్షణ, వయసు పొంగు ప్రస్తుతం నిన్నుఅలాంటి నిర్ణయానికి పురికొల్పుతోందేమో? నిదానంగా ఆలోచించు మూర్తీ ... వెళ్ళి నీ నిర్ణయాన్ని మీ పెద్దలకు కూడా చెప్పు ... వాళ్ళూ సహృదయంతో అందుకు ఆమోదిస్తే నిరభ్యంతరంగా వివాహమాడు ... '' అంటూ నచ్చచెప్పారు రాఘవయ్యగారు.

ఆయన మాటమీదే తమ వూరు వెళ్ళి




తల్లిదండ్రులకు తన అభిప్రాయం చెప్పాడు మూర్తి.

కొడుకు మాటలు విని "అప్ప! ఒక కుల భ్రష్టుడి కూతుర్నిటరా నువ్వు చేసుకొనేది?" అంటూ పరువు ప్రతిష్టలు గురించి, వంశ గౌరవం గురించి ఏకరువుపెట్టారు వాళ్ళు. "మునుమున పుట్టిన బిడ్డవు. నీ మీద మేమెన్నో ఆశలు పెట్టుకున్నాం. కాబట్టి మా మాట విను ... తప్పితే ఆ కులం లేనివాడి కూతుర్ని నువ్వు చేసుకొంటే మేం సహించేదిలేదు" అని తేల్చిచెప్పారు చివరికి ... అయినా తన పట్టు విడువలేదు మూర్తి. దాంతో "మాతోను, ఈ యింటితోను నీకు ఎలాంటి సంబంధంలేదు ఫో" అంటూ బంధాలనే తెంపుకున్నారు అతడి తల్లిదండ్రులు.

పౌరుషంగా ఇంటినుంచే వచ్చేశాడు మూర్తి. రాఘవయ్య మాస్టారి అనుమతితో దైవసన్నిధిలో విశాలను పెళ్ళి చేసుకున్నాడు.

"ఎంతైనా పెద్దలు ... కోపతాపాలు కలకాలం వుండవు. నువ్వు, అమ్మాయి వెళ్ళి మీ అమ్మనాన్నల ఆశీర్వాదం పొందివస్తే బావుంటుంది మూర్తీ"—అన్న మాస్టారి మాటను తీసివేయలేక తన స్వంత వూరు వెళ్ళాడు మూర్తి భార్యను తీసుకొని.

నూతన దంపతులన్న విచక్షణ కూడా లేకుండా బయటివాళ్ళను బయటికే పంపివేశారు మూర్తి, విశాలను అతడి తల్లిదండ్రులు.

అప్పట్నుంచే ఎవరికి వారే యమునాతీరే అన్నట్టు మారిపోయారు.

కానీ, విశాలది ఎంత మంచి మనసో?

"ఈ నెలనుంచే మీరు ఎంతో కొంత మీ అమ్మా నాన్నలకు పంపాలండి" అంది ఒకరోజు మూర్తితో.

"విశాలా?"

"అవునండి. వాళ్ళు మిమ్మల్ని కన్నారు. పెంచారు ... మీ విషయంలో చిన్నతనంనుంచే వాళ్ళు ఎన్ని ఆశలు పెంచుకొన్నారో ... వివాహ విషయంలో ఎలాగో వాళ్ళ కోర్కె తీర్చలేక పోయారు. కనీసం మిగతా విషయాలలోనైనా వాళ్ళను సంతృప్తిపరచటం మీ విధి."

"అలా అని...?"

"మీ నాన్నగారు రిటైరయ్యారు. మీ తమ్ముడు చదువుకుంటున్నాడు ... ఆదాయంలేని వాళ్ళకు మీరు నెల నెల ఎంతో కొంత పంపితేనే బావుంటుంది."

మెరిసే కళ్ళతో చూశాడు మూర్తి విశాలను... 'తనను ఘోరంగా అవమానించిన వ్యక్తులపట్లకూడా ఇంతటి ఔదార్యం ప్రదర్శించగల వ్యక్తి! ఆమె భార్య కావటం నిజంగా తన అదృష్టమే' అనిపించింది అతనికి.

ఆ ప్రకారమే డబ్బు పంపటం మొదలు పెట్టాడు మూర్తి ... మనియార్డరు తిరుగు రశీదులు రావటమే తప్ప — తల్లిదండ్రులనుంచి ఒక్క ఉత్తరంముక్క కూడా రాలేదు అప్పట్నుంచి...అయితే తాము పంపుతున్న డబ్బును తీసుకోవటమే ఎంతో తృప్తి నిస్తోంది మూర్తి, విశాలలకు.

మూర్తి కూతురు అరుణ పుట్టాక అమకో కుండా కాలంచేశారు విశాల తండ్రి రాఘవయ్య. ఆ తర్వాత కొద్దిరోజులకే అక్కణ్ణుంచి వేరే ప్రాజెక్ట్‌కు మార్చారు మూర్తిని...నవీన్ పుట్టి మూడు సంవత్సరాలైంది...పెరుగుతున్న పిల్లల భవిష్యత్తును ఆలోచించి హైదరాబాద్‌కు రిక్వెస్ట్ ట్రాన్స్‌ఫర్ పెట్టుకున్నాడు మూర్తి. తొందరలోనే సఫలీకృతుడవటం కూడా జరిగింది.

హైదరాబాద్ వచ్చి అతడు సుఖపడిన పాపాన పోలేదు ... మొదట ఇల్లు దొరకటం బ్రహ్మప్రళయమైపోయింది ... రెండు గదులు, అదిరిపోయే అద్దె — అడ్వాన్సుకట్టి సామాన్లను విశాలను తీసుకువచ్చాడు

రాత్రిళ్ళు దోమలబాధ, పొద్దున లేచిరది మొదలు బస్సుల బాధ — వట్టి యాంత్రిక జీవితమైపోయింది మూర్తిది...ఆ జీవితానికే అలవాటు పడిపోవటానికి ప్రయత్నిస్తున్నాడు. అంతలోనే మళ్ళీ ట్రాన్స్‌ఫర్...

"మిష్టర్ మూర్తీ! నీ బాధ నాకు తెలుసు...ఎన్నో ప్రయత్నాలు చేసుకొని నువ్వు ఈసిటీకి వచ్చావ్. నువ్వువచ్చికూడా నిండామూడు నెలలు కాలేదు...అటువంటిది అప్పుడే ట్రాన్స్‌ఫర్. చీటికి మాటికి ట్రాన్స్‌ఫర్ చేస్తే ఒక చిన్న ఉద్యోగి ఎన్ని ఇబ్బందులు పడవలసి వచ్చేది నేను అర్థం చేసుకోగలను... కానీ, నా చేతుల్లో ఏమీ లేదు. పై అధికారుల ఆజ్ఞను పాటించి తీరవలసిందే. తప్పదు ..." అంటూ మూర్తి ట్రాన్స్‌ఫర్‌ను గురించి చెప్పి అతడు వెళ్ళవలసిన వూరు పేరు చెప్పాడు ఆఫీసర్.

ట్రాన్స్‌ఫరై తను ఇప్పుడు వెళ్ళబోతున్నది తన స్వంత వూరే!... మూర్తిలో రకరకాల అనుభూతులు మొదలయ్యాయి.

"ఏది ఎందుకు జరుగుతుందో ఎవరికి తెలుసండీ ... పై అధికారులు తమ స్వార్థం కోసం మిమ్మల్ని మళ్ళీ ట్రాన్స్‌ఫర్ చేశారు. కీడులోనూ మేలే జరుగుతుంది ఒక్కోసారి ... కావాలని ప్రయత్నిస్తే మాత్రం మీకు మీవూరు ట్రాన్స్‌ఫర్ అవుతుందంటండీ?"— ఏమిటో పరమానంద భరితురాలైంది విశాల.

తన తలిదండ్రుల మనస్తత్వం తెలిసివుండీ ఆమె అలా ఆశపడటం చూసి నవ్వుకున్నాడు మూర్తి ... ఎంత మనసుపడి వెళ్ళినా తల్లిదండ్రులు ఆదరించి అందలమెక్కిస్తారన్న భ్రమ మూర్తిలో ఏ కోశానా లేదు మరి.

అందుకే "నేను వెళ్ళి జాయినింగ్ రిపోర్టు యిచ్చి ఇల్లువసతి అన్నీ చూసుకొని వచ్చి నిన్ను పిల్లల్ని తీసుకు వెళ్తాను విశాలా" అని చెప్పి తను ఒక్కడే బయలుదేరి వచ్చాడు మూర్తి.

తీరా ఇక్కడికి వచ్చాక— తల్లిదండ్రుల ఆప్యాయత, వాత్సల్యం చూశాక — వీళ్ళకు దూరమై ఇంతకాలం తను పొరపాటు చేశాడా అన్న తర్కం బయలుదేరింది మూర్తిలో.

* * *

ఒక కునుకు తీసి లేచి మధ్య గదిలోకి వచ్చి కూర్చున్నాడు. చలపతిగారు కూడా అక్కడే

కూర్చొని వున్నాడు ... ఇద్దరికి కాఫీ తెచ్చి యిచ్చింది కిష్టమ్మ.

"నల్లనివన్నీ నీళ్ళు తెల్లనివన్నీ పాలు అనుకున్నాంరా పెద్దాడా ... నిన్ను కోడల్ని ఎంతో అవమానించాం... అందుకు నేను, మీనాన్న బాధ పడని రోజంటూ లేదు ..." అంటూ కుర్చీ పక్కనే క్రింద చతికిలపడింది కిష్టమ్మ. ఆవెంట,

"కోడలి మనసు ఎటువంటిదో మాకు తెలియదా పెద్దాడా !... ఆమే అనుకూలవతే కాకపోతే నెలనెలా మాకు డబ్బు పంపగలిగే వాడివా నువ్వు ?" అన్నాడు చలపతి.

"... మరి కోడలిమీద కొడుకుమీద సదభిప్రాయం వున్నప్పుడు — మీరు మా దగ్గరికి రాకూడదా ? కనీసం అలా అని ఉత్తరం ముక్క కూడా వ్రాయకపోయారు ... మీ అందరికీ దూరమై మేము ఎంత చిత్రహింస అనుభవించామో తెలుసా ?... విశాలకు మీరంటే ఎంత గౌరమో నోటితో చెప్పలేను. ఆమె నిత్యం భగవంతుణ్ణి ప్రార్థించేది మీలో పరిమార్పు గురించే ... ఇప్పుడు మాపట్ల మీ కెంతో అభిమానంవుందని ఏ కొంచం తెలిసినా విశాల సంతోషంతో ఉక్కిరి బిక్కిరై పోతుంది నాన్న గారూ"— తన అభిప్రాయం చెప్పాడు మూర్తి.

'నిజమే పెద్దాడా... కాకపోతే మేం కొంచెం ఆలస్యంగా కళ్ళు తెరవగలిగాం... ఆ తర్వాత ఆత్మాభిమానం అడ్డు వచ్చింది... మీ మొహాలు చూడటంకాదు మా ముఖాలు మీకు చూపించలేకే మేం తెరచాటు బ్రతుకులు బ్రతికాం ఇంత కాలం... నీకు నువ్వే ఏనాడైనా ఈ యింటికి రాకపోతావా అప్పుడు మా మనసు నీకు విప్పి చెప్పకపోతామా అనే నిరీక్షిస్తున్నాం... ఈనాటికి మా నిరీక్షణ ఫలించింది, నువ్వు వచ్చావ్..." అంటూ తమ మనసులను బయటపెట్టాడు చలపతి కన్నీటితో.

# మధ్యతరగతి మమతలు

"మొదటిసారి నువ్వు డబ్బు పంపినప్పుడు మనీయార్డరు తిప్పి పంపిచేస్తామన్నారు మీ నాన్నగారు. నేనే అలా చెయ్యొద్దన్నాను... ఎంత కాదన్నా పెద్దాడు మనరక్తంపంచుకు పుట్టినబిడ్డే. వాడు సహాయపడతానన్నప్పుడు ఆత్మాభిమానాలకు పోయి కాదని తిరస్కరించకండి' అంటూ ఆయనకు నచ్చచెప్పి వప్పించాను... 'తల్లిదండ్రులు కాదన్నా వాళ్లకు నేను సహాయపడుతున్నానన్న తృప్తి అయినా నీకు మిగలాలని' నేనలా చేశాను... అందరమూ గతాన్ని మర్చిపోదాం పెద్దాడా ! ఎందుకంటే తవ్వుకున్నకొద్దీ అంతా అశాంతిమయం ... సరేగాని ఏ తిప్పలు పడైనా నువ్వు నీ వుద్యోగాన్ని ఈ వూరికే మార్పించుకో పెద్దాడా. అందరం కలిసి హాయిగా బ్రతకవచ్చు" — అంటూ ఆకాంక్షను వెళ్ళబుచ్చింది కిష్టమ్మ.

"నీ కోర్కె ప్రకారమే జరిగిందమ్మా... నా వుద్యోగం ఈ వూరికే ట్రాన్స్‌ఫర్ అయింది. అది జరగబట్టే నేను తిరిగి మన యింటికి రావటం జరిగింది..."

మూర్తి ఆలా చెబుతూండగానే సంతోషంలో ఉక్కిరిబిక్కిరై పోయింది కిష్టమ్మ.

"ఏమండీ, విన్నారా! పెద్దాడికి ఈవూరే ట్రాన్స్‌ఫర్ అయిందట... ఇక మనదగ్గరే వుండిపోవటానికి వచ్చాడండి మన పెద్దాడు !" అంది పైకి భర్తనుద్దేశించి.

"భగవంతుడు కరుణామయుడే... మన మొర ఆలకించాడు ... అంతే" అని వూరుకున్నాడు చలపతి కళ్ళు తుడుచుకుంటూ.

"వుద్యోగమే ఇక్కడికి అయనప్పుడు కోడల్ని పిల్లల్ని అక్కడే ఎందుకు వదిలేసి వచ్చావురా పెద్దాడా ?"

తల్లి సందేహాన్ని నివృత్తి చేయలేక పోయాడు మూర్తి వెంటనే.

"గతంలో ఎదురైంది చేదు అనుభవం అయినప్పుడు — తిరిగి దాన్ని పొందటానికి ఎవరు మాత్రం ఇష్టపడతారు ? ... పోనీలే. మించిపోయిందేముంది ... అవసరమైతే నేనే వెళ్ళి అమ్మాయిని పిల్లల్ని తీసుకువస్తాను..."

ఒకనాడు తనను ఛీత్కరించి నానా మాటలూ అన్న మామగారే స్వయంగా వెళ్ళి "మనవూరు వెళ్దాం పదమ్మా" అంటే ఆ కోడలు పొందే ఆనందాన్ని క్షణకాలం పాటు వూహించుకున్నాడు మూర్తి.

* * *

తండ్రి బజారుకు వెళ్ళాడు. తల్లి లోపల పనులు చూసుకుంటోంది... వరండాలో సాలోచనగా వాలుకుర్చీలో కూర్చొని వున్నాడు మూర్తి... బద్ధకం అనిపించి బయటికి వెళ్ళ లేదు అతడు.

అప్పటికి సాయంత్రం ఆరు గంటలు కావస్తోంది... అప్పుడే సతీసమేతంగా కేశవ లోపలికి రావటం కనిపించింది... వాళ్ళ జంటను చూసి మూర్తికి కన్నుల పండుగ అనిపించింది.

మూర్తిని చూసిన కేశవ "అన్నయ్యా !" అంటూ వచ్చి అతణ్ణి వుక్కిరి బిక్కిరి చేశాడు. తర్వాత "ఏమోయ్ ప్రవీణా ! చూశావా... మా అన్నయ్య !" అంటూ మూర్తిని తన భార్యకు పరిచయం చేశాడు.

"నమస్కారం బావగారూ !"— ప్రవీణ మాటల్లోనూ నడతలోనూ ఎంతో విధేయత నమ్రత కనిపించాయి మూర్తికి. ఈఅమ్మాయినా తన తల్లి గయ్యాళి, మహంకాళీ అటోంది ?— అన్న మీమాంస వెంటనే కలిగింది అతడికి.






"నమస్కారం" అని లేచి నిలబడ్డాడు మూర్తి.

"పద అన్నయ్యా మా వాటాలోకి వెళ్ళి మాట్లాడుకుందాం" అని మూర్తిమీద చేతులు వేసి ఆప్యాయంగా తను లోపలికి తీసుకెళ్ళాడు కేశవ.

"ఒకే యింట్లో రెండు వాటాలు— ఈ పద్ధతి నాకు నచ్చలేదురా కేశవా" అన్నాడు మూర్తి కుర్చీలో కూర్చొంటూ... ప్రవీణ కాఫీ సిద్ధం చేయటానికి గావును లోపలికి వెళ్ళింది.

"ఏం చేస్తామన్నయ్యా... ఇంటిలోన పోరు ఇంతింత గాదయా... అన్నారు పెద్దలు... అమ్మకూ ప్రవీణకు పడదు... ఎక్కడ వచ్చిందో తిరకాసు నాకు అర్థం కాలేదు..." అన్నాడు కేశవ.

"పోనీలే... మీరిద్దరయినా చక్కగా వుంటున్నారా ?"

"బ్రహ్మాండంగా..."

"సరేగాని కేశవా, నీ పెళ్ళి విషయం— కనీసం నువ్వైనా వుత్తరం రాయలేదేం ?"

"ఏం చెయ్యనన్నయ్యా... అమ్మ, నాన్న నా కాళ్ళకు బంధం వేశారు... బంధువులు, పరువు ప్రతిష్ఠ అంటూ నా నోరు కుట్టేశారు..." బాధ పడుతూ చెప్పాడు కేశవ.

అంతలో కాఫీ కప్పులతో సిద్ధమైంది ప్రవీణ.

"కాపురానికి వచ్చీ రావటంతోనే మీ తమ్ముడి గారికీ, మీ అమ్మనాన్నలకు వేరు బంధం పెట్టి నందుకు నామీద కోపం వచ్చినట్టుంది బావ గారికి"—అంది ప్రవీణ ఉన్నట్టుండి.

ఖంగు తిన్నాడు మూర్తి.

"లేదు...కానీ, ఇంత పిల్లవు ... ఎందుకు మరి ఇలా చేశావో నాకు అంతుబట్టటంలేదు" అన్నాడు పైకి.

"చెడు లేకపోతే మంచికి గుర్తింపు ఎలా వస్తుంది బావగారూ...పరువు ప్రతిష్ట—గౌరవ నీయమైన సంబంధం — అంటూ నన్ను తమ కోడలిగా చేసుకున్నారు మీ అమ్మ నాన్న...వాళ్ళు నా పట్ల ఎంతో ఆప్యాయత కనపరిచారు. నిజమే...కాదనను...'అదే మీ భార్యపట్ల వాళ్ళు అలా కఠినంగా ఎందుకు ప్రవర్తించారు ?' అని ఆలోచించాను...మారుతున్న వ్యవస్థలో కులం గోత్రం శాఖాభేదం అంటూ కూర్చుంటే ఎలా జరుగుతుంది ?...గుడ్డికన్నా మెల్ల మేలు అన్న భావం మీ అమ్మనాన్నలలో కలిగించాలని వాళ్ళ పట్ల నేనూ ఎంతో కఠినంగా మారాను...చివరికి ఆశించిన విధంగా నే వాళ్ళలో పరిమార్పు కలగటమూ నేను గమనించాను... పెద్దవాళ్ళు— వాళ్ళపట్ల నేను అతిగా ప్రవర్తించాను అనుకొంటే నన్ను మన్నించండి బావగారూ" అంటూ చేతులు జోడించింది ప్రవీణ.

"నీది ఎంతటి విశాల హృదయం ప్రవీణ... విశాల నీకు ఏమీ కాకపోయినా — సాటి ఆడదాన్ని గురించి అంత విపులంగా ఆలోచించి చేయగూడని సాహసం చేశావంటే — నిన్ను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను" అన్నాడు మూర్తి.

"ఇది నా ఒక్కదాని ప్రతిభే కాదు బావ గారూ...మీ తమ్ముడుగారు అందించిన సహాయ సహకారాలే నన్ను కార్యోన్ముఖురాల్ని చేశాయి..." అని అంటూండగానే—

"అంటే ఇంతకాలం నువ్వు ప్రవర్తించిం దంతా నటనన్నమాట !...పెద్ద కోడల్ని మాకు దగ్గిర చెయ్యటంకోసం ఇంతపని చేశావన్న మాట..." అంది కిష్టమ్మ వచ్చి.

"అమ్మా..." అంటూ తల్లికి ఏదో సర్ది చెప్పబోయాడు కేశవ.

"మీ మాటలన్నీ నేను విన్నాను లేరా... ఇక మీరెవరూ నాకు వివరించి చెప్పనక్కరలేదు. పెద్ద కోడలి మనసు వెన్నపూసైతే, చిన్నకోడలి మనసు బంగారం...పెద్దాడా! రేపు వుదయమే మీ నాన్నగార్ని వెళ్ళి పెద్దకోడల్ని పిల్లల్ని తీసుకు రమ్మని చెప్పాను" అంది కిష్టమ్మ.

"అలాగే కానీ అమ్మా." అంటూ తన సమ్మతిని తెలియజేశాడు మూర్తి.

ఆరోజు ఇక కంబైండ్ వంట చేసేద్దామని నిర్ణయించుకొని వంటయింటివైపు వెళ్ళారు అత్తా కోడళ్ళు.

అక్కడే కూర్చొని మాటల్లో మునిగి పోయారు మూర్తి, కేశవలు.

అలా ఎంతసేపు గడిచిందో తెలియదు. ఇంతలో బయటినుంచీ మాటలు.

"నమస్కారం చలపతిగారూ !" పక్కింటి పార్వతీశం కంఠస్వరం.

"నమస్కారం, రావయ్యా పార్వతీశం... వచ్చి కూర్చో" చలపతిగారి మాటలు.

"ఏమిటి ఈవేళ మాంచి హుషారుగా వున్నారు చలపతిగారూ ?"

"మా పెద్దాడు వచ్చాడయ్యా."

"చూసిపోవటానికా ?"

"కాదు. వుద్యోగం ఇక్కడికి మారింది."

"అంటే ... ? మొత్తానికి సాధించారు చలపతిగారూ ... మనవూరి మినిష్టరుగారి చుట్టూ కాళ్ళరిగేట్టు తిరిగినా మొత్తానికి పని జరిగిందన్నమాట ... భేష్."

"పెద్దగా అరవకయ్యా ... మా పెద్దాడు వింటాడు."

"వింటే ఏంలేండి ... ఇహ మిమ్మల్ని కాదనిపోడుగా ?"

"ఎందుకుపోతాడయ్యా ? ఏమైనా పార్వతీశం — నా బిడ్డలు వరాలయ్యా—వరాలు!"

అక్కడ తన బిడ్డల్ని గురించి సగర్వంగా చెప్పకుంటున్న తండ్రిని చూస్తే ఇక్కడ మూర్తి, కేశవల ఛాతీలు ఎగసిపడ్డాయి.

హైదరాబాద్‌నుంచి తనకు అకస్మాత్తుగా ట్రాన్స్‌ఫర్ కావటానికి కారణం తన తండ్రి అని తెలిశాక గర్వపడాలో, సంతోషపడాలో, ఆశ్చర్యపడాలో అర్థంకావటంలేదు మూర్తికి.



# వ్యక్తిగతం



శ్రీ బాబ్‌హాక్ ఆస్ట్రేలియా ప్రధాన మంత్రిగా భారతదేశంలో జరిగే కామన్వెల్తు సమావేశానికి వచ్చారు. కొన్ని సంవత్సరాల కింద ఈయన క్రైస్తవ మతాభిమానిగా కేరళలోని కొట్టయంలో జరిగిన ఒక సమావేశానికి వచ్చారు. అక్కడ వారికి భారత దేశంలో కనపడే ధనికుల — పేదల మధ్య తేడాలు మానసిక పరిమాణానికి కారణాలు అయ్యాయి. క్రైస్తవమతం ఏమి సాధించ లేదు, అవి సోషలిస్టుగా మారిపోయారుట..



మిస్ బ్రిటన్‌గా ఎంపిక అయిన 19 సంవత్సరాల సారా జాన్ హట్ ప్రపంచ సుందరిగా కూడా ఎన్నుకోబడ్డారు ...

ఈవిడ పేరు ఆగ్నెస్ ఫ్రాంక్స్. వివాహిత. ఆవిడ పూర్వీకులు భారత దేశాన్ని 1000 సంవత్సరాల ముందే వదిలివేసి యూరోప్‌లో స్థిరపడిపోయారు. వాళ్లని 'రోమా'లంటారు. తాము మాట్లాడే భాష హిందీయే అని ఆమె అన్నారు. అయితే, అది రాజస్థాన్‌లో వాడే హిందీలాగ ఉంటుందిట. భారత దేశంలోని బంజారాలతో సంబంధ బాంధవ్యాలని పెంచుకోవాలని అనుకుంటున్నారుట యూరోప్ 'రోమా'లు ...



బ్రిటిషు రాజకుమారుడు ఆండ్రూ ఈమెని ప్రేమించాడంటారు. ప్రేమ చల్లారినట్లు తోస్తుంది. ఈవిడ కూడా ఎలిజబెత్ రాణిలాగే భారతదేశానికి వచ్చారు. కూస్టార్క్ అనే పేరు చెవికి కొంచెం ఎంతగా ఉంటుంది ...

# వారఫలం

16-12-1983 శుక్రవారం మొదలు 22-12-1983 గురువారం వరకు

♈ మేషం: విశేష లాభదాయకమైన వారం. సుఖ శాంతులకు ఏ మాత్రం యిబ్బంది లేదు. అయినా వ్యాపార విస్తరణ కార్యక్రమం సాగరాదు. చెడిపోయిన భూములుంటే బాగుచేసే యత్నాలు చేస్తారు. స్త్రీలకు: మరీ 'భరణి' నక్షత్ర జాతకులకు అధిక లాభదాయకం.

♉ వృషభం: ఉద్యోగ రీత్యా మీకు మేలు సంభవిస్తుంది. దూర బంధువులు యింటికి రానున్నారు. వాహనం సంపాదించాలని చేసే యత్నం ఫలదాయకం. గృహానందం, స్త్రీల వలన మనశ్శాంతి, సంతానంలో ఒకరికి ఉద్యోగంలో అవకాశం కనిపిస్తుంది. స్త్రీలకు: 'కృత్తిక' రెండవ పాదం వారు సర్వ విధాలా మేలు పొందుతారు.

♊ మిధునం: ఆరోగ్య విషయంలో చాల మంది జాగ్రత్త వహింపదగిన వారం. ఆదాయం కలిసి రానున్నది. నూతన యత్నాలు కలిసి రాగలవు. 'అభ్రకం' లాంటి గనులందు ఆదాయం ఆర్జింపనున్నారు. వైజ్ఞానికంగా కొందరకు మేలు కనిపిస్తుంది. స్త్రీలకు: ఉద్యోగంలో పై అంతస్థుకు పొయ్యే మార్గం కనిపిస్తుంది

♋ కర్కాటకం: వ్యవహార రీత్యా మేలు సంభవం. 'కోర్టు' వ్యవహారాలుంటే మీకు అనుకూలంగా పరిష్కరింపబడగలవు. వ్యాపార రీత్యా చేసే ప్రయాణాలలో ఎంతో జాగ్రత్త అవసరం. స్త్రీలకు: కళా రంగానుభవం, గలవారికి మేలు సంభవం. ధనలబ్ధి గలదు, గ్రహించాలి.

♌ సింహం: వివాహయోగ్యత వయసునందున్న వారికి అనుకూల దాయక వారం. వస్తు వాహనాలు సమకూర్చుకోగలుగుదురు. నిరాశకు తావు లేని వారంగా గ్రహించి, శ్రమించాలి. చాల మంది ఉద్యోగ రీత్యా ఉన్నత శిఖరాలనందుకోగలరు. స్త్రీలకు: ధనరాబడి, విందు వినోదాలు, విలాస యాత్రలు.

♍ కన్య: 'దీపం ఉండగనే యిల్లు చక్కబెట్టుకోవాలి గదా!' మీకు అనుకూల వాతావరణం ఉన్న సమయంలో బాగా పరిశ్రమించండి. అందులకు ఈ వారం అనుకూల దాయకం. చక్కగా మాట్లాడి కొన్ని వ్యవహారాలలో సదవకాశాలు చూరగొంటారు. స్త్రీలకు: సుఖ సంతోషాలు, శుభ కార్యాలు, విందు వినోదాలతో కాలక్షేపం చెప్పదగిన ముఖ్యాంశాలు.

♎ తుల: ఈవారం నిశ్చయంగా మీరు నాల్గు విధాలా లాభం పొందనున్నారు. ఆలోచించి ప్రయత్నాలకు దిగండి. ఆత్మీయుల ఆలోచనలను శ్రద్ధతో స్వీకరించండి, మేలు జరుగుతుంది. క్రొత్త వ్యాపారాలు ప్రారంభిస్తారు. స్త్రీలకు: ఉద్యోగ ప్రాప్తి, నూతన వస్త్రానుకూలం, విందు వినోదాలతో కాలక్షేపం.

♏ వృశ్చికం: గతంలో చేసిన పొరపాట్లు ఎలాగో ఒకలాగు దిద్దికొంటారు. కొన్ని వ్యవహారాలలో మీదే గెలుపు. 'జూదము, లాటరీ' మున్నగు వ్యవహారాలలో తల దూర్చటం ఏమంత క్షేమకరం గాదు. లేనిపోని అపనిందలు రాగల వారం, గ్రహించండి. స్త్రీలకు: స్థిరాస్తి సంపాదన, గృహ మరమ్మత్తు, కించిత్తు ధనాదాయం గల వారం.

♐ ధనుస్సు: మీరు విలువగల వస్తువులు సంపాదించికోగలుగుతారు. వివాదాలుంటే పరిష్కరింపబడుతాయి. వృత్తి వ్యాపారాలలో ఒకమెట్టు పైకెక్కనున్నారు. గ్రహించండి. స్త్రీలకు: శుభ కార్యాల నుగూర్చిన చర్చ, నూతనంగా ఉద్యోగం సంపాదించుకొనే అవకాశాలు ఉన్నాయి. కుటుంబ ఖర్చులు విపరీతంగా పెరుగుతాయి.

♑ మకరం: ఉత్తములయిన వారి సహాయం లభిస్తుంది. ఉన్నదానితో తృప్తిపడే మనశ్శాంతి ఏర్పడుతుంది. 'ఉత్తరాషాఢ నక్షత్ర' జాతకులకు ధనలబ్ధి, కార్య విజయం, సత్కారం యిత్యాది అనుకూలములు కలిసివస్తాయి. స్త్రీలకు: వ్యాపార రంగంలో మేలు, ధనాదాయం, విందు వినోద కాలక్షేపం చెప్పదగిన అంశాలు.

♒ కుంభం: ఈవారం చాలా అనుకూల దాయకంగా మీ వ్యాపారం సాగిపోతుంది. ఏ సందర్భంలో కూడా మీకు నిరాశ ఏర్పడదు. లోకుల నుండి రావలసిన ధనం అందుతుంది. స్త్రీలకు: నూతనోద్యోగాలు సఫలమవుతాయి. గౌరవ మర్యాదలకు లోపం లేని వారం, గ్రహించాలి.

♓ మీనం: సదవకాశాలు అన్ని రంగాలలో లభిస్తాయి. ధనలబ్ధి, నూతనోద్యోగ ప్రాప్తి, నూతన వ్యాపారానుకూలత, బంధు మిత్రుల మూలాన మేలు చేకూరుట సంభవం. స్త్రీలకు: ముఖ్యంగా 'రేవతి' వారికి సుఖ శాంతులు, ఉద్యోగంలో అధిక లాభం సంభవమయ్యే వారం, గ్రహించి, శ్రమించాలి.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి *

# క్రికెట్..క్రికెట్..



కాస్త ఆగండి ధర్మరాజుగారూ కామెంట్రీ పూర్తయ్యాక రండి!!
మళ్లీ బియ్యే అన్ని పట్టుకెళ్ళి పోయారు జయా!
క్లీన్ బౌల్డన్నమాట
ఆ టీముకి బాగా పరిగెత్తేవాడు కావాలట నువ్వు ట్రై చెయ్యరాదూ గంగన్నా!
పెళ్లికొడుకా...కామెంట్రీ తరవాత విందువుగాని... నేను చెప్పినట్లు చెయ్యి నాయనా!!
క్రికెట్ స్కోరెంతో చెప్పవల్లే..!
PRASAD
ఈ మధ్య ఆటలో మీరు పరుగులేం చెయ్యటం లేదంటగా... ముక్కోణం మీకెవరో గాజులు చీర... పార్సెల్‌లో పంపారు!

శ్రీరియల్

# యక్షగానం

స్వర్గీయ

## శ్రీమతి మాదిరెడ్డి సులోచన

''[illegible] ...''

కారు స్టార్ట్ [illegible] వాడల్లా వెనక్కు [illegible]

[illegible] అంతగా మైమరి[illegible]

[illegible] వివరాలు కలిసినప్పు[illegible]''

[illegible] ? అది అక్కడే ఉందా ! [illegible] కలుసుకోక యెన్ని రోజాలయింది. నువ్విల [illegible] మోసం చేస్తావనుకుంటే అసలు దాన్ని [illegible] చేసేదాన్ని కాదు ...''

''వసంతగారూ ! మొదట ఫోన్ [illegible]య్యండి ... ఊఁ ...'' ఉరిమాడు. [illegible] మనసంతా చికాకుగా ఉంది. ఏమిటీ దౌర్జన్యం ! అతను విసురుగా వచ్చి కారు స్టార్ట్ చేసాడు.

అతని కారు ఆగగానే బేరర్ వచ్చి, కారు తలుపులు తీసి పట్టుకున్నాడు. అతను గదిలోకి వెళ్లేసరికి, అక్కడ స్వతంత్ర [illegible] ఉన్నది. ఆమె ముఖంలో రోజా కనిపించే ప్రసన్నత లేదు.

''హల్లో స్వతంత్రీ !'' అన్నాడు చిరునవ్వుతో.

''హల్లో ...'' అతడిని తీక్షణంగా చూచింది, పొడిగా ఉంటాపలుకరింపు. అతను కూర్చున్నాడు. ఏం తెప్పించమంటారు ! అని అడగ లేదు. అతని ప్రతి కదలిక గమనిస్తూ ఉండిపోయింది.

''ఏమిటి అంత [illegible]గా ఉన్నావు !''

''ఒక్క చిన్న ప్రశ్నకు జవాబు కావాలి.''

(గత సంచిక తరువాయి)

''ఒక్క ప్రశ్న వెయ్యటానికి ఇంత [illegible] !'' నవ్వేసాడు శివాజీ.

[illegible] చిన్నదే. మీ జవాబు యెలా [illegible] ఇష్టం అయినా కాకపోయినా [illegible] చెప్పాలి.''

[illegible] కాదు అడగండి.''

''[illegible] ఆవిడ ... అదే వసంతగారికి [illegible]''

[illegible] పడినట్లు అయింది.

''[illegible]... [illegible]... నా పేషెంటు ...''

[illegible]

[illegible]

''[illegible] చాలా రకాలుగా [illegible]

''[illegible] ఒక బలహీనమైన క్షణంలో ...'' చెప్పలేక పోయాడు. తల [illegible]కున్నాడు.

''[illegible] నా ధన్యవాదాలు.'' అన్నది.

''ఈ విషయం నీకెలా తెలుసు ! నువ్వెలా ఊహించావు !'' అని అడగలేక అడిగాడు.

ఆమె అతని ఉద్దేశం గమనించిందేమో ! తనే జవాబు చెప్పింది.

''నేను ట్యాప్ చెయ్యాలని కాదు. మీతో పాటు సినిమాకు వెళ్లాలనిపించింది. ఫోన్ చేసాను. ఫోన్‌లో విచిత్రమైన సంభాషణ వినిపించింది. పెట్టెయ్యబోయాను. నా పేరు వినిపించింది. కుతూహలంగా విన్నాను. నా పేరు కూడా తరచుగా వినబడేది అయితే ఎవరిదో అనుకునే దాన్ని...'' అన్నది.

''మైగాడ్...'' అతను తెల్లబోయినా, సిగ్గుతో అతని ముఖం ఎర్రబారింది. అతనికి మూడు రోజులనాటి ఫోన్ సంభాషణ గుర్తుకు వచ్చింది. వసంత ఫోన్ చేసింది.

''హల్లో...''

''వసును. బుగ్గలమీదా, పెదవులమీదా నా ముద్దులు...''

''వసూ ! ఏమిటి అల్లరి ?''

''నా మాటలు అల్లరి అంటున్నావా ! స్వతంత్ర వచ్చి, అప్పుడే నీ స్వాతంత్ర్యాన్ని బంధించిందా ! లేక నా కంటే తీపి ముద్దులు పెట్టిందా !''

''వసూ !... ప్లీజ్ ... ప్లీజ్ ...'' అన్నాడు వారింపుగా.

''అప్పుడే భార్యంటే అంత భక్తి ! అలా అయితే ఈ పెళ్లి చెడగొడతాను. ఒక్క విషయం గుర్తుంచుకో, స్వతంత్ర నీఇంటికి అధికారిణి కావాలి కాని నీ హృదయానికి కాదు. హృదయం యెప్పుడూ నాదే'' అన్నది అతిశయంగా.

''వసూ... ప్లీజ్ అలా మాట్లాడవద్దు.''

''ఆమె అప్పుడే అంత ప్రీతిపాత్రురాలయిందా !''

ఆ నిష్ఠూరాలన్నీ స్వతంత్ర వింటుందని తనేం కలగన్నాడా ! ఫోన్‌లు కూడా ఇంత ప్రమాదభరితమయినవని ఈ రోజే తెలిసింది. అతను తల ఎత్తలేకపోయాడు.

''మీరు అంతగా బాధ పడాల్సిందేం లేదు. కాని నేను వచ్చాక కూడా ఇది ఇలాగే కొనసాగితే, నాతో మీ వివాహం అర్థం లేనిదంటాను'' అన్నది. ఆ నిక్కచ్చితనం అతనికి బాగా నచ్చింది.

''స్వతంత్రా ! నీకు ప్రామిస్ చేస్తున్నాను. ఇక మళ్లీ అలాటిది జరుగదు. ఈ రోజు నుండి,

**జరిగిన కథ — 7 :** నీలిమ, ఆదిత్య పరస్పరం ప్రేమించుకొంటారు. వారిద్దరూ కలసి [illegible] రంగు బయటకు లాగుతుంటారు. నీలిమని, చిన్నబాబుకిచ్చి పెళ్లి [illegible] విషయంలో [illegible], ముకుందాదేవి ఘర్షణ పడతారు. తన అత్త చనిపోయిన [illegible] మళ్లీ పెళ్లి చేసుకోవటానికి ప్రయత్నాలు చేస్తుంటాడు వసంత సహాయంతో డా॥ శివాజీ. స్వతంత్రను పరిచయం చేస్తుంది వసంత డా॥ శివాజీకి. ఆదిత్య డా॥ శివాజీ హాస్పటల్లో రోగులకు ఫిజియో థెరపీ చేయించటానికి చేరతాడు.

వేను డాక్టరుగా అందరివాడిని, వ్యక్తిగా నీ వాడిని'' అన్నాడు ఆమె చేతులు పట్టుకుని.

''థాంక్స్...'' అన్నది అతని జుట్టు సవరిస్తూ.

''ఏం తీసుకుంటావ్...'' అన్నాడు, ఆమె చేతులు చెంపన కానించుకుని. ఆ స్పర్శలో ఆవేశం లేదు. ఎన్నో ఏళ్ల పరిచయం ఉన్నట్టు అనిపించింది.

''మీరు బొంకుతారేమో నాల్గు దులిపి వెళ్లిపోదాం, అనుకున్నాను'' అన్నది.

''అది కాదు వసంత...'' ఆమె చప్పన అతని నోటికి చెయ్యి అడ్డం పెట్టింది.

''ఆ విషయాలు మనమిద్దరం ఉన్నప్పుడు ఎత్తకూడదు.''

''థాంక్యూ స్వతంత్ర...థ్యాంక్యూ'' ఆమె చెయ్యితీసి పెదవులకు తాకించుకున్నాడు.

''భోజనం చేద్దాం...'' చెయ్యి లాక్కుని, సర్వర్‌ను పిలిచింది. భోజనము వచ్చేవరకు ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.

''పోనీ మొన్నటి సినిమా ఈరోజు చూద్దామా!'' అన్నాడు శివాజి. ఆమె నవ్వింది.

ఇద్దరూ సినిమా చూచాక ఆమెను ఇంటి దగ్గర దింపాడు.

''మీ పర్సులో ఎంత ఉందో చూడండి...''



అన్నది. అతను పర్సుతీసి ముందు పెట్టాడు. అందులో నుండి అయిదు వందలు తీసుకుంది.

''ఎందుకని అడగరేం ?''

''అవసరం అనుకుంటే నువ్వే చెబుతావు కదూ!''

''ఈ రోల్డ్‌గోల్డ్ రింగులతో మీకూడా తిరుగటానికి సిగ్గుగా ఉంది. ఒక జత దిద్దులు కొనుక్కుంటాను'' అన్నది. అతని కళ్లలో ఒక్కసారి మెరుపు మెరసి మాయం అయింది.

అంత నిర్మొహమాటంగా ఉండాలి.

''ఇంకా తీసుకో.''

''చాలు, మళ్లీ కొనుక్కుంటాను. రేపు ఎప్పుడయినా మీ పనివాళ్ళు అబ్బ వచ్చేరోజా ఇత్తడి బొచ్చెలతో వచ్చింది అనకుండాఉండాలని'' నవ్వింది స్వతంత్ర.

డాక్టర్ శివాజి వెనక్కు తిరిగాడు. ఈ యువతి తన జీవితాన్ని శాసించగలదన్న నమ్మకం కల్గింది. అతను స్నానంచేసి మళ్లీ నర్సింగ్ హోమ్‌కు వెళ్లాడు.

''ఫోన్ సర్.''

''యెవరిది ?''

''వసంతగారు.''

తల ఆడించాడు. అతని భావం గ్రహించింది నర్స్, అతను లేడని చెప్పింది.

''నేను చెప్పింది ... పార్థసారధిగారి కండి. రాగానే ఏమయినా చెప్పమంటారా !'' ఆమె చెప్పింది విని ఫోన్ పెట్టేసింది.

''థాంక్స్ సిస్టర్ ! ఆమె చేసినప్పుడు, ఏదో ఒక వంకన తప్పించండి'' అన్నాడు. వెంటనే అతని మనసు మేలుకున్నది. 'నువ్వు చేసేది అన్యాయం' అంటూ. అతను వెళ్లి వసంతకు అసలు విషయం చెబుదాం అనుకున్నాడు. అదే మంచిది. అతని రౌండ్స్ పూర్తి అయ్యేలోపల మరో అయిదారుసార్లు ఫోన్ వచ్చింది. వసంతను తలుచుకుంటే జాలివేసింది. ఒంటరిగా వెళ్తే ఒదలదు.

''ఆదిత్యా ! మనమొక చోటికి వెళ్లాలి. నా వెంటరా.''

''పదండి సర్...''

ఇద్దరూ వసంత ఇల్లు చేరారు. అతని కారు హార్న్ ఆమెకు చిరపరిచితమే.

పరుగు, పరుగున వచ్చింది.

''ఉదయం నుండి నన్నేడిపించినందుకు శిక్ష ఏమిటో తెలుసా...! '' అంటూ వచ్చి ఆదిత్యను చూసి ఆగిపోయింది.

''ఆదిత్యా ! నువ్వు కూర్చో...'' అతను లోపలికి వెళ్లాడు.

''అతనెవరు ?''

''ఈరోజే ఫిజియోథెరపి చేయించటానికి చేరాడు. అతని బంధువులకెవరికో బాగాలేదుట,

ఇటీవల తాడేపల్లిగూడెంలో జరిగిన తెలుగు సాహితీ సమాఖ్య 144వ సమావేశంలో ప్రముఖ రచయిత శ్రీ కొండముది శ్రీరామ చంద్రమూర్తికి మొమెంటోని అందజేస్తున్న డా. తేతలి వెంకటరత్నం, కార్యదర్శి శ్రీ డి. బి. వెంకటరత్నంగార్లని చిత్రంలో చూడవచ్చు.



# యక్షగానం

నువ్వు చాలాసార్లు ఫోన్ చేసావని తెలిసింది. చూసివెళ్దాం అని.''

''ఆ పేషెంటును చూచిరా.''

''అలా పిలుకాదనే వచ్చాను వసూ, ఏమిటో త్వరగా చెప్పు.''

అతని అసహనము, తొందర ఆమె అహాన్ని దెబ్బతీసాయి.

''మీ ఆవిడ... కాబోయే ఆవిడ చూస్తుం దని భయమా !'' అన్నది వెటకారంగా. అతను కూర్చుని సిగరెట్టు వెలిగించాడు.

''ఇన్నాళ్లు ఎలాగో సాగింది, ఇకముందు అలా సాగదు వసూ. మనము ఎక్కువగా కలుసుకుని అందరి నోళ్లలో ఎందుకు నానాలి.'' అన్నాడు.

''వారెవ్వా ! చాలా బావుంది. స్వార్థానికి మారు పేరు మగాడు. ఇన్నాళ్లు నీకో స్త్రీ కావలసివచ్చింది. నన్ను వాడుకున్నావు. ఇప్పుడు నీకో భార్య వస్తుందేమో ! నా అవసరం అంతగా ఉండదేమో.''

''నువ్వు అలా పెడార్థాలు తీస్తే నేనేం చెప్పలేను. మనము రహస్యంగా కలుసుకుంటూ ఎవరి కంట పడినా అసహ్యంగా ఉంటుంది.''

''ఇన్నాళ్లు లేదా !''

''ఇన్నాళ్లు ఉన్నా, 'వీళ్లకేం పోయేకాలం' అనుకుని ఉంటారు. ఇప్పుడు నా భార్య కళ్లు నామీదే ఉంటాయి.'' అని లేచాడు.

''ఏమిటి . నీ భార్య...'' వెటకారంగా నవ్వింది.

''చూడు వసూ ! కొన్ని మనకు తెలియకుండా జరిగిపోతాయి. దీనికి మీవారు బాధ పడవల్సింది కాని అతను పడలేదు. మనము ఇప్పుడయినా జాగ్రత్తగా ఉండాలి. అదే నేను చెప్పదలిచింది.'' అతను బయటికి వచ్చాడు.

ఆదిత్యను తీసుకుని బయలుదేరాడు. ఆదిత్యను వెంట ఎందుకు తీసుకువెళ్లాడు. ఆమెనుండి తనను, తాను రక్షించుకోవాలని తెచ్చాడా! అన్యాయం !

ఆదిత్యను దింపేసి ఇంటికి వచ్చాడు. అతను వచ్చేసరికి అరవింద్ ఏడుస్తున్నాడు. యెవర్నీ దగ్గరకు రానియ్యటంలేదు. శివాజీ వెళ్లి అడిగాడు. తండ్రిని కొట్టి దూరంగా వెళ్లాడు.

''ఏమిటి నాన్నా !''

''నన్ను... నన్ను జూకు తీసుకువెళ్తా నన్నావ్...''

''సారీ... ఇప్పుడు రాత్రి అయింది. రేపు తప్పకుండా తీసుకువెళ్తాను. అరవింద్ ఈజ్ ఎ గుడ్ బాయ్... అరవింద్ ఈజే డార్లింగ్ బాయ్...'' కితకితలుపెట్టి, నవ్వించాడు.

అతను స్నానం చేసి, కొడుకుతో కబుర్లు చెబుతూ భోజనం చేసాడు.

''డాక్టరుగారూ... డాక్టర్‌గారూ...''

శివాజీ అటు తిరిగాడు. అందమైన యువతి చిగురుటాకులా వణికిపోతున్నది. ఆమెను చూస్తుంటే చిత్రమైన భావం కల్గింది.

''ఎవరమ్మా !''

''నందనరావు అమ్మాయినండి. నాన్నగారు మాట్లాడటంలేదు...'' ఆమె కళ్లలో నీళ్లు కిందికి దూకడానికి సిద్ధంగా ఉన్నాయి.

శివాజీ లేచి, బట్టలు వేసుకున్నాడు.

''డాడీ... నేను వస్తాను'' అరవింద్ తయారయ్యాడు.

''నువ్వు తాతయ్యతో కబుర్లు చెప్తూ ఉండు. నేను వెళ్లి పేషెంటును చూచి వస్తాను'' కొడుకు బుగ్గపై ముద్దుపెట్టాడు. తన కారు తీయబోయి,* ఇంటి ముందు కారు చూచి, వెళ్లి ఆమె ప్రక్కన కూర్చున్నాడు. ఇద్దరూ కృష్ణకుంజ్ చేరేసరికి చిన్న ఒక్కడే ఉన్నాడు.

''ఇంట్లో ఎవరూ లేరా !''

''మా అమ్మ ఒక దేవుడు డాక్టరుగారూ!''

''ఆఁ! నాగలింగం ఒకసారి చెప్పారు. ఇంకా ఒకరిద్దరు కూడా చెప్పారు. మీ అమ్మగారి దర్శనం చేసుకుందామని మరిచేపోయాను'' అన్నాడు.

''ఆమె భక్తుల కెవరికో, ఆస్తి కలిసి వచ్చింది. కనకాభిషేకం చేస్తామని తీసుకు వెళ్లారు. తాలూకా లెవెలులో సన్మానం కూడాను. ఎందుకో నాన్న మాట్లాడటం మానేసారు.''

శివాజీ నందనరావును పరీక్ష చేసాడు.

''ఆస్పత్రికి తరలించాలి. గ్లూకోజ ఇవ్వాలి...''

''అవసరంవస్తుందని స్టాండు తెప్పించాను. మీరు అయిదు నిమిషాలుంటే నేను తీసుకు వస్తాను'' అన్నది నీలిమ.

మరో పదిహేను నిమిషాలకు నందనరావుకు గ్లూకోజు ఎక్కింది. శివాజికి నీలిమను చూస్తే వదిలిపోదామనిపించలేదు.

''మీరు వెళ్లండి డాక్టరుగారూ.''

''పరవాలేదు. ఆదిత్య ఎంతో అవసరం కదా. అతను ఎందుకు పంపారు !'' అన్నాడు.

''డాక్టరుగారూ ! అదంతా చెప్పానా, మీరు నన్ను ట్రీట్ చెయ్యాల్సి ఉంటుంది. మరోసారి చెబుతాను. మీకు కాఫీ, టీ...'' అన్నది.

''అవసరం అనుకుంటే అడుగుతాను కూర్చో...'' మరోసారి నందనరావును పరీక్షించాడు.

''ఆయన స్థితి ఎలా ఉంది !'' కంగారుగా అడిగింది.

''నువ్వేం విచారించకు. ఈ పేషెంట్ల స్థితి ఇదీ అని చెప్పలేము'' అన్నాడు. ఆమె చమర్చిన కళ్లు తుడుచుకుంది.

''కార్డ్స్ ఉంటే పట్టా... మిస్.. నీలూ...''

నీలిమ చిన్నగా నవ్వింది.

"మిస్‌ను. మిస్‌చేసినా నేనేమీ అనుకోను."

"థ్యాంక్యూ..." అన్నాడు. ఆమె కార్డ్స్ తీసుకువచ్చింది. అతను పంచాడు. అరగంట కోసారి నందనరావు పరిస్థితి పరిశీలిస్తూ, ఇద్దరూ కార్డ్స్ ఆడారు. రెండుపార్లు టీ కాచి తెచ్చింది నీలిమ.

ఉదయం అయిదు గంటలకు అతను లేచాడు. నీలిమను వదిలి, ఆమె సమక్షం వదిలి పోవాలని లేదు.

"మీ నాన్నకేం ప్రమాదం లేదు నీలూ! నీతో కార్డ్స్ ఆడటానికయినా వస్తాను" అన్నాడు.

"థ్యాంక్యూ వెరిమచ్! మీ అమూల్యమయిన కాలం ఇక్కడ గడిపారు..." అన్నది.

"అదేం లేదమ్మా! ఈ మధ్య ఏనాడు పొందని రిలీఫ్ ఏదో కల్గింది. ఎందుకు అంటే ఇందుకు అని చెప్పలేను." అతను తమాషాగా భుజాలు ఎగురవేసాడు. అతడిని ఇంటిదగ్గర దింపి వచ్చింది.

"పేషెంటుకెలా ఉంది శివా!" పార్థసారధి అడిగాడు.

"హి ఈజ్ అవుటాఫ్ డేంజర్, ఒక్క గంట పడుకుంటాను." అని పోబోతుంటే పనివాడేదో చెప్పబోయాడు.

పార్థసారధిగారు చెప్పనీయలేదు.

శివాజి రెండు గంటలు నిదురబోయి లేచాక, స్నానం, ఉపాహారం, అయ్యాక మెల్లగా చెప్పాడు.

"మిసెస్ చంద్రసేన్ రాత్రి ఆత్మహత్యా ప్రయత్నం చేసింది. రాత్రి ఒంటిగంటకి నర్సింగ్ హోమ్ తెచ్చారు. నౌ అవుట్ ఆఫ్ డేంజర్..."

శివాజి ముఖం మలినమయింది.

"మీరు అటెండ్ అయ్యారా!"

"అవును. ఆమె అపస్మారకం స్థితిలో చాలాసార్లు నిన్ను గుర్తు చేసింది. శివా, మనకు బలహీనతలుంటే ఉండవచ్చు. వృత్తికి చాలా దూరంగా ఉంచాలి." అన్నాడు.

"సారీ..."అనగలిగేడు. అరగంట తరువాత అతను నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళాడు. ముఖ్యమయిన వారు, బాగా ముట్టచెప్పేవారు, వారిని చూచి, పదకొండు గంటలకు వసంత గదికి వెళ్ళాడు.

నీరసంగా దిండ్లనానుకుని కూర్చుంది.

"చాలా సాహసం చేశావట."

"నేను... నాకు స్పృహలేని స్థితిలో ఇక్కడికి తెచ్చారా..." అన్నది ముఖం అటు తిప్పుకుని.

"కాని పిరికిగా ప్రవర్తించావు."

"అంతకంటే మార్గం లేదు."

"నాకు నమ్మకం లేదు."

"నువ్వు... నువ్వు మగాడివి శివా! నా హృదయం అర్థంచేసుకోలేవు. అందమైన పువ్వు మీద వాలి లేచి పోవటం తుమ్మెదల పని. నేను మాత్రం నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. ప్రేమిస్తాను."

"వసూ!"

"దీనివల్ల వచ్చే పాప పుణ్యాలు, కష్ట నిష్ఠూరాలు అన్నీ నీకే చెందుతాయి." అన్నది నిష్ఠూరంగా.

"వసూ..." అతను అప్రయత్నంగా హృదయానికి హత్తుకున్నాడు. అయిదు నిమిషాలు అలాగే ఉండిపోయారు.

"లే శివా... నేను అంటే అన్నింటికి తెగించినదాన్ని. నీకు పరువు మర్యాద ఉన్నాయి." అన్నది.

"నిష్ఠూరమా!"

"నిజం." అన్నది.

"రెస్ట్ తీసుకో ..." అని బయటికి వచ్చేసాడు. రౌండ్స్ పూర్తిచేసుకుని తన గదికి వచ్చాడు. అతని బల్లమీద అందమైన ఎర్రడబ్బా ఉంది, దానిక్రింద బిల్ ఉంది. బిల్లు పైన అందమైన అక్షరాలు, పొందికగా కూర్చినట్టుంది.

డాక్టర్‌గారూ!

నమస్తే! దిద్దులు కొనుక్కుని, ఈరోజు నా పుట్టినరోజు మిమ్మల్ని ఆహ్వానించాలని వచ్చాను. మీరు వసంతను మరిచిపోలేదు. మరిచి పోలేని బంధం అని అర్థం అయింది. మరిచి పొమ్మనే హక్కు నాకు లేదు. అందుకే వెళ్లి పోతున్నాను. ముప్పై సంవత్సరాలు గడిచాయి. మరో పదేళ్లు గడువకపోవు, మిమ్మల్ని ఇబ్బంది పెడుతూ, నేను ఇబ్బంది పడలేను...స్వతంత్ర.

అతనికి ఏంచేయాలో తోచలేదు.

వసంత ఆత్మహత్యకు పోలేదు. ఆమె పరిధిలో ఆమే రైటే.

స్వతంత్ర ఆలోచన సబబయినదే! తనే... తనే తప్పటడుగు వేసాడు. 'అక్రమసంబంధాలతో అనుబంధాలు పెంచుకోరాదు బ్రదర్' అని ఓ కవి అన్నమాటలు గుర్తుకు వచ్చాయి. ఉత్తరం పదే...పదే చదువుతూ కూర్చున్నాడు.

ఆరోజు కృష్ణకుంజ్ ఆవరణంతా కలకలలాడిపోతున్నది. ఒక గొప్పింటి కోడలు అర్పణ చేయిస్తున్నది. అయిదేళ్లుగా వాయిదాపడిన పెళ్లి జరిగింది. అది కృష్ణభగవానుని అనుగ్రహంతో అయిందని ఆమె భావన.

బంగళాలోని జనం అంతా మందిరం ముందే ఉన్నారు.

నీలిమ కృష్ణకుంజ్ వైపు వెళ్తూ, తండ్రికి అందుబాటులో అన్నీ అమర్చింది.

"నాన్నా! ఈరోజు అమ్మ అవతారం చాలించాలి."

"అదొక వ్యసనం నీలూ! చాలించదు."

"నేను చాలింప జేస్తాను."

"మీకు యెలా ఉందంకుల్!" ఆదుర్దాగా వచ్చాడు ఆదిత్య.

ఆదిత్యను చూడగానే నందనరావు కళ్లు మిల, మిలలాడేయి.

"రా బాబూ! ఇంకా ఆ దేవుడికి నా కాగితం దొరకలేదేమో" అన్నాడు నవ్వుతూ.

"డాక్టరుగారు ఆయన పనులలో ఉండి మరిచిపోయారు. ఈరోజు మాటల సందర్భంలో చెప్పారు"వచ్చి నందనరావు వడిలోకూర్చున్నట్టే, ఆయన ప్రక్కన కూర్చున్నాడు.

అదెంతో రిలీఫ్ ఇచ్చిందతనికి.

"ఆదిత్యగారూ! నా పేరు నీలిమ, నందనరావు కూతుర్ని"

"అలాగా! అంకుల్ కూతురింత ఉండేది. ఇప్పుడు చాలా పెద్దదయినట్టుందే."

"ట్యూబ్‌లైటు అనుకున్నాను."

నందనరావు పక్కున నవ్వాడు.

"బావుందమ్మా మీ వాదన, వెళ్లమ్మా. ఆదిత్య వచ్చాడు కదా."

"అంకుల్‌ని నేను చూచుకుంటాను"

"చూచుకుంటానంటే కాదు, నేను వచ్చే వరకు ఉండాలి."

"అజ్ఞ..." తల వంచాడు.






"అతనికి వెళ్ళాలని ఉందా ! మీ అమ్మకు జడిసి వెళ్తాడు,కదయ్యా! "అన్నాడు నవ్వుతూ.

"అంటికి కాదంకుల్ ! నీతికి, నిజాయితీకి, భయపడ్డాను." అతను నీలిమను బయటికి రమ్మని కళ్ళ చిలికిలించటం గమనించకపోలేదు. ఆమె వెళ్లిన ఒక నిమిషానికి తనూ లేచాడు.

"ఇప్పుడే వస్తానంకుల్...ఒక్క నిముషం"

"ఎక్కడికి ?"

"ఎందు బోయెదవన్న ఎదురు తంబలి కన్న..."

నందనరావు పకా, పకా నవ్వేడు.

"కమలాకర్ ! ఈ వారసత్వం నీకు వదిలేశాడా !" అన్నాడు.

మందిరం ముందు వేణూ నాదం వినిపిస్తున్నది. మోహన రాగంలో, ఎంతో మనో హరంగా వినిపిస్తున్నది. వేణూ నాదం వినిపించే సరికి సాధారణంగా నీలిమ అక్కడుండాలి. నీలు, ఆదిత్య ఒకరినొకరు చూసుకుంటన్నారు.

"వెళ్ళ నీలూ !"

"వెళ్తాను. నువ్వు దుర్మార్గుడివి" అన్నది.

"నిన్ను చూడకుండా ఉండాలని యెంత శ్రమపడ్డానో నీకు తెలియదు నీలూ..." అన్నాడు, ఆ బాధ అంతా గొంతులో ధ్వనింప జేస్తూ.

## యక్షగానం

"నాకు తెలుసు ఆదిత్యా ! అమ్మ యెందు కంత పట్టుదలగా ఉందో అర్థం కాదు. నామీద తనకు ఒక్కదానికే అధికారం ఉన్నట్లు చేస్తుంది. నాన్న నీ సమక్షంలో ఎంత హాయిగా నవ్వుతాడు! అలా నవ్వగల్గిననాడు ఆయన ఆరోగ్యం ఎంతో బావుంటుంది. ఆయన కోసమయినా నేను నిన్ను కట్టి బంధించాలి."

"దేనిలోనో..."

"చేతులతో..." చటుక్కున తన రెండు చేతులు అతని మెడకు వేసి, బుగ్గపై చుంబించింది.

"నీలూ..."అతను నుదురు చుంబించాడు.

వేణూ నాదం ఆగిపోయి నాదస్వరం ప్రారంభం అయింది. వెంటనే ఇద్దరూ దూరంగా జరిగారు.

"వస్తాను ఆదిత్యా !"

"ఒక ఆసక్తికరమైన విషయం చెబుతాను. త్వరగా వచ్చెయి." ఆమె వెళ్ళి,వెదురుబొంగులు ముందేసుకుని కూర్చుంది. ముకుందాదేవి తీక్షణంగా చూచింది. సత్యవతి చిన్నగా నవ్వింది. నీలిమకు ఆ వాతావరణంతో ఎంతో మార్పు కనిపించింది.

ఏనాడూ భగవంతుడి అవతారం ఎత్తాక, జనం ప్రశ్నలతో విసిగించేవరకు ఆమె ముఖంపై విసుగు చూడలేదు.

అలాగే, ఎనాడూ సత్యవతి నవ్వగా చూడలేదు.

"అదేమిటమ్మా ! లెక్కలేనన్ని వెదురు బొంగులిచ్చావ్ !" అన్నాడొక భక్తుడు.

"ఓ... పొరపాటు..." చైనులు లేడు.

ముకుందాదేవి, చేతికర్ర కోల్పోయిన ముసలి పాంధుడిలా తడుముకుంటున్నది. నీలిమ ధైర్యం చేసింది.

"భక్తురాలా ! ఈ రోజు భగవంతుడికి అనారోగ్యం... మీరు విసిగించకూడదు" అన్నది.

ఒకతను ఫక్కున నవ్వాడు.

"భగవంతుడికేం జబ్బు ! నువ్వు మాట్లాడకు." అందరూ నవ్వినా, కొందరు కోపంగా చూచారు.

అన్నతను చైనులు బంధువు అని గ్రహించింది నీలిమ. ఆమెకు ఆరాటంగా, అశాంతిగా ఉన్నది. అనుభవజ్ఞురాలయిన తల్లి, ఏదో విధంగా నెట్టుకువస్తుందని, డబ్బులు తీసుకుని వెదురు బొంగులు ఇచ్చింది. నిజంగానే తెలివిగా నెట్టుకు వస్తున్నది ముకుందాదేవి.

(ఇంకా వుంది)



# ఆంధ్రపత్రిక

## చందా వివరాలు

| | ఏజంటు ద్వారా | పోస్టు ద్వారా |
|---|---|---|
| 1 మాసం | 15–40 | 17–30 |
| 3 మాసములు | 46–20 | 51–90 |
| 6 మాసములు | 92–40 | 103–80 |
| 1 సంవత్సరం | 184–80 | 207–60 |




## ఎం. ఎస్. — విజయవాడ

కొంతమంది పిల్లలు ప్రేగు మెడకి వేసుకు పుడుతూ ఉంటారు. దానికి ప్రత్యేక కారణాలు గలవా ? సుఖవ్యాధి ఉన్నవాళ్ళు మూత్ర విసర్జన చేసిన చోట మామూలువారు మూత్ర విసర్జన చేస్తే ఆ రోగం వస్తుందా ?

★ ప్రేగు మెడలో వేసుకుని పుట్టటానికి ప్రత్యేక కారణాలేమీ లేవు.

మూత్ర విసర్జన ఒకే చోట చేసినంత మాత్రాన సుఖరోగం రాదు. లైంగిక కలయిక అవసరం.

## ఎ. ఎల్. — ఉయ్యూరు

నాకు 19 సం॥లు. వివాహం కాలేదు. 20 రోజులుగా మర్మస్థానంలోను గజ్జలలోను దురదగా ఉన్నది. సినిమాకి వెళ్ళినప్పుడు అశుభ్ర ప్రదేశంలో మూత్ర విసర్జనవల్ల ఇలా వస్తుందా?

★ మూత్ర విసర్జన అశుభ్ర ప్రాంతాలలో చేసినంత మాత్రాన దురద రావటం జరుగదు. మొనీలియల్ ఇన్‌ఫెక్షన్ ఉన్నా, ఫంగస్ ఇన్‌ఫెక్షన్ ఉన్నా ఇలా దురద రావచ్చును. లేడీ డాక్టర్లను సంప్రదించి రోగ నిర్ధారణ తర్వాత తగిన మందు వాడాలి.

## పి. ఎస్. ఎం. — మచిలీపట్నం

చిన్న పిల్లలకి పోలియో రాకుండా డ్రాప్స్ వేసే విధంగా పెద్దలకి పక్షవాతం రాకుండా ఏమైనా మందులు ఉన్నాయా ? ఆహార అలవాట్లలో మార్పు అవసరమా ?

★ పక్షవాతం రాకుండా వాడబడే డ్రాప్స్ లేవు. పక్షవాతం అనేది మెదడు లోపలి భాగంలోని నరాల కూడలి స్థానం అయిన ఇంటర్నల్ కాప్స్యూల్‌వద్ద నున్న రక్తనాళాలు చిట్లటమో లేక వాటిలో అవరోధం ఏర్పడటమో జరిగితే ఏర్పడే రోగం. అధిక రక్తపుపోటు, డయాబెటిస్, మొదలయినవి ఈ రోగానికి దోహదం చేస్తాయి. ఆహారంలో అధికంగా క్రొవ్వు పదార్థాలు వాడే వారికి ఈ రోగం రాగల అవకాశం ఎక్కువ.

## ఎం. ఎఫ్. — పలమనేరు

మా అమ్మకి 55 సం॥లు. 3 సం॥లుగా పలచగా బ్లీడింగ్ మరియు వైట్ డిశ్చార్జి అవుతున్నది. ఎన్ని మందులు వాడినా తగ్గటం లేదు. బి. పి. కూడా ఉంది. నీరసం ఎక్కువ.

★ వయస్సు మీరిన వారిలో పై లక్షణాలు ఉంటే గర్భాశయంలో కేన్సర్ ఉన్నదీ లేనిదీ వైద్యులచేత పరీక్షింప చేసుకొని నిర్ధారించవలసి ఉంటుంది.

బి. పి. ఉన్నవారు వైద్యుల పర్యవేక్షణలో అడెల్‌ఫేన్ ఎస్ర్డెక్స్ వంటి మాత్రలను వాడవలసి ఉంటుంది. ఆహారంలో ఉప్పు తగ్గించటం చాలా అవసరం.

## జి. యస్. ఎల్. — వైజాగ్

బ్రాంకైటిస్ అంటే ఏమిటి ? ఎందువలన వస్తుంది ? ఏ మందులతో తగ్గుతుంది ? బలానికి ఏమి వాడాలి ?

★ గొంతు నుంచి ఊపిరితిత్తులకి గాలిని తీసుకొనిపోయే గాలి గొట్టాలను బ్రాంకై అని అంటారు. ఈ బ్రాంకైల లోపలి పొర వాయటాన్ని బ్రాంకైటిస్ అని వ్యవహరించటం జరుగుతుంది. గాలి మార్పులు, సూక్ష్మక్రిముల ప్రభావం, అలర్జీ మొదలయిన కారణాలవల్ల బ్రాంకైలు వాయటం జరుగుతుంది. రోగలక్షణాలనుబట్టి, యాంటీ హిస్టమిన్, యాంటీ బయాటిక్ మొదలయిన మందులు వాడవలసి ఉంటుంది.

బలానికి మందులకన్నా పుష్టికర ఆహారమే మంచి మార్గం. టానిక్‌లన్నీ ఆకలిని మాత్రమే పెంపొందింపచేస్తాయి. అదీ తాత్కాలికంగానే!

## పి. ఎ. — గూడూరు

ప్రతినెలా మెన్సస్ టైములో నడుము పగలగొట్టుతోంది. క్రిందిపొట్ట గట్టిగా బిగదీసి బెరాల్గాన్ ఇంజెక్షన్ చేస్తే తగ్గుతుంది. కడుపు నెప్పి వచ్చేటప్పుడు మల విసర్జన ద్వారం వద్ద విపరీతంగా నెప్పి ఉంటుంది.

★ ఈ లక్షణం కన్‌జెస్టివ్ డిస్మెనోరియాను సూచిస్తుంది. మీరు లేడీ డాక్టర్లవద్ద పరిశోధింప చేసుకోవాలి. ఆంధ్రపత్రిక దినపత్రికలో (డాక్టర్ కబుర్లు) ఈ లక్షణం గురించి వివరించటం జరిగింది.

## ఎన్. వి. — తిరుపతి

నా వయస్సు 19 సంవత్సరములు. నా కుడి రొమ్ము మామూలుగానే వున్నది. ఎడమ రొమ్ము మాత్రము కొంచము ఎత్తుగా వున్నది.

★ కొన్నాళ్ళపాటు గమనిస్తూ రండి. తగ్గకపోతే శస్త్ర వైద్యుల సలహా పొందవలసి ఉంటుంది. చాలామటుకు ఈ వాపులు వాటంతట అవే తగ్గిపోతాయి. 






# కోటి విద్యలు...

— సర్వజిత్



గూడూరు బస్ స్టాండ్ నుంచి ఎక్స్‌ప్రెస్ బస్సు బయల్దేరింది. బస్సు ఏమంత రద్దీగా లేదు. ఎలా లేదన్నా ఇంకా రెండుగంటల పైచిలుకు మద్రాసు ప్రయాణం.

మధ్యాహ్నం మూడు గంటలు దాటుతోంది. బస్సులో చాలా మంది నిద్రతో జోగుతున్నారు. కొంత మంది మూసుకుపోతున్న కనురెప్పల్ని బలవంతాన తెరుస్తూ బేగ్, సూట్‌కేసూ వగైరా సామాన్లు పదే పదే చూసుకుంటూ అవస్థ పడుతున్నారు.

ఎక్స్‌ప్రెస్ బస్సే అయినా మరీ పాసింజరులా వెళ్లటంల్లేదుగానీ ఎక్స్‌ప్రెస్‌లా మాత్రం లేదు. వేసవి ఎండలా ఉంది వాతావరణం.

కండక్టరు ఏదో చార్ట్‌మీద టిక్కట్టు నెంబర్లు నోట్ చేసుకుంటున్నాడు.

''అమ్మో నా పర్సు'' అన్న అరుపుకి బస్సులో జనం ఉలికిపడి ఆవైపు చూశారంతా.

వెనుకవైపు మూడో సీట్లో ఉన్న వ్యక్తి లేచి జేబు లెతుక్కుంటూ క్రిందా మీదా చూస్తుంటే ''ఏం జరిగిందండీ!'' అనడిగాడు కండక్టరు వెనక్కి తిరిగి.

''నాపర్సు కొట్టేశారెవరో.''

''పర్సా! కొట్టేశారా!'' ఒక్కసారిగా డజను కంఠాలు ఆశ్చర్యంగా, ఆదుర్దాగా అడిగాయి.

మగత నిద్రగాళ్లూ, సగం నిద్రగాళ్లూ ఉలికిపడి లేచేశారు.

''అన్నీ వెతికా. కనపట్టల్లేదు.''

''అసలు బస్సెక్కేటప్పుడు ఉందా!'' ఎవరో అడిగారు.

''బస్సు ఎక్కేగదా నేను టిక్కట్టు తీసుకున్నాను.''

''చూడండి. చూడండి. ఎవరో పిక్‌పాకెట్‌గాడు ఉండిఉంటాడు.''

''ఇందాకా బస్సు ఆపినప్పుడు సోడా కూడా త్రాగాను ''

''అంటే ఆ తర్వాతే పోయిందన్నమాట.''

''నా ప్రక్కన ఈయన ఒక్కరే గా కూర్చున్నది.'' అని ఆ వ్యక్తి తన ప్రక్కన కూర్చున్న వ్యక్తి వైపు ముఖం చిట్లించుకుని చూశాడు.

'అవును సుమా' అన్నట్లు ప్రక్కవ్యక్తికేసి అంతా కళ్లు ఇంతచేసుకుని మరీ చూశారు.

అతను బిత్తరపోయేడు. ఎలాగో తేరుకుని అన్నాడు నెమ్మదిగా. ''మరోసారి జాగ్రత్తగా చూసుకోండి'' అని.

''ఏవిటి చూసుకునేది. అన్నీ చూసుకున్నాను. ఉంటే ఎందుకరుస్తాను. పెద్దమనిషిలా ప్రక్కన కూర్చుని పిక్‌పాకెట్ చెయ్యడం ఈ ఇడియట్స్ ప్రజ్ఞ.'' అన్నాడు పర్సుపోయిన ఆసామీ కోపంగా.

ఆ మాటకి ప్రక్కవాడికి కోపం వచ్చింది.

జనం అంతా జేబుదొంగల్ని వాళ్ల వాళ్ల పరిభాషల్లో ఇష్టంవచ్చినట్లు తిడుతున్నారు.

అమితాబ్ బచన్ స్టైల్లో క్రాఫింగు, నల్లద్దాల కళ్లజోడు, చేతిలో ఓ సినిమాపత్రిక, చిన్న హేండ్‌బ్యాగ్‌తో ఉన్న ఆ పర్సు పోగొట్టుకున్న వ్యక్తిపట్ల జనం సానుభూతులు, సలహాలు వగైరా వగైరాలతో కాలక్షేపం చేస్తున్నారు.

పర్సుపోయి నల్లద్దాల కళ్లజోడతను తన సీట్లో నిల్చుని, కూర్చుని, ప్రక్కన కూర్చున్న అతన్ని గుర్రుగా చూస్తూ,ఏవేవోమాట్లాడుతూ నానా హంగమా చేస్తున్నాడు.

అలా పావుగంట గడిచేసరికి ప్రక్కవాడిని దొంగగా తేల్చేశాడు నల్లద్దాల కళ్లజోడతను.

దానికితోడు ప్రక్కవాడు ఛామనఛాయ రంగులో, శుభ్రంగా నున్నటి గుండుతో, కాస్త మాసిన బట్టల్లో ఉండటం జేబుదొంగ అయ్యే అర్హత సంపాదించుకున్నట్లున్నాడు.

'తన పర్సు అతనే తీశాడని' అరుస్తూ మరీ చెప్పాడు కళ్లద్దాలవాలా.

''నేను తియ్యడమేమిటి! చూడకుండా మాట్లాడకండి. నేనూ ప్రభుత్వోద్యోగిని. దొంగతనం చెయ్యాల్సిన ఖర్మ నాకేంలేదు.'' ఎలాగో అన్నాడు గుండు ఆసామీ.

''అసలా మనిషి చూడండి ఎట్లా ఉన్నాడో. ఉద్యోగట. ఆ లక్షణాలున్నాయా.''

''ఇది బస్సు కాబట్టి సరిపోయింది. మంచి మాటలతో చెబుతున్నాం. అదే బయటయితే ఈపాటికి నాలుగు తన్నకుండా ఉండేవారా!''

''అసలు నా ప్రక్క కూర్చున్నప్పుడే అనుమానం వచ్చిందండీ. నే సోడా తాగినప్పుడు,

సిగరెట్ పెట్టి కొనుక్కున్నప్పుడూ పర్సు తీస్తే ఆశగా చూశాడు. దాంట్లో వందనోట్లున్నాయి.'' కళ్లద్దాలపర్సు పోయిన ఆసామీ అంటున్నాడు.

గుండు వ్యక్తికి ఏడుపొచ్చింది.

'తను వాడి పర్సు కొట్టెయ్యడమేమిటి ? పైగా వాడు చెబుతున్నవి శుద్ధ అబద్ధం. వాడు టిక్కట్టు తీసినప్పుడూ, సోడా త్రాగినప్పుడు పర్సు తీసినట్టు లేదు. జేబులోంచి ఇరవయ్యో, పదో కండక్టరికి ఇచ్చాడు సరికదా వాడసలే సిగరెట్టుపెట్టె కొనలేదు. పర్సు తీసి కండక్టర్‌కి డబ్బులిచ్చింది తను. కూల్‌డ్రింక్ తాగింది తను. సిగరెట్ పెట్టెకొన్నది తను. ద్రాక్షపళ్లు కొన్నది తను ... అసలు వాడికి పర్సు ఉందా ! తనను దొంగనుచేసి వాళ్లంతా...' అతను ఏడుపు ఆపుకోలేక జేబురుమాలుతో ముఖం తుడుచుకున్నాడు.

వాడి మాటే వింటున్నారు కానీ తనమాట వీళ్లు వినటల్లేదు.

''దిక్కులు చూడటం కాదు. మర్యాదగా పర్సు బయటకి తియ్యి.'' అని అతని కాలర్ పట్టుకున్నాడు కళ్లద్దాల వాలా.

''ఉండండి బస్సులో ఏవిటి గొడవ !'' అంటూ వచ్చిన కండక్టరు : ''ఏవయ్యా పక్కన కూర్చుని ఏం పనులయ్యా ఇవి.'' అని సర్ది చెబుతున్నాడు.

గుండు అతను ఏదో చెప్పబోతున్నా అతని మాట ఎవరూ వినిపించుకోటల్లేదు.

తలోకరు తలోక మాటగా ప్రపంచంలోని నీతి వాక్యాల నన్నింటినీ విసిరేస్తున్నారు.

# కోటి విద్యలు...

చివరికి డ్రైవరుగారికి కోపం వచ్చి బస్సు టక్కున ఆపేశారు.

''ఏటి వీరాస్వామీ ఆ గొడవ. అరగంట బస్సాపేస్తాను అందరి జేబులూ చెక్ చేయించు దరిద్రం వదిలిపోద్ది.'' అని కండక్టర్‌ని ఉద్దేశించి అరిచాడు.

''నువ్వు సీట్లోంచి లే'' అన్నాడు గుండు వ్యక్తిని కళ్లద్దాల అతను.

''వెతకండి వెతకండి'' అంటున్నారు అంతా.

గుండు అతనికి బస్సులోంచి దూకి చద్దామనిపించింది. ఏ ముహూర్తాన ఇంటి దగ్గర బయలుదేరాడో బస్సులో ఇలా పదిమంది ముందూ 'దొంగ'లా తలవంచాల్సి వచ్చినందుకు భరించరాని బాధ కలిగిందతనికి. పది మందికీ చేతులు జోడించి 'నేను దొంగని కాదు బాబూ' అని చెప్పాలనుకున్నాడు. కానీ తన మాట వినటల్లేదు వాళ్లు.

కళ్లద్దాల వాలా కోపంగా అతని వళ్లంతా సోదాచేస్తున్నాడు. వెతికినచోటనే మళ్లీ మళ్లీ వెతికాడు.

''ఏవిటి దొరకలేదా'' అడిగాడు కండక్టరు.

''మా వెర్రిగానీ ఇంకేందొరుకుతుందండి. దొంగసొమ్ము తీసినట్లే ఉంటుందా, చేతులు మారదూ ! '' అన్నారెవరో.

కళ్లద్దాలతను చెయ్యెత్తాడు కొట్టడానికి. ఇంతలో డ్రైవరు అక్కడికొచ్చి అడ్డుకున్నాడు. ''అతని జేబులూ అన్నీ వెతికారు దొరకలేదు. బస్సులోమాత్రం ఘర్షణపడకండి. పావుగంట బస్సు ఆపుతాను అందర్నీ చెక్‌చేసుకుంటానంటే సరి, లేదా మద్రాసులో పోలీసుల కప్పగించి మీరూమీరూ తేల్చుకోండి.'' అన్నాడు.

''అందర్నీ చూసుకోమనండి, మా కేం అభ్యంతరంలేదు.'' అని ఓ స్త్రీ అన్నది.

తన దగ్గర దొంగసొమ్ము దొరకనందుకు అదే పదివేలనుకుని దేవుళ్లకి కోటిదండాలని కిక్కురుమనకుండా బిగుసుకుపోయి కూర్చున్నాడు గుండువాలా. సోదాచేయడంలో జేబురుమాలు, జేబులో కాగితాలు వగైరా గత్తర బిత్తరగా ఉన్నా సర్దుకోవడానిక్కూడా ప్రయత్నించలేదు, జేబులో చెయ్యి పెడితే వాళ్లకి అనుమానం వస్తుందని.

బస్ అంతా చెక్ చేశారు. ఎవరిదగ్గరా ఏమీ దొరకలేదు. తన సీట్లో కూర్చుని గట్టిగా అరుస్తూ తిట్టుకుంటున్నాడు కళ్ళద్దాల వాలా. 'ఎక్కడేనా పారేసుకున్నాడేమోలే'అని ఒకళ్లిద్దరు చిన్నగా అనుకున్నారు.

ముప్పావుగంటకి మద్రాసులో ఆగింది బస్సు. విసురుగా కళ్లద్దాల వాలా సీట్లోంచి లేచి బయటికి గుండు ఆసామీని తోసుకుని మరీ రాబోయాడు.

ముందుసీటు వెనకాల మేకో మరేదో కళ్లద్దాల ఆసామీ ఫేంటికి పట్టి జేబు చిరగడం జేబులో ఉన్న పరుసు క్రింద పడటం క్షణంలో జరిగిపోయింది.

''అది నా పర్సు'' అని ఒక్క గావుకేక పెట్టాడు దాన్ని చూడగానే గుండు వ్యక్తి.

బిలబిలాపోతున్న ప్రయాణీకులు గబుక్కున వెనక్కి చూశారు.

''నిజం ఆ పర్సు నాదే. అతని జేబులోంచి క్రింద పడింది. కావలిస్తే పరుసు చూడండి'' అనేశాడు గుండువాలా గుక్కతిప్పుకోకుండా.

ఎవరో వంగుని ఆ పర్సు తీసివిప్పిచూశారు. అందులో గుండువాలా ఫోటో, ఆ క్రింద వి. పరంధామ్, బి. ఏ., తర్వాత ఆఫీసు ఎడ్రసు హోదా ఉన్నాయి.

''నన్ను సోదా చేస్తున్నప్పుడు అతను కొట్టేసి ఉంటాడు.'' గబగబా అనేశాడు పరంధామ్ ఉరఫ్ గుండువాలా.

అప్పటికే గుమ్మం దగ్గరికి చేరుకున్న కళ్లద్దాలవాలా గబుక్కున క్రిందకి గెంతి మళ్లీ వెనక్కి చూడకుండా పరుగెత్తాడు.

పరంధామ్ ఊపిరి పీల్చుకున్నాడు. తన పరసు అందుకుని జేబులో వేసుకుని, సూట్‌కేస్ తీసుకుని దర్జాగా బస్సు దిగాడు. దిగుతూ అందర్నీ ఓసారి చూశాడు. తమ ముఖాలు ఎక్కడ పెట్టుకోవాలో తెలీక జేబురుమాళ్లతో దాచుకున్నారు వాళ్లు.

అప్పటికి కాని మరో అయిదుగురి జేబులు ఖాళీ అయ్యాయన్న సంగతి వాళ్లకితెలీలేదు...★



## ప్రేమికుని నిజాయితీ!

కౌలాలంపూరుకు చెందిన 24 ఏళ్ళ రామస్వామి అనే వో యువకుడు నాలుగేళ్ళ క్రితం ధనలక్ష్మి అనే ఒకామెను ప్రేమించి వివాహం చేసుకోబోయే సమయంలో ఆమెకు అనారోగ్యం చేసిందట. గత మూడేళ్ళుగా ఆమె అనారోగ్యం తోనే వున్నదట. ఆ అనారోగ్యంలోనే అతనామెను రిజిష్టరు పెళ్ళిచేసుకుని, జబ్బు నయంఅయ్యాక శాస్త్రోక్తంగా పెళ్ళిచేసుకోడానికి యీ ఏడు ముహూర్తం పెట్టించుకున్నాడట. దురదృష్ట వశాత్తూ ఆమె చనిపోయిందట. అయినా ఆ రామస్వామి ఆమె తలిదండ్రులకు చెప్పి వప్పించి, శవానికి పెళ్ళికూతురుగా అలంకరింపజేసి వైదిక సంప్రదాయంగా మంత్రాలమధ్య మంగళసూత్రం కట్టి, అనక తానే ఆమె అంత్యక్రియలూ యధా శాస్త్రంగా చేశాడట.




## నగలకోసం హత్య!

బెంగళూరుకు సమీపంలోగల పేరిగై అనే వూరుకు చెందిన 45 ఏళ్ల రాములమ్మ అనే ఆమెకు ముప్ఫయ్యయిదు ఏళ్లక్రితం పెళ్లయిం దట. భర్తపోయి 28 ఏళ్లయ్యిందట. ఆనాట్నుంచి ఆవిడ యింట్లో వో బడ్డీకొట్టులా పెట్టుకు బాగా గణించుకుని, డాన్ని గుణించు కున్నదట. మొన్న ఎనిమిదో తేదీన ఇంటికి తాళం వేసుందట. రెణ్ణాళ్ళయ్యాక యింట్లోంచి దుర్వాసన ఆరంభించేసరికి ఆమె ఏదో వూరువెళ్ళుంటుందనుకున్న వారికనుమానం వచ్చి పోలీసులకు చెప్తే వాళ్ళొచ్చి తలుపులు పగలేసి చూస్తే లోపల శవం పురుగులు పట్టి వున్నదట పీకనొక్కి ఎవరో చంపినట్టు శవం నాలుక బయటికి చూపివుందట. ఇంట్లోనూ, ఆమె వొంటిమీదా నగాన్రటా వుండాల్సినవి లేవట.

## పాలక్షని జోరి

## 35 వేల పాము చర్మాలు!

ఢిల్లీ పాలం విమానాశ్రయానికి దగ్గర్లో వున్న సమానిఖ అనే వో చోటులోని వో యింటిలో కస్టమ్స్ అధికారులకు ముప్ఫయ్యయిదు వేల పాము చర్మాలు దొరికాయట. వాటి విలువ భారతదేశంలో ఎనిమిది లక్షలయితే, విదేశాలలో నలభై లక్షలకుపైగా వుంటుందని పట్టుకున్న శాఖ ప్రకటించిందట.

### బందిపోటుకి సవాలు ?!

భిండ్ అనే వూరిలో ఒక బందిపోటు పూల్‌చంద్ అనే వ్యాపారిని చంపిన దానికి ప్రతీకారంగా కొందరు ముసుగువీరులు ఆ బందిపోటు నాయకుడు సురేష్ ఇద్దరు తమ్ముళ్ళనూ, మేనల్లుణ్ణీ ఎత్తుకుపోయి సవాలు చేశారట — ఏమని ?

### రోజుకి మూడు కోట్ల ఉత్తరాలు!

భారత దేశంలో తంతి తపాలా శాఖ ఏడాదికి పదకొండు వందల కోట్ల వుత్తరాలు దేశంలో నలుమూలాలా బట్వాటా చేస్తోందట. అనగా ఒక రోజుకు సుమారు మూడు కోట్ల వుత్తరాలు పంచుతూన్నదన్నమాట.

### విశాఖరేవుకి మూడో స్థానం!

మన దేశపు, మన రాష్ట్రపు విశాఖ ఓడ రేవు భారతదేశంలోకల్లా మూడో అగ్రస్థానం ఆక్రమించిందట. ఏటికి 120 లక్షల టన్నుల సరుకులను ఎగుమతి దిగుమతుల పనులలో భరిస్తున్నదట. ఏటికి యీ రేవు అయిదు వేల మిలియను రూపాయలు సంపాదిస్తోందట. 1933లో ఆరంభింపబడిన యీ రేవు యీనాటికి దేశంలోని గొప్ప రేవులలో మూడో స్థానం పొందిందట.

### ఆత్మహత్యకి దారితీసిన విరక్తి!

కన్నంకురిచ్చి ( తమిళనాడు ) కు చెందిన 20 ఏళ్ల మాదేశ్వరి అనే అమ్మాయికి మొన్న వో కొడుకు పుట్టి ఆ మర్నాడే చనిపోయాడట. పెళ్లయిన నాలుగేళ్లలో ఇది ఆమెకు మూడో కాన్పట. మొత్తం ముగ్గురూ పుట్టిన మర్నాడే చనిపోడంతో మనకిహ పిల్లలు నిలిచే భాగ్యం లేదని ఆమె విరక్తిచెంది గన్నేరుపప్పు తిని, చనిపోయిందట.

### ప్రాణం తీసిన దొంగతనం!

ఒంగోలుకు చెందిన సంపత్ ఆంజనేయులు అనే ఒకతను ఒకనాటి మిషన్ హాస్పిటల్ భవనం దిక్కులేనిది వుండగా దాంట్లోంచి ఓ దూలం ఒకటి తస్కరిద్దామని, ఆ ప్రయత్నం చేసేసరికి ఆ దూలం అనుకోనివిధంగా వూడి, మీదపడి, ఆ ఆంజనేయులే చనిపోయాట్ట.

### చలితగ్గే సూచనలు!

పారిశ్రామికంగా ప్రపంచం అభివృద్ధి అవుతూన్న యీ శుభ సమయంలో ప్రపంచ వాతావరణంలో చలి తగ్గే సూచనలు అధికంగా వున్నాయని, వో నలభైయ్యేళ్ళలో అత్యధిక చలి దేశాలలో కూడా "ఆ" చలి వుండదనీ దీనికి కార్బానిక్ ఏసిడ్స్ వుత్పత్తి కారణమనీ రష్యాకు చెందిన డాక్టర్ గొలిచ్ అన్నారట— ఎగదీస్తే గో హత్య, దిగదీస్తే బ్రహ్మహత్యలా వుంది కధ.




### బస్సు లోయలో పడి 29 మంది మరణం

మదనపల్లిలోని వో వివాహానికి బస్సుడు జనాన్ని తీసుకువెళ్తున్న బస్సు హార్స్లీ కొండల మీద ప్రయాణం చేస్తూండగా ఆ బస్సుకు బ్రేకు ఫెయిలయినందువల్ల గతి తప్పి కొండ మీంచి వో మైలు కిందకు దొర్లిపడిపోయిందట. తత్ఫలితంగా ఆ బస్సులోని 62 మంది ప్రయాణీకులలో 29 మంది అక్కడి కక్కడే చనిపోయారట. మిగిలినవారిలో 26 మంది చికిత్సలో వున్నారట — బస్సులాటి వాహనాలకు బ్రేకు ఫెయిలయినపుడు ఎమర్జెన్సీ బ్రేకువంటిది ఒకటి యీ విజ్ఞానం కనిపెట్టరాదా! అదీ ఒకవేళ ఫేలయితే...

న్యూస్‌పేపర్ ఆఫీసు ఎడిటోరియల్ సెక్షన్ చాలా సింపుల్‌గా ఉంది. కోడి గుడ్డు ఆకారంలో ఉన్న పెద్ద టేబిలు చుట్టూ కొన్ని కుర్చీలున్నాయి. మూడింట్లో ముగ్గురు కూర్చుని ఉన్నారు.

ద్వారం దగ్గిరే నిలుచుని వాళ్ళలో శంకరం గారెవరయి ఉంటారా అని అంచనా వేయ బోయాడు హరి. ఇంతలో బట్టతల, తెలుపు మీసాలు ఉన్న ఒకాయన తలెత్తి చూసి చిరునవ్వుతో ఆహ్వానించాడు.

''హరిప్రసాద్ కదూ మీరు ?''

''అవునండి.''

''ఇప్పుడే విశ్వమూర్తిగారు చెప్పారు మిమ్మల్నిగూర్చి'' అంటూ పయికి లేచాడాయన.

అప్పుడు చుట్టూ కళ్ళుతిప్పి పరికించి చూశాడు హరి. ఆ విశాలమయిన హాలు నాలుగు గోడల వెంబడీ పూర్తిగా స్టీలువీ, చెక్కవీ రాక్‌లూ,అల్మెరాలూ ఉన్నాయి. రాక్స్ అన్నిట్లో వందలకొద్దీ ఫైల్సూ, పెద్ద బౌండు పుస్తకాలు ఉన్నాయి.

ఫైలొకటి పట్టుకుని వచ్చాడు శంకరం.

దాన్లోంచి పాస్‌పోర్ట్ సైజ్ ఫొటో ఒకటి పిన్‌చేసి ఉన్న ఒకటైప్డ్ షీట్ హరి చేతికిచ్చాడు. ''ఇదుగో ఈ అమ్మాయి మొన్న రిపబ్లిక్ డే సెలబ్రేషన్స్‌లో, బెస్ట్ ఎన్.సి.సి. కేడెట్ ప్రైజ్ అందుకుంది రాష్ట్రపతి నుంచీ. ఆ అమ్మాయిదీ ఊరే. ఆ అమ్మాయిని ఇంటర్వ్యూ చేయాలి. ఈ రోజు మధ్యాహ్నం పన్నెండు గంటలకి, ఇక్కడ అడ్రస్ ఉన్న కాలేజీకివెళ్ళితే, కేంటీనులో ఆ అమ్మాయి మీ కోసం వెయిట్ చేస్తూ ఉంటుంది. ఒక అరగంట టయిం ఉంటుంది. అన్ని వివరాలు సేకరించి, రిపోర్ట్ తయారుచేసి సాయంత్రం ఎడిటరుగారికి ఇచ్చెయ్యండి.

ఇదుగో ఇది మీ ఐడెంటిటీ కార్డ్. మీ ఫొటో ఒకటి అతికించి ఆఫీస్ సీల్ వేయించండి'' అంటూ ఓ పసుపు పచ్చని కార్డుఫోల్డర్ ఇచ్చాడు హరికి. అన్నీ జేబులో పెట్టుకుని తన సెక్షన్‌కి వెళ్ళాడు హరి.

ఒకవయిపు రషీద్, బాబు బిజీగా కంపోజ్ చేస్తుంటే, మరోవయిపు ప్రెస్ పనిచేస్తున్న శబ్దం వినిపిస్తోంది. ప్రింటు అయిన కాగితాలకి రంగు రంగుల అట్టకాగితాలని చేర్చి ఒక్కో పుస్తకంగా చేర్చి బైండు చేయటానికి తయారు చేస్తున్నారు మరొక ఇద్దరు పనివాళ్ళు.

ప్రూఫ్ రీడర్‌కి చేయాల్సిన పని చెప్పేసి, తన సీట్‌లో కూర్చున్నాడు హరి. కాస్సేపు ఆలోచించుకుని, తెల్లకాగితం తీసుకుని వరసగా కొన్ని ప్రశ్నలు వ్రాసుకున్నాడు. అన్నీ ఒకసారి చదువుకుని, మరో ప్రశ్న కలిపేడు. సంతృప్తి పడి, పేపర్ మడిచి జేబులో ఉంచుకున్నాడు.

ప్రూఫ్ రీడర్ రాజుది సైకిలు అడిగి

సీరియల్:

# గోరంత దీపం

## —వింధ్యవాసిని

(గత సంచిక తరువాయి)

తీసుకుని రూంకు వెళ్ళిపోయాడు. గడ్డం గీసుకుని ఇస్త్రీ చేసిన దుస్తులు వేసుకుని కాలేజీకి బయలు దేరాడు. ఎదురుగా ఉన్న కేంటీనుకి వెళ్ళేసరికి అప్పుడే కాలేజీ వదిలేరులా ఉంది. గుంపులుగా అమ్మాయిలూ, అబ్బాయిలూ తిరుగుతున్నారు.

ఒక టేబిల్ దగ్గిర కూర్చున్న నలుగుర్లో ఒకమ్మాయిని అడిగాడు హరి, ''ఎక్స్‌క్యూజ్ మీ, ఇంటర్‌మీడియట్ సెకండ్ యియర్ స్టూడెంట్ మిస్. మేనకారావ్ ఎక్కడున్నారో చెప్తారా ?''

నలుగురూ ఆశ్చర్యంగా ముఖాలు చూసు కున్నారు.

''మీరెవరు ? '' అని ఒకరడిగితే, అతను జవాబు చెప్పేలోపలే, మరొకరు ''పత్రికా విలేఖరికదూ ?'' అన్నారు.

మరో అమ్మాయి, ''అదుగో అక్కడ ఎల్లో సారీలో ఉంది చూడండి. ఆమే మేనకారావు'' అనగానే 'థాంక్స్' చెప్పి అటు వెళ్ళాడు హరి.

తను 'గోరంత దీపం' ఆఫీస్‌నించి వస్తున్నట్లుగా పరిచయం చేసుకున్నాడు. ''ఆ చివరి టేబిల్ దగ్గిరికి వెళదాం. అంతరాయం లేకుండా మాట్లాడుకోవచ్చు'' అని అటు దారితీసిందా అమ్మాయి.

కాఫీ ఆర్డర్ చేసాడు. ఆమె తల్లిదండ్రులు, కుటుంబ స్థితిగతులు, చిన్నతనం, స్కూలు చదువువంటి రొటీన్ విషయాలు ప్రశ్నించేసరికి కాఫీలు వచ్చాయి. ఇద్దరూ తాగుతూండగా,

**జరిగిన కథ—1:** 'గోరంత దీపం' రాయలసీమ వార్తా వారపత్రిక ఎడిటర్ విశ్వమూర్తి, ఎం. డి. పరశురామ్ ప్రాణస్నేహితులు. విశ్వమూర్తి కూతురు రమణ అదే ఆఫీసులో పనిచేస్తోంది. పరశురామ్ కూతురు కరుణకు ట్యూషన్ చెబుతున్న హరిప్రసాద్ కరుణ సహాయంతో ఆ ప్రెస్‌లోనే ఉద్యోగం సంపాయిస్తాడు.

''చూడండి మిస్. రావ్, అఖిలభారత స్థాయిలో బెస్ట్ కాడెట్‌గా బహుమతి గెలుచుకోవటం మామూలు విషయంకాదు. మరి మీరానాడు, ఢిల్లీలో రాష్ట్రపతినుంచీ బహుమతి అందుకునే టప్పుడు ఎలా ఫీలయారో చెబుతారా ?''

''నిజం చెప్పమంటారా ?'' అని నవ్వుతూ, ''స్టేజీమీద ఎక్కేటప్పుడు కాళ్ళు వణికాయి. అంత గౌరవం పొందుతున్నందుకు సంతోషంగా ఉన్నా ఏమిటో ఒళ్ళంతా చెమటలు పట్టేసి యూనిఫారమ్ తడిసిపోయినట్లు అనిపించింది. బహుమతి ఎలా అందుకున్నానో, ఎలా హాండ్ షేక్ చేసి, సాల్యూట్ చేసానో నాకు గుర్తు లేదు. మొత్తానికి భలే థ్రిల్లింగ్ ఎక్స్‌పీరియన్స్ అనుకోండి.''

''ఈ ఏడు ఇంటర్మీడియట్ అయిపోతుంది. తర్వాత ఏం చేయాలని అనుకుంటున్నారు ?''

''మెడిసిన్‌కి వెళ్ళాలని లేదు. డిగ్రీచేసి, పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో జాబ్‌కి ట్రై చేయాలని ఉంది.''

''బావుంది. మరి ఇంకా మీ గురించేమయినా చెప్పాలని ఉంటే చెప్పండి. హాబీలు, అలవాట్లు లాంటివి.''

మరో అయిదు నిముషాలకి ఇంటర్వ్యూ ముగిసింది. ఆ అమ్మాయికి 'థాంక్స్' చెప్పి వచ్చేశాడు హరి. గుదికి వెళ్ళి భోజనం చేసిన తర్వాత కాయితం తీసుకుని ఇష్టాగోష్టి రూపంలో రిపోర్ట్ తయారు చేశాడు.

* * *

మధ్యాహ్నం తీసుకున్న జీతంలో కొంత వెచ్చించి కొత్త సైకిలొకటి కొన్నాడు హరిప్రసాద్. కొత్త సైకిల్‌మీదే సాయంత్రం విశ్వమూర్తిగారింటికి వెళ్ళాడు.

అతను గడపలో అడుగుపెట్టేసరికి లైట్ స్విచ్ వేస్తున్న విశ్వమూర్తి ''రావోయ్''అంటూ ఆహ్వానించాడు. చేతులు జోడించి 'నమస్తే' చెప్పి జేబులోంచి కాయితం తీసి అందించాడు.

''అలా కూర్చో'' అని అతనికి చెప్పి, రెండు నిముషాల్లో రిపోర్ట్ చదివాడు విశ్వమూర్తి. ''ఇట్సాల్ రైట్. బావుంది. తీసికెళ్ళి రేపు శంకరానికి ఇచ్చెయి. ఇంకేదయినా పని చెబు తాడు'' అన్నాడు.

''అమ్మాయి, టీ తెచ్చి పెట్టమ్మా'' కేకేశాడు లోపలికి.

టీ కప్పులు తెచ్చిన రమణని చూసి ఆశ్చర్య పోయాడు హరి. తనారోజు మొదట పరశురాం గారి ఆఫీస్‌లో చూసినప్పటికీ,ఇప్పుడు చూస్తున్న దానికీ చాలా తేడా ఉంది. ఇవేళ కళ్ళజోడు లేదు. తలంటు పోసుకుందేమో, వదులుగా అల్లుకున్న జడలోంచి, తప్పించుకుని వచ్చిన జుట్టు కొద్దిగా గాలికి ఎగురుతోంది. పసుపు రాసుకున్న ముఖంలో ఎర్రని కుంకం బొట్టు ఎత్తి కనిపిస్తోంది. చిన్న జరీ అంచున్న తెల్ల

చీరలో, మంచులో తడిసిన మల్లెపూవులా ఫ్రెష్‌గా కనిపిస్తోంది.

ఆమె కూడా తన వయిపు పరిశీలనగా చూడటం హరి గమనించే స్థితిలో లేదు.

''ఇదుగో అమ్మాయి, ఇతను హరిప్రసాద్ అని కరుణ ట్యూషన్ మాస్టర్. తెలుసుగా, మన ప్రెస్‌లో వర్క్ చేస్తున్నాడు. త్వరలో పేపర్‌లో సబ్ ఎడిటర్‌గా చేరబోతున్నాడు, అందుకని ట్రయల్‌గా కొంత వర్క్ చేస్తున్నాడీ రోజూ, రేపూ''

'అమ్మయ్య' అనుకున్నాడు హరి ఆయన మాటలతో ధైర్యం తెచ్చుకుని. అతనికీ విషయం ముందే చూచాయగా శ్యామల ద్వారా తెలిసింది.

''ఇదుగోనోయ్. మా అమ్మాయి రమణ. మన కంపెనీలోనే అకౌంట్స్ అసిస్టెంటుగా చేస్తోంది.''

ఇద్దరూ 'నమస్తే' అంటే 'నమస్తే' అనుకున్నారు. టీ తాగటం అయింది. హరి బయలుదేరాడు.

మెట్లదగ్గిర తలుపు వేసేందుకు వచ్చిన రమణతో ''థాంక్స్, టీ తీయగా బాగుంది.'' అన్నాడు మనస్ఫూర్తిగానే.

''షుగర్ ఎక్కువయిందా'' అడిగింది రమణ గడుసుగా నవ్వుతూ– మొదట తబ్బిబ్బు అయినా, తర్వాత తేరుకుని, ''ఏమో మరి మీకే తెలియాలి'' అనేసి మెట్లు దిగేడు హరి హుషారుగా.

పోర్టికో దాటివెడుతూ పైకి చూస్తే, అంత దాకా బాల్కనీలో నిలుచుని తన వయిపే చూస్తున్న రమణ లోపలికి పరిగెత్తటం కనిపించింది.

## 5

మధ్యాహ్నం మూడుగంటలయి ఉంటుందేమో! హరి ఫోటోగ్రాఫర్ వెంట, ఉస్మానియా కాలేజీకి వెళ్ళివచ్చి కొంచెంసేపు అయింది. శంకరంగారి ప్రక్కనే కూర్చుని రిపోర్ట్ వ్రాస్తున్నాడు.

ఆరోజు ఉదయం నించీ కాలేజీ విద్యార్థులు సమ్మె చేస్తున్నారు.

అంతకుముందు రోజు అక్కడ పనిచేసే ఇద్దరు లెక్చరర్లు దేనికో గొడవపడి, ఒకర్నొకరు తన్నుకుని పబ్లిగ్గా ప్లే గ్రౌండ్‌లో బలాబలాలు తేల్చుకోబోయారట. ఈ యుద్ధాన్ని సగం మంది విద్యార్థులు, టికెట్ లేని ఫ్రీస్టైల్ రెస్లింగ్ మాచ్‌లా ఉత్సాహంగా చూసేరట. తర్వాత మిగతా స్టాఫ్ మెంబర్లు కల్పించుకుని వీళ్ల ఉత్సాహం మీద నీళ్ళు పోసారు. ఆవేళ జరిగిందంతే.

మరునటిరోజు ఉదయం విద్యార్థి నాయకులంతా కలిసి, ప్రిన్సిపాల్ దగ్గరికి వెళ్లారు. కాలేజీలో బాధ్యత గల ఉద్యోగాలు చేస్తున్న ఇద్దరు పెద్దమనుషులు, నీచంగా పోట్లాడు కోవటం, కొట్టుకోవటం, అదీ అందరు విద్యార్థులూ చూస్తూ ఉండగా చాలా అవమానకరమయిన విషయం అనీ, అందుకు వాళ్ళిద్దరూ పబ్లిక్‌గా అపాలజీ చెప్పుకోవాలనీ, వాళ్ళ కోరిక. అలా జరగని పక్షంలో ఆ సంఘటన కొత్తగా ఆ ఏడే కాలేజీలో చేరిన కుర్రవాళ్ల మనసులో, ఒక తప్పు అభిప్రాయాన్ని కల్పిస్తుందనీ వాళ్ళ వాదన. మర్యాద నేర్పవలసిన ఉపాధ్యాయులే ఈ విధంగా అమర్యాదకరంగా ప్రవరిస్తూ ఉంటే, ప్రిన్సిపాలు ఏమీ చేయక పోవటం, కాలేజీ ప్రతిష్టకే భంగం– అని ప్రిన్సిపాల్‌కి ఓ చురక వేసారు.

ప్రిన్సిపాల్ విద్యార్థులను పంపేసి, ఉపాధ్యాయులని పిలిపించి, విషయం వివరించాడు. ఇద్దరూ ముఖాలు చూసుకున్నారు. ఆగర్భ శత్రువుల్లా పోట్లాడుకున్న ఆ ఇద్దరూ ప్రిన్సిపాల్‌కి ఏకాభిప్రాయాన్ని అందించటంలో ఆలస్యం చెయ్యలేదు. పోట్లాడుకున్నందుకు మిగతా కొలీగ్స్ ముందు, ఒకరికొకరు అపాలజీ చెప్పుకున్నామనీ, అంతకు మించి తామేదీ చేయబోవటం లేదనీ చెప్పేశారు. ఇది పూర్తిగా తమ స్వంత విషయం కాబట్టి, విద్యార్థులు ఇందులో కల్పించుకుని, సలహాలు ఇవ్వటం అసంబద్ధమని వాళ్ళ వాదన.

విషయం తెలియగానే విద్యార్థులు సమ్మె ప్రారంభించారు. హరిప్రసాద్, ఫోటోగ్రాఫర్ రామ్మూర్తి వెంట వెళ్ళి వచ్చాడు. కొందరు లెక్చరర్లనీ, విద్యార్థులనీ, ప్రిన్సిపాల్‌ని కలిసి మాట్లాడాడు.

''ఇలాంటి సంఘటనల్లో న్యాయం అన్నది



ఏ ఒక్క వయిపూ పూర్తిగా ఉండదు. నీవు యువకుడివి. అందువల్లనే విద్యార్థుల వాదనే నీకు సరి అయిందిగా తోచవచ్చు.''

''నోనో... నిజంగా నాకు వాళ్ల కోరిక నచ్చలేదండి. లెక్చరర్ల స్వవిషయాల్లో వాళ్ళు కల్పించుకోవటం అధిక ప్రసంగంగా కనిపిస్తోంది. చూడబోతే, ఏదో ఒక సాకు దొరికిందే చాలు అని సమ్మె ప్రారంభించినట్లుగా తోస్తోంది.''

''అదేనయ్యా నే నిప్పుడు చెబుతున్నది. వ్యక్తిగా నువ్వే పక్షాన్ని సమర్థించినా పరవాలేదు. కానీ జర్నలిస్ట్‌గా అలా చేసే అధికారం నీకు లేదు. ఉన్నదున్నట్లు, జరిగింది జరిగినట్లు ఆబ్జక్టివ్‌గా రిపోర్ట్ చెయ్యటమే నీ పని. ఇంకా ఒకటి రెండు మాటల్లో సంఘటన మొత్తాన్ని గూర్చి, నీ విమర్శని చివర్లో చేర్చినా ఫరవాలేదు. ఏదో ఒక పక్షాన్ని సమర్థించటం మన డ్యూటీకి విరుద్ధం అవటమే కాకుండా, వేరే చిక్కుల్ని కూడా తెచ్చి పెడుతుంది'' అని శంకరంగారు తాను వచ్చిన వెంటనే చెప్పిన మాటల్ని నెమరు వేసుకుంటూ, షార్ట్‌హేండ్ నోట్ బుక్ ముందుంచుకుని రాస్తున్నాడు హరి.

టేబిల్‌మీదున్న ఫోన్ మోగింది. శంకరం ''నీకే'' అంటూ రిసీవర్ హరికి అందించాడు. ఫోన్ చేసింది పరశురాం.

''నీకో మంచి వార్త ... ఉహు ... రెండు చెప్పాలని పిలిచానోయ్. నీ నవలని అంగీకరించాం. కాంట్రాక్ట్ పేపర్స్ తయారు అయిన తర్వాత చెబుతాను. వచ్చేనెల్లో రాఘవరెడ్డి వచ్చేసిన తర్వాత నువ్వు ప్రెస్‌లో రిలీవ్ అయి పేపర్ ఆఫీస్‌లో చేరిపోవచ్చు. నిన్ను సబ్ ఎడిటర్‌గా తీసుకుందామని అంటున్నాడు విశ్వమూర్తి.''

''థాంక్ యూ వెరీ మచ్ సర్.''

పరశురాం మాటల్లో వినిపిస్తున్న ఉత్సాహం, సంతోషం హరికి ఆశ్చర్యంగా

ఇటీవల చిలకలూరిపేట రోటరీక్లబ్‌వారు రంగస్థల నటుడు శ్రీ రేబాల రమణ, బాలబంధు శ్రీ బి.వి. నరసింహారావుగార్లకి సన్మానం చేసిన సందర్భంగా రోటరీ అధ్యక్షులు శ్రీ కందిమళ్ల నారాయణమూర్తి, శ్రీ కృష్ణారావు, ఎం.ఎల్.ఏ. డాక్టర్ కృష్ణమూర్తిగార్లని చిత్రంలో చూడవచ్చు.



# గోరంత దీపం

ఉన్నాయి. నిజానికి తనకంటే ఆయనే ఎక్కువగా సంతోషిస్తున్నట్లు కనిపిస్తోంది.

''అన్నట్లు, నువ్వీ హడావిడిలో మా అమ్మాయి ట్యూషన్ నిర్లక్ష్యం చెయ్యవుగా. రోజులో నీకు ఏ టయిం అనుకూలంగా ఉంటే అప్పుడే వచ్చి చెపుతూ ఉండు ... ఇవేళ నీకు పార్టీ ఇస్తుందట కరుణ. నిన్ను సాయంత్రం త్వరగా వచ్చెయ్యమంది. దాని పుట్టినరోజివాళ.''

* * *

సాయంత్రం ఆరుగంటలకి, కొత్తగా కుట్టించిన లేతనీలిరంగు ఫుల్‌హాండ్స్ షర్టు, ముదురు నీలంమీద చిన్న చారలున్న పేంటులో ఇన్‌షర్ట్ చేసుకుని తయారయాడు హరిప్రసాద్.

వీధి చివర్నించే కనిపించే, పరశురాంగారి బంగళా ముందు ఏ హడావిడీలేదు. పరశురాంగారి అమ్మాయి పుట్టినరోజు అంటే మాటలా, ఎంత గ్రాండ్‌గా చేస్తారో అనుకున్నాడు హరి. అలాంటిదిలా చప్పగా కన్పించేసరికి, తను మధ్యాహ్నం ఫోన్లో సరిగా విన్నానా లేదా అని అనుమానం వచ్చింది.

ఆలోచిస్తూనే గేట్‌దాటి పోర్టికోలో అడుగుపెట్టాడు. లోపల్నుంచీ మాటలు వినిపిస్తున్నాయి. తలుపు దగ్గర ఒక్కక్షణం నిలుచుంటే రమణ స్వరం తెలిసింది.

జేబులోంచి దువ్వెనతీసి క్రాఫ్ దువ్వుకుని, మీసాలు సవరించుకుని, తలుపుమీదుగా ఉన్న బెల్ నొక్కాడు.

తలుపుతీసింది కరుణ. ''రండి మాస్టారూ! మీ కోసమే చూస్తున్నాం. ఇదుగో ఈమె రమణక్కయ్య. మీకు తెలుసుకదూ ?''

''తెలీకపోవటమేం ?'' అంటూ నవ్వి, 'నమస్తే' అంది రమణ. తనూ 'నమస్తే' చెప్పి వెళ్ళి వాళ్ళకెదురుగా ఉన్న సోఫాలో కూర్చున్నాడు హరి.

''మధ్యాహ్నం మీ డాడీ చెప్పారు, ఇవాళ నీ పుట్టినరోజని. నిజమేనా, నేను సరిగ్గా విన్నానా లేదా అని అనుమానం వచ్చింది.''

''ఓహో ఏ హడావిడీ లేదేమిటా అని ఆశ్చర్య పోతున్నారుకదూ ? కరుణకి గ్రాండ్‌గా పార్టీ చేసుకోవటం నచ్చదు. ఎప్పుడూ ఇలాగే తన స్నేహితులు, కావలసినవాళ్ళు కొందర్ని మాత్రమే పిలిచి చేసుకుంటుంది'' రమణ జవాబు చెప్పింది.

ఆమె చిక్కని ఆరంజి కలర్‌లో, పెద్ద పెద్ద సిందూరం రంగు పువ్వులున్న చీర, అదేరంగు బ్లవుజ్‌లో, మందారం పువ్వులా ఉంది. చంపలకి రాసుకున్న పసుపు, వేసుకున్న డ్రస్ రంగుకి కాంట్రాస్ట్‌గా ఉంది. ముఖాన ఉన్న పెద్ద ఎరుపురంగు బొట్టు సరిగ్గా మాచ్ అయింది. సింపుల్‌గా ఉన్న తెలుపురాళ్ళ నెకలెస్ వేసుకుని ఉంది. ఒకవయిపు రమణని గమనిస్తూనే, కరుణకి శుభాకాంక్షలు చెప్పి, ఒక పేకెట్ అందించాడు హరి.

వెంటనే పాకెట్ విప్పి, ''అబ్బ కాడ్‌బరీస్ చాక్‌లెట్లు. ఎన్నిరకాలున్నాయో చూశక్కయ్యా. నాకెంత ఇష్టమో'' అని సంతోష పడిపోయింది కరుణ.

''అవునవును స్వీట్లు, కాడ్‌బరీస్ చాక్లెట్లు తినే, పొడవుకి బదులు, అడ్డం అవుతున్నావు. మీ మాస్టారు భలేవారే ... చిన్నపిల్లకి లాగా చాక్లెట్లు తెచ్చిపెట్టారు...''

''డోంట్ వర్రీ కరుణా! ఇప్పట్నించే డైటింగ్ అని ఇష్టమయినవన్నీ మానేయటం మొదలుపెట్టకు. ఇంకా చిన్నపిల్లవేగా స్వీట్లు తిన్నా ఫర్వాలేదు. అయినా ఇప్పుడు నువేమంత లావు అయిపోలేదులే'' కావాలనే అన్నాడు.

ముగ్గురూ నవ్వుకున్నారు.

''మీ సిస్టర్ ఎక్కడా ?''

''నా బర్త్‌డే పార్టీ ఉత్సాహంగా ఉండదని దానికి నచ్చదు. ఎవరో ఫ్రెండ్‌తో సినిమాకి వెళ్లింది.''

''అక్కా చెల్లెళ్లిద్దరూ ఉత్తర దక్షిణ ధ్రువాలు'' అనుకున్నాడు హరి.

కరుణ లోపలికి వెళ్లింది.

''కంగ్రాట్యులేషన్స్'' అన్నది రమణ.

''ఎందుకు ?''

''మీ నవల అంగీకరింపబడినందుకు''

స్వీటు, కారం ప్లేట్లు ట్రేలో పెట్టుకుని వచ్చింది కరుణ.

''అవును మాస్టారూ మీ పార్టీ ఎప్పుడు ? మీ నవలకి పారితోషికం రాగానే ఇవ్వాలి'' చనువుగా అడిగింది కరుణ.

* * *

హరిప్రసాద్ 'గోరంతదీపం' ఆఫీస్‌లో చేరి వారం రోజులయింది. ఆవేళ ఉదయం ఆఫీస్‌కి రాగానే 'ఎడిటర్' ఛాంబర్‌లోకి వెళ్ళాడు, తను కొత్తగా రాసిన, ''సమ్మెల వల్ల జరిగే నష్టాలు'' అనే వ్యాసాన్ని ఆయనకి చూపించాలని.

తర్వాత ఆ వారం న్యూస్ పేపర్లోకి వెళ్ళాలిసిన మాటర్ ఎంతమటుకు కంపోజ్ అయిందీ, ఎన్ని అడ్వర్టయిజ్‌మెంట్ బ్లాకులు తయారయిందీ చూసుకునివచ్చి విశ్వమూర్తికి వివరించాడు.

''నా నవల కాంట్రాక్ట్ సైన్ చేయాలిసిందివాళే సర్. రమ్మన్నారు. మీరూ రావాలి నాతో.''

ఒక్క క్షణం ఆలోచించి ''సరే'' అన్నాడాయన.

మధ్యాహ్నం మూడింటికి ఇద్దరూ కలిసి పరశురాం గదికి వెళ్ళారు. టైప్ చేస్తున్న శ్యామల ఒక్కసారి ఆపి ''మీకోసమే చూస్తున్నారు'' అన్నది వీళ్ళని చూసి చిరునవ్వుతో.

చేతిలోఉన్న చుట్టముక్క ఏష్ ట్రేలో

పడేసి ఆహ్వానించాడు పరశురాం. ''నమస్తే సర్'' అన్నాడు హరి.

కాఫీలు వచ్చాయి. ముగ్గురూ తీసుకున్న తర్వాత మాటలు మొదలయాయి. ''ఇదిగో ఈ పేపర్స్‌లో సైన్ చెయ్యాలి. మొదట నాలు వేలు పారితోషికం. అయిదు వేల కాపీలకి దాటి సేల్ అయితే దానిమీద 5 శాతం రాయల్టీ ఉంటుంది. అయితే, పుస్తకం పబ్లిష్ చేయటం ఆలస్యం అవుతుంది. కొంత పెండింగ్ వర్క్ ఉంది. నీకూ తెలుసుగా ?''

''సేల్స్ ప్రమోషన్ గూర్చి నాక్కొన్ని అయిడియాస్ ఉన్నాయిసర్. అవన్నీ మీకు చెప్పాలని అనుకుంటున్నాను. మీరు మరోలా అర్థంచేసుకోరనే నమ్మకంతో ఉన్నాను. ఈ రోజుల్లో ఏ వస్తువయినా తయారు చేయటం ఒక ఎత్తు, మార్కెట్‌లో సేల్ చేయటం మరొక ఎత్తు. కానీ మన తెలుగు పుస్తకానికి అవసరం అయినంత పబ్లిసిటీ లభించటంలేదని నాకు అనిపిస్తుంది.'' ఒక్క క్షణం, పెద్దవాళ్ళిద్దరి వయిపు చూశాడు. ఇద్దరి ముఖాలు ఆసక్తిగా వింటున్నట్లే కనిపించాయి.

''కొంత పేరున్న రచయిత అయితే, అంత పబ్లిసిటీ అవసరం లేకపోవచ్చు. కానీ, నాలాంటి కొత్త రచయిత పుస్తకం ఏ ఏడెనిమిది రూపాయిలో పెట్టి కస్టమర్స్ కొనాలంటే, ముందుగా వాళ్ళకి రచయిత, అతని పుస్తకం — రెండిట్నిగూర్చీ కొంత పరిచయం లభించాలి.''

'ఏమంటారు ?' అన్నట్లు విశ్వమూర్తి వయిపు చూసాడు హరి.

''అందుకని మీరు నాకిచ్చే రెమ్యూనరేషన్ తగ్గినాసరే, కొంత డబ్బు పబ్లిసిటీకి వెచ్చించటం వల్ల మనకి లాభమేగానీ నష్టం అవదు అనుకుంటాను.''

''ఏ విధంగా పబ్లిసిటీ చేస్తే బావుంటుందంటావు ?'' అదీ నువే చెప్పు అన్న ధోరణిలో అడిగాడు పరశురాం.

''వీలయినన్ని పేపర్లలో, పత్రికల్లో పుస్తకం రివ్యూ రావాలి. అందుకొంత ఇన్‌ఫ్లూయన్స్ చేయటం తప్పనిసరి. ముఖ్యమయిన జర్నల్స్, పేపర్స్‌లో పుస్తకం అట్టమీద బొమ్మ ఫాసిమిలి ఫోటోలతో ప్రకటనలు విడుదల చేయాలి. ఇందుకు ఏ పబ్లిసిటీ కంపెనీ సహాయం అయినా తీసుకోవచ్చు. ఈ రోజుల్లో ప్రతీ పట్టణంలోనూ ఏదో ఒక సాహిత్యం, సాంస్కృతిక సంఘం ఉంటూనే ఉంటుంది. అలాంటివారి సహాయంతో, నేనే స్వయంగా కొన్ని ఊళ్ళు టూర్ చేయాలి.''

ఇన్నేళ్ళుగా మంచి పుస్తకాలు ప్రచురించే సంస్థగా పరశురాం అండ్ కంపెనీకి ఒక ప్రత్యేకత ఉన్నది. అయితే ప్రచురించే పుస్తకాల పబ్లిసిటీకి ఇంత ప్రాముఖ్యత ఇవ్వటం ఇంతదాకా ఎప్పుడూ జరగలేదు.

అందులో హరి స్వంత లాభం తగ్గించుకుని అయినా, తనూ తోడుపడతాననటం వాళ్ళిద్దరికీ ఇంప్రెసివ్‌గా వుంది.

''నువ్వేమంటావ్ [illegible] అడిగా[illegible] [illegible]

[illegible] చెయ్యలేదు. ఇందుకు [illegible] అవుతుందనుకుంటాను.''

''వాళ్ళిద్దరూ [illegible] మాట్లాడుకుంటారనిపించింది [illegible] వెళ్ళొస్తాను సర్. మళ్ళీ మీరు ఎప్పుడు [illegible] అప్పుడొస్తాను'' అని సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

''ఈ అబ్బాయికి అనుభవం తక్కువ. ఏ సిగరెట్ కంపెనీయో చేసినట్లు అంత పబ్లిసిటీ చేస్తే, పుస్తకాలకి గౌరవం తగ్గుతుందేమో !'' సందేహంగా అన్నాడు పరశురాం.

''నా కలా అనిపించదు రామూ ! ఈ అబ్బాయికి ఒట్టి జర్నలిస్టే కాదు, మంచి బిజినెస్ మాన్ అవగల తెలివితేటలున్నాయి. అతను చెబుతున్నదీ ప్రయత్నించి చూడాల్సిందే. రోజులు మారుతున్నాయి. పుస్తకాలు చదివేవాళ్ళ సంఖ్య పెరుగుతున్నా, ఒక పుస్తకాన్ని కొని స్వంతం చేసుకోగల ఆర్థిక స్తోమతు పెరగటం లేదు. మారుతున్న పరిస్థితులతోబాటు, మనమూ మన పద్ధతులు కొంతయినా మార్చుకోవాలి. ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలును ?'' సాలోచనగా అన్నాడు విశ్వం.

## 6

రోజులో కనీసం మూడు గంటలసేపు అద్దం ముందు కూర్చొని గడపటం అలవాటు అరుణకి. పొద్దు పోయేందుకు అదొక దారి.

ఇవాళ ప్రోగ్రాం లేదు. తన ఫ్రెండ్స్ అంతా ఢిల్లీ, ఆగ్రా ట్రిప్ వేసుకుని వెళ్ళారు. అరుణ తనూ వెడదామనుకుంది. కానీ పరశురాం వద్దనేశాడు— కరుణకిప్పుడు పరీక్షలు, పరీక్షల [illegible] అరుణ [illegible]

[illegible]

[illegible] ఉన్నాయి.

తన స్నే[illegible] బంధువుల్లో కొందరు అబ్బాయిలు తెలిసినవాళ్ళు లేకపోలేదు అరుణకి. అయినా, తనకి నచ్చిన వాడెవరూ ఇంతవరకూ కన్పించలేదు [illegible] అందాన్ని చూసయితేనేం, పరశురాం కూతురవటం వల్లయితేనేం, తను 'ఊ' అంటే ఆనెకో స్నేహం చేసేందుకు తయారుగా అబ్బాయిలెందరో ఉన్నారు. కానీ పరశురాం కొన్ని విలువలు దృష్టిలో ఉంచుకుని, డిసిప్లిన్‌తో పెంచారు పిల్లల్ని. బిడ్డలని ఎంత ముద్దు చేసినా, హద్దులు దాటితే ఆయన కెంత కోపం వస్తుందో అరుణకీ, కరుణకీ బాగా తెలుసు. 'పరువు' ఆయన ప్రాణం.

అరుణ కారోజే తెలిసింది, హరి రాసిన ఒక నవలని తమ కంపెనీయే ప్రచురించబోతోందని. ఇది తను ఊహించని విషయం. అతను రచయిత అనే తనకి తెలీదిన్నాళ్ళు.

కరుణకి ట్యూషన్ మాస్టరుగా అతను మొదటిరోజు తమ ఇంటికి వచ్చినప్పుడు చూసి చింపాంజీలా ఉన్నాడనుకుంది. పాతబడి వెలిసిపోయిన బట్టలు, అరిగిపోయిన చెప్పులు, పెద్ద మీసాలు, మెడలు దాటని క్రాపు, గుంటలు పడ్డ బుగ్గల వెనకాలనుంచీ పొడుచుకొచ్చినట్లు కనిపించే పెద్దచెవులు — ఇదీ అతగాడి అవతారం. అబ్బ ! డాకీకీ కాస్త కంటికి నదురుగా కనిపించే





ఇటీవల హైదరాబాదులోని కిన్నెర ఆర్ట్ థియేటర్స్ ఆధ్వర్యంలో సముద్రాల జూనియర్ షష్టిపూర్తి సన్మానోత్సవ సందర్భంగా నృత్య ప్రదర్శన చేసి ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావునుంచి మొమెంటోని అందుకుంటున్న నర్తకి శ్రీమతి మద్దాలి ఉషాగాయత్రిని చిత్రంలో చూడవచ్చు.

మాస్టరే దొరకలేదేమో — అనుకుంది విసుగ్గా. ఎప్పుడయినా అతను ఎదురుగా వచ్చినా, 'హలో', అని పలకరించాలనికూడా ఎప్పుడూ అనిపించ లేదు. తమాషా ఏమిటంటే, అతనూ అలాగే ప్రవర్తించేవాడు.

తననీ తన అందాన్నీ గమనించి, తనవయిపు ఆకర్షణతో చూడని యువకుడు అంటే హరిప్రసాదు ఒక్కడే. తను ఆ ఇంటికి వచ్చేది, కరుణకి ట్యూషన్ చెప్పేందుకు. మరొకరితో తనకేం పని అన్నట్లు ప్రవర్తిస్తాడు.

అదే తనకు కొంత చిత్రంగా కనిపించినా, తన లెవెల్‌కి ఏమాత్రము సరిపోని అతని అశ్రద్ధని లెక్కించే అవసరం కలగలేదు. ఒకసారిగా పది రూపాయలు తీసి ఖర్చుచేసే స్తోమతు లేకపోయినా, వందలూ, వేలూ సంపాదించే వాడిలో ఉండే ధైర్యమూ, విశ్వాసమూ కనిపిస్తాయి హరిలో. దాన్నే గర్వం అనుకుంది అరుణ.

ఆమెకు రచయితలు అంటే ఒక విధమయిన ఆకర్షణ ఉంది. పుస్తకాలు రాసేవారినీ, వారిలోని మేధాశక్తినీ గౌరవించటం, పరశురాం ద్వారా కూతుర్లకి వచ్చిన అలవాటు. అందుకనే హరీ ఒక రచయిత అని ఇవాళ తెలియగానే, తనిన్నాళ్ళు అతన్ని నిర్లక్ష్యం చేశానేమో అనిపించింది అరుణకి.

కరుణ చేసిన అల్లరినంతా భరించి, అతను ఎంత త్వరలో ఆ అమ్మాయిని మార్చివేసాడో తనకి తెలుసు. అతని స్వరంలోనే, అవతలివారిని ఆకర్షించి, ముగ్ధుల్నిచేసే ప్రత్యేకత ఏదో ఉంది. ఏ సబ్జెక్ట్ అయినా, అతి సులభమయిన భాషలో, మనసులో ముద్రింపబడేలా చెప్పే శక్తి ఉంది.

# గోరంత దీపం

తను అతను 'సూర్య' అన్న పేరుతో వ్రాసిన కథలు చదివింది. అవి మామూలు ప్రేమ కథలు కావు. డాడీ చెప్పేదాన్నిబట్టి, కథలు, ప్రేమకథలు వ్రాయటం చాలా సులభం. అందువల్ల అతను రాసిన ఇతర వ్యాసాలు, ఇప్పుడు ప్రచురణకి తీసుకున్న నవల, అతని తెలివినీ, మేధస్సునీ చాటిచెబుతాయిట. అదే నిజమయితే అతనికి త్వరలోనే రచయితగా పేరుప్రతిష్టలు లభించటం ఖాయం. ఇన్నాళ్ళుగా తమ ఇంటికివస్తూ, వెళుతూఉన్న అతనితో పరిచయం పెంచుకోకపోవటం తన తెలివితక్కువ తనమే. "ఇప్పుడు మాత్రం అతనితో స్నేహం చేస్తే ఏం ?" అనిపించింది అరుణకి అప్పుడే.

మేకప్ ముగించి లేచి కరుణ ఏం చేస్తుందో చూడబోయింది. టేబిల్‌మీద తల ఉంచుకుని, చేతిలో పుస్తకంతో నిద్రపోతున్న చెల్లెల్ని నిద్ర లేపింది. పనిమనిషి పట్టుకొచ్చిన కాఫీ అందించింది.

"నెల రోజులనుంచీ ఏకధాటిగా చదువు తున్నావు. బొత్తిగా రిలీఫ్ లేకపోతే బుర్ర ఏం చేస్తుందే. పోనీ ఇవాళ సినిమాకు వెళదామా?"

"వెళితే బాగానే ఉంటుందికానీ మరి మాస్టారికి చెప్పలేదు... ఆయన వచ్చాక వద్దంటే ఏమంటారో అని."

"ఏమీ అనరు. పోనీ ఆయన్ని రమ్మను."

ఆశ్చర్యంగా చూసింది కరుణ అరుణ ముఖంలోకి. అక్క మేష్టర్ని గురించి ఈ మాత్రం గౌరవం ఇచ్చి మాట్లాడటం ఇదే మొదలు — అనుకుంది. ఆయన్ని తమవెంట రమ్మని ఆహ్వానించమనటం మరీ వింతగా ఉంది.

"ఆయనొస్తే అడగనా ?"

"ఒకే. నేనీలోపల డాడీకి ఫోన్ చేస్తాను. అలంకార్‌లో 'ది బర్నింగ్ ట్రెయిన్' ఉంది. టికెట్స్ ఏమయినా బుక్ చేయిస్తారేమో" ఆమె మాటల్లో కనిపించే ఉత్సాహాన్ని జీర్ణించుకునేం దుకు ప్రయత్నిస్తూ కాఫీ తాగింది కరుణ.

"సినిమాకి వెళదాం రండి మాస్టారూ" అంటూ టీ కప్పు అందించింది, హరిప్రసాద్ రాగానే. అతనికి వెంటనే ఏమనాలో తోచలేదు. కరుణని బాధపెట్టటం తన కిష్టంలేదు. కానీ అరుణతో వెళ్ళటం వద్దు అనిపిస్తోంది. అతని డైలమా అప్పుడే వచ్చిన పరశురాం ఫోన్ కాల్‌తో తీరిపోయింది.

"ఏమోయ్ ఏమంటోందీ నీ శిష్యురాలు?"

"చక్కగా పాఠాలన్నీ రుబ్బి జీర్ణం చేసు కుంటోంది సర్" పక్కనే నిలుచున్న అరుణ వయిపు చూస్తూ అన్నాడు చిరునవ్వుతో. అవతల పరశురాం పెద్దగా నవ్వటం కరుణకికూడా వినిపిస్తోంది.

"ఉండండి, మీపని చెబుతాను" అన్నట్లు కోపంగా చూసింది కరుణ అతని వయిపు.

"ఎలా ఉన్నదీ కొత్త ఉద్యోగం ? అయినా ఇంకా కొత్తేమిట్లే మూడు నెలలు అయితే."

"అయామ్ ఎన్‌జాయింగ్ ఇట్ సర్. నో ప్రాబ్లమ్స్."

"చూడు. అమ్మాయిలేదో సినిమాకు వెళతారట. కాస్త దగ్గరుండి తీసికెళ్ళు. టికెట్స్ డ్రైవరొస్తే పంపుతున్నాను."

ఇక ఏవిధంగానూ తప్పించుకునే వీలులేక పోయింది హరికి.

సినిమాలో కరుణకి అటూ ఇటూ కూర్చు న్నారు హరీ, అరుణ. ఆమే ఇద్దరితో మాట్లాడు తోంది. హరితో నేరుగా ఏం మాట్లాడాలన్నా అదోలా ఉంది అరుణకి. ఎన్నాళ్ళుగానో చూస్తున్న వ్యక్తే అయినా, ఇవాళేమిటో కొత్తగా కనిపిస్తు న్నాడు. ఉద్యోగంలో చేరిన ఈ కొంత కాలం లోనే అతన్లో చాలా మార్పు కనిపిస్తోంది. కణత ఎముకలు కన్పించటంలేదు. బుగ్గల్లో నునుపు, కళ్లల్లో ఏదో కాంతి వచ్చేయి. చేతికి ఆటోమేటిక్ వాచీ, జేబులో గోల్డ్‌కాప్ పెన్నూ, ఒంటికి సరిగ్గా అమిరిన మడత నలగనిదుస్తులు, కాళ్లకి ఎప్పుడూ నిగనిగలాడే షూ — అతని అవతారాన్నే మార్చివేశాయి. అతను మాత్రం ఎప్పటిలా, అరుణ ఉనికికి ఏమీ ప్రత్యేకత లేనట్లే ప్రవర్తిస్తున్నాడు— అది ఆమెకి తెలుస్తూనే ఉంది.

ఇంటర్వెల్లో కరుణ పాప్‌కార్న్ కోసం గుంపులో దూరింది. హరి, అరుణ జనం నుండి కొంచెం దూరంగా నిలబడ్డారు, డబుల్ సెవెన్ సీసాలు పట్టుకుని.

"కంగ్రాచ్యులేషన్స్ మాస్టారూ !"

ఎందుకన్నట్లు చూసాడు హరి.

"మీ పుస్తకం పబ్లిష్ చేయబోతున్నారట"


"నన్ను నా అభిమానులకు
చేరువగా తీసికెళ్ళే వాటిలో 'అంజలి'
చీరలు ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి.
వీటిలోని మృదువైన సున్నితపు నేత,
అందమైన అద్దకాలు మరియు ఏనాటికీ
వెలిసిపోని ముచ్చటైన రంగులు నా
జీవితాన్ని మరింత అందంగా చేస్తున్నాయి!"
—మాధవి
Anjali
విభూత్నమైన ప్రింట్లతో
100%
పాలియెస్టర్

# ఇవేమన పద్యాలు




కానివానిచేత కాసు వీసంబిచ్చి
వెంట దిరుగువాడు వెఱ్ఱివాడు
పిల్లి తిన్నకోడి పిలచివా పలుకువా
విశ్వదాభిరామ వినుర వేమ.

"అవునవును."

ఒకసారి మాటల వంతెన పడితే, తర్వాత ఎవరు మాట్లాడాలి, ఏం మాట్లాడాలి అన్న సమస్య ఉండదు.

ముగ్గురూ ఇల్లు చేరేటప్పటికి వరండాలో వాలుకుర్చీలో కూచుని ఉన్నాడు పరశురాం.

## గోరంత దీపం

తరవాత పరశురాం బలవంతం మీద అక్కడే భోజనం చేయటం తప్పలేదు హరికి. అమ్మాయి లిద్దరితో స్నేహంగా కబుర్లు చెబుతున్న హరిని చూసి ముచ్చటపడ్డాడు పరశురాం. అదే క్షణంలో ఆయన మనసులో ఒక ఆలోచన మెదిలింది. అదివాళ కొత్తగా వచ్చిందేమీ కాదు. ఎన్నాళ్ళుగానో, ఆయనకి తెలీకుండా కొద్దికొద్దిగా రూపు దిద్దుకుంటూ వస్తున్నదే. తనకి విశ్వమూర్తి తప్ప దగ్గరివాళ్ళంటూ ఎవరూ లేరు. బుద్ధిమంతులు, కాస్త ఆపేక్ష, అభిమానం చూపించేవారు తనకి అల్లుళ్ళుగా రావాలని ఆయన కోరిక.

హరి సమక్షంలో మొదలయిన ఆలోచనా పరంపర, పరశురాం మనసులో విశ్రాంతిగా పడక చేరినా సాగుతోనే ఉంది.

హరిలో ఉన్న తెలివితేటలు, సమయస్ఫూర్తి రోజు రోజుకీ అతను చేస్తున్న పనిలో తెలిసిపోతూనే ఉన్నాయి.

అదివరకూ 'గోరంతదీపం'లో క్లాసిఫయిడ్ ఎడ్వటయిజ్‌మెంట్లకి ఒక ప్రాముఖ్యతగానీ, వాటివల్ల పెద్దగా ఆదాయంగానీ ఉండేది కాదు. హరి వచ్చాక వాటిని బాగా అభివృద్ధి చేశాడు.

"మీ సైకిలో, స్కూటరో, కారో అమ్మాలనుకుంటున్నారా? అవి ఎందుకూ పనికిరాని చెత్త అయేదాకా ఎందుకు వేచి ఉంటారు? 'గోరంతదీపం'లో ప్రకటించి మీ అభిమతాన్ని నలుగురికీ తెలియజేయండి."

"మీ ఇంటికో, ఆఫీసుకో 'వాచ్ మెన్' కావాలా? మీ హోటల్లో ఒక 'కుక్' అవసరమా? అయితే ఇవాళే 'గోరంతదీపం'లో ప్రకటించండి. రేపు అరడజను మంది అభ్యర్థులు మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తారు."

ఇలాంటి ప్రకటనలెన్నో హరి తయారుచేసి, పేపర్లో వేయించాడు. ఆఫీసులో ఒక గుమస్తాని పూర్తిగా అలాంటి ప్రకటనల పనికే కేటాయిస్తే మంచిదని సలహా ఇచ్చాడు. అప్పటినించీ క్లాసిఫయిడ్ కాలమ్స్ బాగా అభివృద్ధి అయాయి.

ప్రతీ శనివారం, న్యూస్‌పేపర్స్ పేకింగ్, డిస్పాచ్, సర్క్యులేషన్ వర్క్ అంతట్లో విశ్వమూర్తికి వెంట ఉండి సహాయం చేస్తుంటాడు. ప్రత్యేకించి తనకంటూ ఉన్న బాధ్యతని సవ్యంగా నెరవేర్చటమే కాకుండా ఇతర విధమయిన పనులు కూడా నెత్తిన వేసుకుని చూస్తూ, మరోవయిపు ఏవో కథలు, వ్యాసాలూ వ్రాస్తూనే ఉన్నాడు.

మరో రెండేళ్ళు పోయాక అతనికి అరుణనిచ్చి పెళ్ళిచేస్తే బావుంటుంది అనిపించింది పరశురాంకి. అతనికెవరూ లేరు? అయితేనేం? తమతో సంబంధం కలుపుకుంటే తామంతా అతని వాళ్ళు కారూ?

అతనికే ఆస్తీ లేదు. అయినా తను సంపాదించి పెట్టిన ఆస్తి అంతా కూతుర్లకీ అల్లుళ్ళకేగా? ఆమాటకొస్తే, కామేశ్వరిని పెళ్ళాడే నాటికి తన కెవరున్నారు? ఏ ఆస్తి ఉంది? ఆమె అదృష్టంతో, ఆస్తితో ఇంతవాడు కాలేదూ?

(ఇంకా వుంది)

# సింహసేనాపతి



గోవిందలూరి సాంబశివరావు




బుద్ధుని కాలంలో వైశాలీ రాజ్యాన్ని లిచ్ఛవీ రాజులు పాలిస్తూ వుండేవాళ్లు. వీరు సూర్యవంశపు రాజులు. బుద్ధుడు గూడా సిద్ధార్థుడుగా సూర్య వంశస్తులైన శాక్యరాజుల వంగడంలో పుట్టాడు. అందువల్ల వారికి, వీరికి చుట్టరికాలు అవీ అన్నీ వున్నాయి.

సిద్ధార్థుడు ఇంటిలోంచి వెళ్లి, గయలో బోధివృక్షం క్రింద సంబుద్ధియై, నూతనమైన బౌద్ధ ధర్మాన్ని ప్రపంచిస్తున్న రోజులు అవి. బుద్ధుడు మగధలో ధర్మప్రచారం చేసుకుంటూ చేసుకుంటూ పాటలీ గ్రామం మీదుగా వైశాలీ నగరాన్ని చేరుకుంటూ వుండగా, ఆయనకంటే ముందే ఆయన ఘనత గొప్పతనం, మహిమలు అన్నీ లిచ్ఛవీ రాజకుమారులకు, ప్రజలకు వినబడుతూ వచ్చాయి. బుద్ధ భగవానుడు వైశాలీ నగరాన్ని చేరుకుని, మహావనంలో వున్న కూటాగారంలో విడిదిదిగి, ధర్మ ప్రచారం చేయటం ప్రారంభం వేశారు. లిచ్ఛవీ రాజ కుమారుల్లో పరువు ప్రతిష్ఠగల వారంతా బుద్ధుడు చెబుతున్న ఈ ధర్మాన్ని గురించే చర్చలు, మన్ననలు మొదలుపెట్టారు.

ఒకరోజున రాజసభలో ఈ ప్రసక్తి వచ్చింది. ఆ సభలో ప్రతి రాజకుమారుడు బుద్ధుని గుణాలను గూర్చి, బుద్ధుడు చెప్పే ధర్మంయొక్క ప్రాశస్త్యాన్ని గురించి, బుద్ధుడు నిర్వహిస్తున్న సంఘం యొక్క ప్రశస్తినిగురించి ఒకటే మెచ్చుకోవడం; మరొకమాట లేదు. ఆ సభలో కొంతమంది జైనులుకూడా వున్నారు. సింహ సేనాపతి అని లిచ్ఛవీ రాజుల సేనాపతి గూడా వున్నాడు. సింహసేనాపతికి ఈ మాటలు విన్నకొద్దీ ఇట్లా అనిపించింది. ''నిజంగా ఈ బుద్ధుడు అర్హతుడు. నిస్సంశయంగా ఈ బుద్ధుడు సమ్యక్ జ్ఞాని. నిశ్చయంగా ఈ బుద్ధుడు సంబుద్ధి. లేకపోతే ఇంత మంది సుప్రతిష్ఠితులయిన లిచ్ఛవీ రాజకుమారులు ఆయన్నుగూర్చి ఇంత ఇదిగా ఎందుకు సమ్మగ్ధులవుతారు ? మెచ్చుకుంటారు ? అట్టి మహా పురుషుని దర్శనం చేసుకోని నాజన్మ ఎందుకు?'' అని.

## 2

సింహ సేనాపతి జైనుడు. జైనుల్లో నిగంఠనాథుని శిష్యుడు. జైనులకు, కొత్తగా పైకి వస్తున్న బౌద్ధులకు ఆ రోజుల్లోనేకాదు, ఆ అనంతరం గూడా సరిపడినట్లు ఎచ్చటా కన్పించదు. ఎప్పుడు ఆ విషయం ఎట్లావున్నా, ఆ రోజుల్లో జైన సన్యాసులకు శాక్య పుత్రీయులైన బౌద్ధ భిక్షువులకు మధ్య పచ్చగడ్డి వేస్తే మండిపోతూ వుండేది. ఈ సంగతిని అంతా బాగా యెరిగిన సింహ సేనాపతి ముందుగా గురువు ఆజ్ఞ పుచ్చుకు పోదామని నిగంఠనాథుని ఆశ్రమానికి వెళ్లాడు. వెళ్లి ఆయనకు నమస్కారాది మర్యాదల నెరపి ''స్వామీ ! నేను శ్రమణుడైన బుద్ధుణ్ణి చూట్టానికి పోవాలనుకుంటున్నాను'' అన్నాడు.

గురువు నిగంఠనాథుడు విస్తుపోయాడు. ''సింహా ! నీవు క్రియావాదివి. బుద్ధుడు అక్రియావాది. క్రియావాదివైన నువ్వు ఏ విధంగా అక్రియావాదియైన గౌతముణ్ణి చూద్దామని పోతున్నావు? బుద్ధుడు శ్రావకులకు అందరికి అక్రియావాదాన్ని బోధిస్తున్నాడు'' అన్నాడు. అయితే సింహసేనాపతికి బుద్ధుణ్ణి చూడాలన్న ఇచ్ఛ ఉరువేలంగా వుండిపోయింది. గురువు మాటను చెవిని పట్టించుకోకపోవడమూ మర్యాదగా కన్పించలేదు. అందువల్ల అప్పటికి ఆయన ఆ కోర్కెను అణుచుకున్నాడు.

## 3

సింహ సేనాపతి రాచకార్యం మీద రోజూ రాజసభకు పోతూవుండాలి. స్కంధావారానికి పోయి సైన్య వ్యవహారాలను చూచుకుంటూ వుండాలి. ఇందులో ఎక్కడికి వెళ్ళినా అక్కడి వారు బుద్ధుణ్ణిగూర్చి, బుద్ధుని గుణాలను గూర్చి, బుద్ధుని మహిమలనుగూర్చి తప్ప మరో మాట మాట్లాడుకోవడంలేదు. రాజసభలోను సైనిక స్కంధావారాల్లోను గూడా ప్రసిద్ధులయిన రాజకుమారులు అందరి నోటివెంట బుద్ధుణ్ణి గూర్చిన ప్రశంస తప్ప మరోటి వినరావడంలేదు.

ఆంధ్రపత్రిక-సచిత్ర వారపత్రిక
1954 మార్చి 10
సంచిక నుంచి

LE ROI LE ROI






# అనగా అనగా ఒక రాజు ...పాత రాజు కాదు. కొత్త రాజు: లె-రాయ్

లె-రాయ్ ఫ్రెంచి పదం. అంటే 'ది కింగ్'. రాజు.

రాజసం ఉట్టిపడే విమల్ సరికొత్త వర్‌స్టెడ్ సూటింగ్ పేరు: లెరాయ్.

దిగుమతి చేయబడిన 'సజీవ' దారాలు. అంతర్జాతీయ శ్రేణికి చెందిన ప్రాసెసింగ్ టెక్నాలజీ. కంప్యూటర్‌పై మేచ్ చేయబడిన రంగులు. ఇవన్నీ రంగరించి పోయగా ఉద్భవించిన సూటింగ్ — లెరాయ్.

మీ వ్యక్తిత్వానికి అద్దం పడ్తుంది లెరాయ్.







## లె-రాయ్

## వర్‌స్టెడ్ సూటింగ్స్

మీలాంటి వారి కోసమే.

Mudra/RTI/1234 TEL

ఇవి వింటున్నకొద్దీ సింహ సేనాపతిలో శాక్యఋషి గౌతముణ్ణి చూద్దామన్న వాంఛ మిక్కుటం కాజొచ్చింది. తిరిగి ఒకరోజున ఆయన జైన నిగంఠుణ్ణి దర్శించి తనలోని యిచ్ఛను వ్యక్తం చేశాడు. తిరిగి ఆయన 'నీవు' క్రియావాదివి, అక్రియవాదియైన గౌతముణ్ణి ఎట్లా చూస్తావు అని అపవారించాడు. మళ్ళీ ఆయనలో ఈ కోర్కె శాంతించింది.

శాంతించిందేగాని,ఆ కోర్కె ఈ మనస్సులో పచ్చి ఆరలేదు. రోజూ రాజసభలో స్కంధావారంలో బుద్ధుణ్ణిగూర్చి ప్రశస్తినే వింటూ వుంటంవల్ల అది దినము, దినము పెలవేసింది. నిగంఠనాథుడు బుద్ధుణ్ణి చూడ్డానికి తన్ను అనుమతిస్తాడేమోనని సేనాపతి ఆయన్ను మూడోసారిగూడా అడిగిచూచాడు. మూడోసారిగూడా నిగంఠ జైనుడు బుద్ధుని దర్శనం అయోగ్యం అని నిషేధించాడు.

సింహ సేనాపతికి అరికాలిమంట నెత్తికి ఎక్కింది. 'అరే; ఈ గురువు నన్ను బుద్ధుణ్ణి చూడవద్దంటాడేమి ?' అని కోపం వచ్చింది. ప్రసిద్ధులు, అప్రసిద్ధులు అంతాపోయి ఆయన్ను చూసివచ్చి, ఆ చూచివచ్చిన ఆనందంయొక్క స్మృతిచేతనే అంతగా ముగ్ధులైపోతూవుంటే, ఈ గురువు, తన్ను పోనీయడేమి అని ఆయనకు కోపంవచ్చింది, ఇక ఈసారి చెప్పటం, గిప్పటం లేదు. పోయి చూచిరావటమే, అని సింహ సేనాపతి మనస్సులో నిశ్చయం చేసుకున్నాడు.

## 4

బుద్ధుణ్ణి చూట్టానికని బయలుదేరిన సేనాపతి ఐదువందల రథాలు వెంటరాగా బయలుదేరాడు. రోజు రోజల్లా ప్రయాణం చేసి, గౌతముడు విడిసివున్న ఆరామాన్ని చేరుకున్నాడు. బుద్ధుడు ఎక్కడ వున్నాడో అక్కడకు వెళ్ళి భగవానుడికి నమస్కారం చేసి, ఒకప్రక్కగా ఆసీనుడై సంతుష్టిని పొందాడు.

బుద్ధుడు ఆయన్ను కుశల ప్రశ్నాదికాలు అడిగి, మాటను ధర్మప్రసంగంలోకి మార్చాడు. అప్పుడు సింహసేనాపతి అన్నాడు గదా : ''స్వామీ, మిమ్మల్ని గురించి ఇట్టి మాటలు వింటున్నాను. శ్రమణుడైన గౌతముడు అక్రియావాది. అక్రియను ఒక ధర్మంగా ఉపదేశిస్తున్నాడు. ఆయనదగ్గర శిష్యులెవరు చేరడంలేదు. ఇట్టి మాటలు వింటున్నాను. మరికొందరు అంటున్నారుగదా గౌతముడు అక్రియావాదాన్ని ఉపదేశించడమే కాదు ఆయనగూడా వట్టి అక్రియావాదేనని. ఇది నింద అనుకోవద్దు, విన్న మాటలు విన్నట్లు చెబుతున్నాను. మిమ్మల్ని నిందించడం నా మతం కాదు'' అని.

''సింహ ! నీకు నేను అక్రియావాదినని అనుమానం వున్నదా !'' అని బుద్ధభగవానుడు చిరునవ్వు నవ్వాడు.



# సింహ సేనాపతి

''ఆ అనుమానం తీర్చుకుందామనే గదా వచ్చింది'' అన్నాడు సింహసేనాపతి.

''అవును ! అనుమానం కలగడం సహజమే. నేను చెబుతున్న ధర్మంలో కొంత అక్రియగా కన్పించేది వుంది. ఇక నీకు జైనులు తోడాయెను. అందువల్ల అంతా అక్రియగానే భాసిస్తుంది'' అని మెల్లగా హసించాడు బుద్ధుడు.

''అంటే మీ ధర్మంలో కొంత అక్రియ గూడా వున్నదంటారు ?'' అని ప్రశ్నగా కన్పించకుండా సేనాపతి ప్రశ్నించాడు. భగవంతుడైన బుద్ధుడు ఇల్లా సమాధానం చెప్పాడు.

''సింహ ! కాయదుశ్చరితం, వచన దుశ్చరితం, మనోదుశ్చరితం పనికిరాదంటాను. అట్లాగే అనేకమైన పాపాలను చెయ్యవద్దంటాను. మంచిపని చెయ్యకపోయినా చెడుపని చేయకుండా వూరుకోవడం మంచిదంటావా ! కాదంటావా ? ఇదే అక్రియా అయితే, జైనులు చెబుతున్న క్రియావాదంకన్నా, నా యీ అక్రియ వాదమే ధర్మవిహితం అని తేలడంలేదా.


సంస్కృతి

త్రాగడం నాగరికత
త్రాగకపోవడం సంస్కారం
నాగరికతా సంస్కారాల
నడుమ నలుగుతూంది
నేటి మన సంస్కృతి

— కొండవలస శ్రీనివాసరావు

సింహ ! ఇది గౌతమశ్రమణుని అక్రియావాదం. క్రియావాదం గూడా బుద్ధుని మతంలో చాలా వుంది. ఈ క్రియకోసమే ధర్మోపదేశం జరుగుతున్నది. నేను కాయసుచరితాన్ని బోధిస్తున్నాను. కాయసుచరితం అంటే అహింస, మనస్సును వ్యభిచరించకుండా పట్టుకోవడం. దొంగబుద్ధి లేకుండా వుండటం.

అట్లాగే వాక్సుచరితం కావాలంటున్నాను. అంటే సత్యం చెప్పమంటున్నాను. నోరు పారవేసుకోవడం, మాటల్లోకి కాఠిన్యాన్ని రానీయడం తగదంటున్నాను. అట్లాగే మనసాసుచరితం వ్యక్తమానం కావాలంటున్నాను. అంటే లోభచింత, ద్రోహచింత మొదలైన దుష్టవిశేషాలను వదిలిపెట్టి సమ్యదృష్టిని అలవరుచుకోమంటున్నాను. ఇది ఉత్తమ ధర్మం యొక్క క్రియారూపం అని చెబుతున్నాను. ఈ విధంగా గౌతముడు క్రియావాది గూడాను.

సింహ ! ఇది నువ్వు విన్నావో లేదోగాని, కొంతమంది నన్ను గురించి నాతోనే ఇట్లా అంటూవుండటం వుంది. ''గౌతముడా ! నీవు చెప్పే ధర్మం మమ్మల్ని ఆశ్వాసిస్తున్నట్లు వుంటుంది.దుఃఖాన్నినివారించేదివలె వుంటుంది.'' నేను అట్టి విధంగా లోకాన్ని ఆశ్వాసించడం కోసమే ధర్మబోధ చేస్తున్నాను. అందువల్లనే ఇంతమంది శ్రావకులు నా ధర్మాన్ని అవలంబిస్తున్నారు.''

## 5

బుద్ధుని ఈ ధర్మోపన్యాసం సింహ సేనాపతిని ముగ్ధుణ్ణి చేసింది. అతని మనస్సులో ధర్మపువాసనలను గాలిలాగా వూదింది. ''భగవానుడా ! ఆశ్చర్యం ! ఇదిగదా ధర్మం అంటే ! నన్ను మీ ఉపాసకులలో చేర్చుకోండి. తరిస్తాను'' అన్నాడు.

బుద్ధభగవానుడు ఆ మాటలు విని కొంచంసేపు ఆలోచనా నిమగ్నుడై అనంతరం తలను ఒకసారి పంకించి ''సింహ ! కొంచెం ఆలోచించి మరీ ఏదన్నా చెయ్యి; నీవంటి వూరికే సంభ్రాంతులయ్యే మనుష్యులు విషయాన్ని బాగా ఆలోచించి, తెలుసుకున్న తర్వాత ఏమన్నా చెయ్యడం మంచిది.'' అన్నాడు.

''భగవంతుడా ! మీ ధర్మ కథనం నన్ను చాలా సంతుష్టుణ్ణి చేసింది. ఇక మీరుగాబట్టి అంటున్నారు గాని, ఇంకో ఇంకో శ్రావకుడు ఎవరైనా, నావంటి శిష్యుడు దొరకగానే వైశాలి అంతా తిరిగి ఇదిగో ! సింహసేనాపతి నాకు శిష్యుడైనాడు అని సగర్వంగాచాటి చెప్పుకునేవాడు. కాని మీరు అట్లా చెయ్యడంలేదు, అది గూడా నన్ను సంతుష్టుణ్ణి చేస్తున్నది. భగవంతుడా ! నన్ను నీ ఉపాసకుణ్ణిగా స్వీకరించు. ఇదిగో రెండోసారి నిన్ను శరణు అంటున్నాను.''

ఈ మాట విని భగవానుడైన బుద్ధుడు ఈలా అన్నాడు :

''సింహ ! చాలాకాలం నుంచి మీ యింటివారంతా, నిగంఠ జైనులను అనుసరిస్తూ వచ్చారు. నిగంఠనాథునికి మీ యిల్లు చిరకాలం ఆశ్రయమై వుంది. ఇప్పుడు ఈ శాక్యభిక్షుని ఉపాసకుడవై అతనికి భిక్ష పెట్టనంటే, అది నాకు నచ్చదు. అట్టి కోరిక నాకు వున్నదని ఎన్నడూ భావించకు. అందుచేతనే నా మాటలు విని సంభ్రాంతులై పొంగేవాళ్ళను హెచ్చరిస్తూ వుంటాను.''

''భగవంతుడా ! నా మనస్సు నీయందు ఎంత ఇదిగా అభిరతం అయ్యేట్లు చేసుకుంటున్నావు ! నీలోని ఈ మహాగుణం నన్ను అతిప్రసన్నుణ్ణి చేస్తున్నది. సంతుష్టుణ్ణి పొనరుస్తున్నది. నేను వాళ్ళ వీళ్ళ అంటూ వుండగా విన్నానుగదా ''గౌతమ శ్రమణుడు ఉపాసకులను తనకే భిక్షవేయమని శాసిస్తాడని మరి ఇంకో ధర్మాన్ని అనుసరించే భిక్షువుకు భిక్షవేయ వద్దంటాడని.'' కాని ఇప్పుడు ఏమి వింటున్నాను. భగవంతుడైన బుద్ధుడు నన్ను నిగంఠజైనుణ్ణి తిరస్కరించవద్దని హెచ్చరించడం వింటున్నాను. భగవంతుడు చెప్పినదే

ముక్తమని గూడా నా భావానికి తడుతున్నది. బుద్ధుడా! ఇదో మూడోసారి అడుగుతున్నాను. నన్ను నీ ఉపాసకునిగా స్వీకరించు. శరణు అంటున్నాను.''

## 6

ఆ అనంతరం భగవంతుడు సింహసేనాపతికి ఆను పూర్వికథను చెప్పారు. దానకథ, శీలకథ, స్వర్గకథ చెప్పారు. కామభోగాలలోవున్న దోషాన్ని వివరించారు. నిష్కామకర్మయొక్క మహత్వమెట్టిదో బోధించారు. మనస్సు, దాని ఆరోగ్యము అంటే ఏమిటో, అరోగ చిత్తము, మృదు చిత్తము, అనాచ్ఛాదిత చిత్తము, ఉద్గ్ర చిత్తము, ప్రసన్నచిత్తము, అంటే ఏమిటో చెప్పారు. దుఃఖము, సముదయము, నిరోధము, మార్గము, ఇవి వివరించారు. ఇవ్వన్నీ వింటూ సింహసేనాపతి కూర్చున్న ఆసనంమీద కూర్చున్నట్లే విమలుడు, ధర్మచక్షువు, ప్రసన్నచిత్తుడు అయినాడు. అప్రయత్నంగా అతని నోటివెంట ఏది సవోదయధర్మమో, అది నిరోధధర్మం గూడాను అన్న మాటలు వచ్చాయి. సింహ సేనాపతి దృష్టధర్ముడు, ప్రాప్తధర్ముడు, విహితధర్ముడు, పర్యవగాఢధర్ముడు అయినాడు. సందేహ రహితుడైనాడు. వాదంతోను, వివాదంతోను నిమిత్తంలేని చిత్తశుద్ధి ఆయనకు అప్పుడు లభ్యమైంది. విశారదత ప్రాప్తించింది. శాస్త్రమొక్క శాసనంచేత స్వతంత్రుడైనాడు.

అప్పుడు ఆయన భగవంతునితో ఈలా అన్నాడు. ''భగవంతుడా మీరు సంఘసహితంగా రేపు నా ఆతిథ్యాన్ని స్వీకరించండి.''

భగవంతుడు మౌనంతో ఆ ప్రార్థనను స్వీకరించారు. భగవంతుడు తన ఆతిథ్యాన్ని స్వీకరిస్తాడని తెలిసిన అనంతరం సింహ సేనాపతి ఆసనంమీదనుంచి లేచి, భగవంతునికి అభివాదనం చేసి, ప్రదక్షిణం ఆచరించి, ఇంటికి పయనమై వచ్చివేశాడు.

వచ్చిన దగ్గరనుంచి రేపు భోజనానికి ఏర్పాట్లు ప్రారంభమైనాయి. ఒక మనిషినిపిలిచి ''ఒరే! మంచి తాజామాంసం దొరుకుతుందేమో చూసుకురా'' అని సింహసేనాపతి ఆజ్ఞాపించాడు. ఆ రాత్రి అంతా అట్లా సందడిగా నడిచిపోయింది. తెల్లవారినతర్వాత, ఉత్తమ ఖాద్యాలు, భోజ్యాలతో వంట అంతా తయారైన తర్వాత ఆయన బుద్ధ భగవానుడు విడిసివున్న ఆ రామానికి వెళ్ళి భిక్షకు ఆహ్వానించి వచ్చాడు.

## 7

అపరాహ్ణం అయింది. భగవానుడైన బుద్ధుడు చీవరాన్ని ధరించి, పాత్ర పుచ్చుకొని భిక్షు సంఘసహితంగా పాదచారయై భిక్షకు కదిలి వచ్చారు. సింహసేనాపతి ఆసనాలు అవీ ఏర్పాటు చేసి వడ్డన అంతా సిద్ధం చేయించివేశాడు. భగవంతుడు భిక్షను స్వీకరిస్తున్నాడు.

ఏ సమయాన బుద్ధుడు సింహసేనాపతి గృహంలో భిక్ష స్వీకరిస్తున్నారో, ఆ సమయంలోనే నిగంఠజైనులు వైశాలీలో ఇంటి ఇంటికి తిరుగుతూ బుద్ధునిగూర్చి సింహసేనాపతిని గూర్చి దుష్ట ప్రచారం ప్రారంభం చేశారు. సింహసేనాపతి నేడు ఒక మోట పశువును చంపి శాక్యపుత్రశమణకుడికి వండి పెడుతున్నాడు. అట్లా ఈ సేనాపతి చేశాడని తెలిసికూడా గౌతమశ్రమణకుడు ఆ మాంసం తింటున్నాడు. అసలు గౌతముడే ఆ మాంసం వండించి పెట్టమన్నాడు అంటూ ప్రచారం చేశారు.

ఇదంతా కని, విని, ఒక వ్యక్తి నిజమే అనుకొని సింహ సేనాపతి యింటికి వచ్చి ''అయ్యా! మీరు ఇది విన్నారా?''అని అడిగాడు.

''ఏమిటి? విన్నది?''

''నిగంఠజైనులు చెబుతున్నది.''

''ఏమి చెబుతున్నారేమిటి?''

''బుద్ధుడికి మీరు మోటపశువు మాంసం వండి పెట్టేస్తున్నారని!''

''ఇంతేగదా!'' అని సింహ సేనాపతి నవ్వి వూరుకున్నాడు. ఆ వచ్చిన వ్యక్తికి ఆశ్చర్యం వేసింది. ఔత్సుక్యమూ కల్గింది. ఇంతేగదా అంటే ఏమిటన్నట్లు చూచాడు.

సింహసేనాపతి ఇట్లా చెప్పాడు. ''బాబూ! ఇదంతా నీకు తెలియదు. ఈ నిగంఠజైనుడు వున్నాడే ఆయన చిరకాలంనుంచి నా దగ్గర బుద్ధుణ్ణి తిట్టడం, నిందించడం ఒక పనిగా పెట్టుకున్నాడు. ఆయనకు రెండే పనులు వున్నాయి. ఒకటి బౌద్ధధర్మాన్ని నిందించడం, రెండు బౌద్ధసంఘాన్ని నిందించడం. ఆయనకు భగవంతుడయిన బుద్ధుణ్ణి అసద్వాదియని, తుచ్ఛుడని, మిథ్యావాది అని నిందించటానికి నోరు ఎట్లావస్తున్నదో తెలియకుండా వుంది. సిగ్గులేకపోతే సరి! ఇక మాంసం అంటావా, ఇది విను, మేము ప్రాణరక్షణ నిమిత్తమైగూడా ఇంకో ప్రాణాన్ని తియ్యం.''

ఈ మాటలు అని సేనాపతి యింటిలోకి వచ్చివేశాడు. లోపల వడ్డన జోరుగా సాగుతోంది. సేనాపతి స్వయంగా భగవంతునికి ఉత్తమ ఖాద్యాలను భోజ్యాలను వడ్డించి సంతర్పితుణ్ణి చేశాడు. భోజనం అయిన తర్వాత చేతులు కాళ్లు కడుగుకొని భగవానుడు ఆశీనుడైనాడు. తక్కుంగల భిక్షు సంఘం అంతా ఆయన చుట్టు చేరింది. సింహ సేనాపతి గూడా వేరే ఆసనంమీద కూర్చున్నాడు. భగవానుడు ధార్మికకథా కథనంతో అందర్నీ సంతర్పితులను చేశాడు.

## 8

ఆరామం చేరుకొనేదాకా శాక్యముని ఎవరితోను ఏమీ దారిలో మాట్లాడలేదు. ఆరామం చేరుకున్న తర్వాత ఆయన భిక్షు సంఘాన్ని సమావేశ పరిచారు. నిగంఠ జైన వృత్తాంతం ఆయన మనస్సులో ఆడుతూనే వుంది. మాంసాహారాల్ని గూర్చి వారు చేస్తున్న దుష్ప్రచారం భగవానుడికి కష్టం కల్గించింది. సమావేశమైన భిక్షు సంఘాన్ని తిలకించి ఆయన ఈలా అన్నాడు: మీకు ఆ యా మాంసాలు ఇష్టం అని చెప్పి వండించుకు తినండి. శుద్ధ మత్స్యం యొక్క మాంసం తినడానికి మాత్రం అజ్ఞ ఇస్తున్నాను.

ఈ విధంగా సింహ సేనాపతి దీక్ష బుద్ధుని ధర్మానికి ఒక కొత్త శాసనాన్ని సమకూర్చి పెట్టింది. 

కావలెను!

ఇటీవల మదరాసు విజయాగార్డెన్స్‌లో జరిగిన యోగ్రపియ ఆర్ట్ క్రియేషన్స్ వారి "ముద్దుల చెల్లెలు" పాటల రికార్డింగ్ సందర్భంగా గాయనీ గాయకులు సుశీల, బాలసుబ్రహ్మణ్యం, దర్శకుడు ఇమంది రామారావు, సంగీత దర్శకుడు కె. వి. మహదేవన్, కో–డైరెక్టర్ కేశవరావు, నిర్మాత రమణయ్యనాయుడుగార్లని చిత్రంలో చూడవచ్చు.

"లాటరీ టికట్ కొన్నాను-బహుమతి రాగానే నిన్ను హీరోయిన్‌గా పెట్టి సిన్మా ప్రారంభించటమే ఇక!"

## ఇమంది రామారావు దర్శకత్వంలో కొత్త చిత్రాలు

ఇటీవలే యోగ్రపియ ఆర్ట్ క్రియేషన్స్ "ముద్దుల చెల్లెలు" కు దర్శకుడైన ఇమంది రామారావు దర్శకత్వంలో మరికొన్ని చిత్రాలు తయారు కానున్నాయి.

"మురళీ–మోహన్" గా మురళీమోహన్ ద్విపాత్రలు నిర్వహించే చిత్రాన్ని మల్లీశ్వరి ఆర్ట్ క్రియేషన్స్ పతాకంలో మామిళ్ల సత్యనారాయణ నిర్మిస్తారు. మార్చి నెల నుంచి షూటింగ్ జరుగుతుంది.

ఎం. జగపతిరాజు "సన్నజాజులు" అనే సంగీత నృత్యప్రధాన చిత్రాన్ని నవనటీనటులతో నిర్మిస్తారు. ★

# ఇదిగో, మిత్రమా



తప్పిచూడు....
లోతుగా....
ఇంకా....
ఇంకా ఇంకా....

నిజాన్ని గ్రహించేందుకు జీవిత రహస్యాలను తెలుసుకునేందుకు

## ఉదాహరణకు మా జాండెక్స్ చూడండి.




ఇది కామెర్లకు మేలైన మందని మీకు బాగా తెలుసు.
అయితేనేం ఇంకా తెలుసుకోండి.
కాలేయానికి సంబంధించిన అన్ని వ్యాధులకి కాలేయం చురుకుగా పని చేయకపోతూవుంటె జీర్ణశక్తి సరిగ్గా లేకపోతే, ఆకలి నశిస్తోవుంటె మద్యపానం వలన కాలేయం చెడిపోయినప్పుడు కూడా జాండెక్స్ ఎంతో మేలుగా పనిచేస్తుంది.
కాలేయాన్ని సరిగ్గా వుంచేందుకు జాండెక్స్‌ని వరుసతప్పకుండా తీసుకోండి.
మీ జీర్ణశక్తికి, ఆరోగ్యానికి.



తయారుచేయువారు:
ద. కృ. పాండూ బ్రదర్స్,చెంబూర్, ప్రైవేట్ లిమిటెడ్
ద. కృ. పాండూ మార్గ్, చెంబూర్ బొంబాయి-400071.

ఆయుర్వేద సేవలో 84వ ఉజ్వల సంవత్సరం.

AH-S/83-58/TLC

## మంత్రాలయ ప్రభువులు

కులభేదాలను పాటించలేదు. ఒక హరిజనుని ఆదరించి అతడు ప్రీతితో ఇచ్చిన నిషిద్ధమైన ఆహార్యాన్ని కూడ స్వీకరించి, ఏనాటికీ దానినే నైవేద్యంగా ఉంచవలెనని నిర్దేశించినాడన్న అతడెంతటి ఉదార హృదయుడో తెలియవస్తుంది. ఈ సూక్ష్మాన్ని గ్రహించక ఎవరో ఏదో చేస్తే రాఘవేంద్రుడు పరమత ద్వేషి, ఆయన మధ్వాల గురువు మాత్రమేనని వ్యాఖ్యానించడం సబబు కాదు. అందరికీ ఉండవలసిన విధంగానే ఆయనకు కూడ స్వమతాభిమానం ఉండవచ్చును. ఉండవలె కూడ! అంతేకాని ఆయనకు స్వమత దురభిమానం లేదు. పరమత విద్వేషం అవగింజంతైనా లేదు. ఒక నవాబు దానం చేసిన స్థలమే కదా ఆయన వెలసిన స్థలం!

రాఘవేంద్రుని ప్రజ్ఞాపాటవాలు అనన్య సామాన్యాలు. సంగీత సాహిత్యాలలో ఆయనది అందెవేసిన చెయ్యి. అపురూపమైన తంత్రదీపిక, న్యాయముక్తావళి, అథర్వనివృత్తి, సుధాపరిమళ ఇత్యాది గ్రంథాలను రాసిన ఆయన వాసిరాశుల కెక్కినది., నారద తుంబురులను మరిపించి పామర పండితులను మురిపించే అతని వీణా నినాద సంగీత నిక్వణాలు మాణిక్యవీణా మణులై కళామతల్లి నయన జ్యోతులై వెలుగొందిన అజరామరానుభూతులు. కల్పతరువుగా, కామధేనువుగా విశేష శేముషితో అశేషజన వాహినిని అలరిస్తున్న అతని జన్మ ధన్యం!

ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఇన్నాళ్లకు రాఘవేంద్రుడు బాగా వెలుగులోకి రావడం! గత దశాబ్దంగా రాఘవేంద్రుని ప్రాచుర్యం వినువీధిలోని శశాంక జ్యోత్స్నలా వెలుగొందుతోంది. అది అనవరతమై, అప్రతిహతమై వికసిస్తూ జనావళికి ఊరడింపును కలిగించగలదని ఆశించడం కనీస ధర్మం!

వ్యాసం, ఫొటోలు :

— డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు

# మంగళకరమైన వెన్నెల మోమును మెరుగు పరచటానికి

# ఐటెక్స్

## మాట్ ఫినిష్ తిలకం




## ఉచితము

దీపావళి సందర్భములో మా అభిమాన
వాడుక దారులకు ఐటెక్స్ కానుక

ఇదుగో! మీ వెన్నెల మోమును
మెరుగు పరిచే ఐటెక్స్ డీలక్స్
మాట్ ఫినిష్ తిలకమును—9 గ్రాములు,
లేక 5 గ్రాములలో ఒక దానిని కొను నప్పుడు —
ఐటెక్స్ మీడియం కాటుక
ఒకదానిని ఉచితముగా పొందండి.

**త్వరపడండి! 1-11-1983 మొదలు**
**అమలు పరుచే ఈ అవకాశము —**
**దక్షిణ భారతము లో మాత్రమే.**

**అరవింద్ లాబొరేటరీస్**
**మద్రాసు 600033**

వ్యాపార మరియు వర్తక విచారములకు:
ప్రగతి ఏజన్సీస్, పో. బా. 162, విజయవాడ-1, రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం మరియు గుంటూరు జిల్లాలకు.
ప్రగ్‌జ్యోతి ఏజన్సీస్, పులిపాటివారి వీధి, విజయవాడ-1, సర్కార్లు మరియు తెలంగాణా ప్రాంతములకు.

Imageads M-1807



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "మధుమతి"

"క్షణ క్షణం ఊసరవిల్లిలా రంగులు మారుస్తూ, వికార నాగరికత మోజులో అకారణంగా పాడైపోయిన ఒక చదువుకునే అమ్మాయి గాథ," అన్నారు ఐ. కమల్‌కుమార్. ఈయన కథ, స్క్రీన్ ప్లే, మాటలు, దర్శకత్వంలో ఎస్. మంజుల నిర్మించే మంజు సినీ క్రియేషన్స్‌వారి పై చిత్రానికి అక్టోబర్ 17న తొలి గీతం ధ్వనిముద్రితమైంది. సి. నారాయణరెడ్డి గీతాలు, సత్యం సంగీతం, పి. లక్ష్మణ్ ఛాయ, ఆదినారాయణరావు ప్రొడక్షన్‌తో రాజమండ్రి ప్రాంతాల్లో నవంబర్ ఆఖరి వారం నుంచి నిర్విరామంగా షూటింగ్ పూర్తి చేసుకునే ఈ చిత్రంలో జయమాల నాయిక.

## శ్రీ సారథి స్టూడియోస్ చిత్రం

"డిసెంబర్ 15 నుంచి భాగ్యరాజా కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఒక చిత్రాన్ని మొదలెడుతున్నాం. ఆయనే హీరో కూడా. హీరోయిన్‌గా కొత్త నటిని పరిచయం చేయాలనుకుంటున్నాం," అన్నారు నిర్మాతశశిభూషణ్. ఈ చిత్రం తమిళంలో కూడా తయారవుతుంది. తమిళ చిత్రాన్ని ప్రవీణా ఆర్ట్స్ సంస్థ సమర్పిస్తుంది.

కృష్ణంరాజు, జయప్రద 'సర్దార్'





'గూండా'లో రాధ

## "సర్దార్"లో ఆశాభంగం

కొండ ప్రాంతం. సర్దార్ (కృష్ణంరాజు) ఏదో ఆలోచిస్తూ నిలుచొనున్నాడు. గౌరి (కవిత) వెనుక మాటుగా వచ్చి, సర్దార్ కళ్ళు మూసింది. 'నేనెవరో చెప్పుకోవాలి," అంది.

"నా కళ్ళుమూసే ధైర్యం నీకుకాక మరెవ్వరికి ఉంటుంది ?" అన్నాడు సర్దార్.

అంత మాత్రానికే గౌరి హృదయం ఉరకలు వేసింది. పరుగులు తీసింది.

"ఏయ్, గౌరీ ! ఇలా... రా !"

గౌరి వచ్చి తల వంచుకుని నిలుచుంది.

"ఎందుకలా పరుగెత్తావ్ ?"

"సిగ్గేసింది."

"సిగ్గా ! నా దగ్గర ఎందుకు ?"

"నా ముఖం చూస్తే నీకేం తెలియడం లేదా ?"

సర్దార్ నిశితంగా చూశాడు. "నాకేమీ తెయడం లేదే !"

"నేనూ... నేనూ..." అని గౌరి క్రీగంట చూస్తూ చెప్పబోతూండగా ఎక్కడ్నుంచో ఓ ఉత్తరం వచ్చి వాళ్ళ ముందు పడింది.

సర్దార్ ఆదుర్దాగా తీసి చదవసాగాడు. "సర్దార్ ! మమ్మల్ని చావగొట్టి పంపగలిగానని సంతోషిస్తున్నావు కదూ ? నీ ప్రియురాలు

జయ ఇప్పుడు మా దగ్గర బందీగా ఉంది. నువ్వు వెంటనే జంట కొండల దగ్గరకురా ! లేకపోతే నీ ప్రియురాలి శవం ముక్కలుముక్కలై నీ దగ్గరకు చేరుతుంది... భైరవుడు.''

సర్దార్ కంగారుగా పరుగుతీశాడు. అతను పడేసిన ఆ ఉత్తరాన్ని అందుకుని గౌరి చదివింది. ఆమె కనుకొలకుల్లో రెండు కన్నీటిబొట్లు నిలిచాయి.

నందం హరిశ్చంద్రరావు దర్శకత్వంలో కె. సి. శేఖర్‌బాబు నిర్మించే దేవీ కమల్ మూవీస్ ''సర్దార్'' చిత్రంలో జయప్రద, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, త్యాగరాజు, హేమసుందర్, మాడా, శారద, జయమాలిని, రాగిణి ఇతర పాత్రధారులు. భీశెట్టి కథకు పరుచూరి సోదరులు సంభాషణలు వ్రాశారు. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. ఎస్. వెంకటరత్నం ఛాయాగ్రాహకుడు.

## డైరెక్టర్ కోదండరామిరెడ్డి చిత్రాలు

★ చిరంజీవితో మిద్దె రామారావు నిర్మిస్తున్న శ్రీరాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ ''గూండా'' చిత్రం డిసెంబర్ చివరి వారంలో విడుదలవుతుంది.

★ ఎ. ఎన్. ఆర్. తో సంగమూరి శ్రీనివాసరావు సమర్పణలో ఎన్. ఆర్. అనూరాధాదేవి నిర్మించే లక్ష్మీఫిలిమ్స్ కంబైన్స్ 7వ చిత్రం తొలిషెడ్యూల్ నవంబర్ 21 నుండి 30 వరకు జరిగింది.

★ ఎం. అర్జునరాజా సమర్పణలో వి. కనకరాజు నిర్మించే రోజా ఎంటర్‌ప్రైసెస్ చిత్రంలో శోభన్‌బాబు, శ్రీదేవి నాయకా నాయికలు.

★ రాశీ మూవీస్ ''బావా మరదళ్ళు'' లో శోభన్‌బాబు, రాధిక, సుహాసిని ముఖ్యభూమికలు నిర్వహిస్తున్నారు. మంతెన దేవేంద్రరాజు సమర్పణలో ఎం. నరసింహారావు నిర్మాత.

★ 1984 జనవరిలో సెట్స్‌కు వెళ్ళే క్రియేటివ్ కమర్షియల్స్‌వారి చిత్రంలో చిరంజీవి హీరో.

★ ఎ. ఎన్. ఆర్ హీరోగా అనూరాధా ఆర్ట్ కంబైన్స్ చిత్రం ఫిబ్రవరిలో మొదలవుతుంది.

★ ఫిబ్రవరిలోనే అంకురార్పణ జరిగే మహేశ్వరీ మూవీస్ చిత్రంలో శోభన్‌బాబు; రాధిక, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, ఆదిగాగల వారుంటారు. చక్రవర్తి సంగీత దర్శకుడు. ఎస్. పి. వెంకన్నబాబు నిర్మాత.

★ మార్చిలో నిర్మాత మిద్దె రామారావు ప్రారంభించే శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ చిత్రంలో కృష్ణ హీరో.

★ చిరంజీవి,ఊర్వశి నాయకా నాయికలుగా ఎస్. పి. వెంకన్నబాబు ఏప్రిల్ నుంచి నిర్మించే ''రుస్తుం'' చిత్రంలో సత్యనారాయణ, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య ఇతర పాత్రధారులు. చక్రవర్తి సంగీత దర్శకుడు.

★ జూన్ నుంచి ఎన్. రామలింగేశ్వరరావు నిర్మించే చిత్రంలో కృష్ణ నాయకుడు.

★ ఇంకా కృష్ణ హీరోగా, చిరంజీవి హీరోగా డాక్టర్ తిరుపతిరెడ్డి నిర్మించే సంయుక్తా మూవీస్ రెండు చిత్రాలకు కోదండరామిరెడ్డి దర్శకుడు.

## సినిమా


'పుణ్యంకొద్దీ పురుషుడు'లో శోభన్‌బాబు, జయసుధ

'సంఘర్షణ'లో చిరంజీవి, విజయశాంతి









# తెర పొరలు

అంబిక రాసిన ఓ సీరియల్ నవల ఒక తమిళ పత్రికలో ప్రచురితమవుతోంది. ''చిన్నప్పట్నుంచీ కథలు రాయడమంటే నాకెంతో సరదా. మూడ్ ఎప్పుడొస్తుందో నాకే తెలీదు. స్నానం చేస్తున్నప్పుడు మెరుపులా ఏదో థాట్ తళుక్కుమందనుకోండి. ఆదరాబాదరాగా స్నానం ముగించి, తలకూడా సరిగా తుడుచుకోకుండానే కాగితం, కలం పుచ్చుకుంటాను. ఆ ఫ్లాష్ వచ్చినప్పుడు రాస్తేనే – లేకపోతే, ఆ తర్వాత మైండ్ డైవర్ట్ అయిపోతుంది... ఈమధ్య ఓ అర్ధరాత్రి ఉన్నట్టుండి మెలకువ వచ్చింది. వెంటనే బ్రహ్మాండమైన ఐడియా తట్టింది. అంతే. లైట్ వేసి రాసుకుంటూ కూర్చుండిపోయాను. కాస్సేపటికి మా చెల్లాయి రాధ మేల్కొంది. 'ఏమిటే, పిచ్చిదానా! రేపు తెల్లవారి రాసుకోవచ్చులేవే. పడుకో,'' అంది. ''నీకెందుకే – నా అవస్థేదో నే పడతాలే,' అన్నాను. నాకెంతో రాయాలని ఉంది. కాని, ఇటీవల తీరుబడిగా ఒకచోట కూర్చోడానికే వీలవడంలేదు. నేను నటిని కాకపోతే రచయిత్రిగానే ఉండిపోయేదాన్నేమో!'' అంది అంబిక. దీపావళికి ముందు వాళ్ళింట్లో ఒక మూల రేషన్‌కార్డు కనిపిస్తే, వాళ్ళ తల్లి ''ఎనిమిది నెలలుగా ఈ కార్డు ఖాళీగా పడుంది. దీన్ని తీసుకొని షాప్‌కి వెళ్లి ఏమైనా సరకులు తెచ్చుకో,'' అని పనిమనిషికి ఇచ్చి పంపించిందట. కొట్టతను ''ఇన్ని నెలలుగా మీరు రేషన్ ఎందుకు తీసుకోలేదో సంజాయిషీ రాసి, దానిమీద రేషన్ ఆఫీసర్ సంతకం తీసుకొస్తేనే రేషన్ ఇవ్వగలం,'' అన్నాడట. ''ఇదెక్కడి న్యాయమండీ, బాబూ!'' అంది అంబిక.

*     *     *

ఒక సెట్లో తనను చూడ్డానికి వచ్చిన ఒక స్నేహితురాలితో రాధ ''నేను నీకో మాంచి సలహా ఇవ్వనా? నువ్విలా ఒక్క జడ వేసుకోవడంకన్నా చక్కా రెండు జడలు వేసుకో. నీ వయసు అయిదేళ్ళు తగ్గినట్లు కనిపిస్తుంది,'' అంది.

*     *     *

రేలంగి నరసింహారావు దర్శకత్వం వహించే ఆండాళ్ కంబైన్స్ ''మానసవీణ'' చిత్రానికి కొన్ని సన్నివేశాలు ఆ చిత్ర నిర్మాత రామ అరంగణ్ణాళ్ స్వగృహంలో చిత్రీకరించబడ్డాయి. ఒకరోజు అక్కడ షూటింగ్ స్పాట్‌లో గుప్పున మల్లెపూల సువాసన గుబాళించింది. నాయిక రేవతి తలనిండా మల్లెపూలు.. ఆమె నవ్వుతూ, ''వాడిపోతాయని షూటింగ్‌లప్పుడు మామూలుగా కాగితపు పువ్వులనే వాడుతూంటారు కదా? కాని, నేను రియల్ ఎఫెక్ట్ కోసం అసలు మల్లెపూలనే పెట్టుకున్నాను. తమాషా ఏమిటంటే – నేను నిజజీవితంలో పువ్వులు అసలే పెట్టుకోను. ఎందుకో ఏమో – చిన్నప్పట్నుంచీ అంతే,'' అంది. ఈమె ఇటీవల టి. వి. ఎస్. మోపెడ్ కొన్నదట. ''అందులోనే షాపింగ్‌కు వెళ్తూంటాను,'' అంది. ''మానసవీణ'' చిత్రంలో నవనటుడు రాజకుమార్ హీరో. నారాయణరావు, రమణమూర్తి, బాలాజీ, పద్మ, సుందరి, కృష్ణవేణి, జయవిజయ ఇతర పాత్రధారులు. జనవరి విడుదల.

*     *     *

నవంబర్ 1న కర్నాటక రాష్ట్రోత్సవ సందర్భంలో ప్రముఖ కన్నడ హీరో డాక్టర్ రాజ్‌కుమార్ అభిమానులు 15 వందలమంది రక్తదానం చేశారు.

## సినిమా

### కోటీశ్వరుడులో కొత్త సోషలిజం!

కృష్ణ (ఎ.ఎస్.ఆర్)ను లొంగదీసుకోడానికి పరాత్పరరావు (నూతన్‌ప్రసాద్) నోట్ల కట్టలు చూపిస్తూ, "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే—అన్నారు అందు కోసం పుట్టిన ధర్మారావుని నేనే కృష్ణా! నువ్వెంతో తెలివైనవాడివి ఒకపక్క పదునున్న కత్తులు చాలా ఉన్నాయ్ మా దగ్గర. నువ్వు రెండు పక్కలా పదునున్న కత్తివి కాబట్టి మాలో చేరిపో!" అన్నాడు

కృష్ణ నిర్లక్ష్యంగా "మిస్టర్ ధర్మారావ్! ఈ కట్టలతో నన్నాకట్టుకోవాలనుకోవడంలో నీ ఉద్దేశ్యం ?" అని ప్రశ్నించాడు.

"సదుద్దేశమే నువ్వు మాతో కలిస్తే, 33 పువ్వులూ, 66 కాయలూ అవుతుంది మా వ్యాపారం."

"ఏమిటా వ్యాపారం ?"

"ఏముంది మెరకను తవ్వి పల్లానికివేసి లెవల్ చెయ్యడం—నూతన సోషలిజం ఆ విధంగా సమాజాన్ని రోడ్డు లెవల్ చేసినట్లుచేసి, ప్రజల్ని లోలెవల్లోకి తోసెయ్యడం, మనం హై లెవల్‌కి ఎగిరిపోవడం!"

"చూడు, మిస్టర్! రోడ్స్ లెవల్ చెయ్యడానికి రోలర్స్ ఉన్నాయి. ప్రజల్ని లెవల్ చెయ్యడానికి రూలర్స్ ఉన్నారు మీలాంటి రౌడీలను లెవల్ చెయ్యను పోలీసులున్నారు."

"ఏంటీ! మేం రౌడీస్‌మా ?"

"కాకపోతే, రాస్కెల్సా ?"

"ఆ... నిన్ను ..." పరాత్పరరావు ఆవేశంతో ఊగిపోయాడు.

"చూడూ! పాపం, నీకు జలుబు చేసినట్టుంది. నా దారి మార్చాలనే ప్రయత్నం మానుకో. లేదా—ముక్కెలిరగతన్ని పోలీస్ స్టేషన్‌లో తోయిస్తాను. జాగ్రత్త!"

"నన్ను పోలీస్ స్టేషన్‌లోకి తోస్తావా? ఎమ్మెల్యేల దగ్గర్నుంచీ మినిస్టర్ల వరకూ పలుకుబడి సంపాయించిన పెద్దమనిషిని. నూతన సోషలిజం కోసం నేనెంత పాటుపడుతున్నానో, నా సోషల్ స్టేటస్ ఏమిటో హైదరాబాద్‌నుంచి ఢిల్లీవరకూ తెలుసు చూడు, కృష్ణా! శత్రువులు X శత్రువులు=మిత్రులు—అనే లెక్క ప్రకారం అడుగుతున్నాను బాగా ఆలోచించుకో. మాతో కలిసిపో!"

"అత్యాచారం X అన్యాయం = యావజ్జీవ కారాగారం. నా చేతిలో పడితే, నువ్వు శవాకారం అని తెలుసుకో..వస్తా!" అంటూ కృష్ణ బయలుదేరాడు

"నన్ను శవాకారం చేస్తావా? నిన్ను కంకర రోడ్ లెవల్‌కి తీసుకురాకపోతే, నేను స్మాల్ బాస్‌నేకాదు," అంటూ పరాత్పరరావు భుజాలెగరేశాడు.

కొమ్మినేని దర్శకత్వం వహించిన శరత్ ఆర్ట్స్ "కోటీశ్వరుడు" చిత్రానికి పి హెచ్ రామారావు, టి ఆర్ శ్రీనివాస్ నిర్మాతలు.



'భార్యా భర్తల అనుబంధం'లో అనంతనాగ్, జయమాలిని



'కోటీశ్వరుడు'లో ఒక సన్నివేశం

### కృష్ణ, పి. సి. రెడ్డి కాంబినేషన్‌లో "పులిజూదం"

"గ్రామీణ వాతావరణంతో నిండిన చక్కని కథను, స్క్రీన్‌ప్లేను ఉషశ్రీ సమకూర్చారు," అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన దర్శకత్వంలో పి జె. ప్రభాకరరెడ్డి నిర్మించే ఉషశ్రీ క్రియేషన్స్ "పులిజూదం" చిత్రం నవంబర్ 18న ప్రారంభమైంది కృష్ణ, జయసుధ, సుమలత, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, కాంతారావు, కె విజయ, వంకాయల, పి. ఎల్. నారాయణ ముఖ్యపాత్రధారులు మోదుకూరి జాన్సన్ సంభాషణలకర్త కె వి. మహదేవన్ సంగీత దర్శకుడు సుఖదేవ్ ఛాయాగ్రాహకుడు కళాధర్ శిల్ప దర్శకుడు.




"సినిమా బాగోలేదని బయట ఎవరితోనైనా అన్నావో, తల ఎగిరిపోతుంది జాగ్రత్త!"



శ్రీమతి జి. భవానీకృష్ణమూర్తి

సీరియల్

# అనురాగ తరంగాలు

(గత సంచిక తరువాయి)

సూర్యుడు పశ్చిమాద్రికి చేరుకుంటున్నాడు. మధ్యాహ్నం లీల నిర్ణయం విన్నాక తనలోతనే చాలాసేపు మధనపడ్డాడు. ఓపిక ఉన్నా ఆస్పత్రికి వెళ్ళబుద్ధికాక ప్రభావతమ్మ ఇచ్చిన కాఫీ తాగి పెరటితోటలోకి బయలుదేరాడు.

గూళ్ళలోని పక్షులు బయటికి వచ్చి రెక్కలు టపటపలాడిస్తూ తమవారి రాకకోసం ఆరాటాన్ని వ్యక్తం చేస్తున్నాయి.

ఒడిలో కాగితాలు, చేతిలో పెన్ను, ఎడమ చేతిమీద గడ్డం ఆన్చి ఎటో చూస్తూ ఆలోచిస్తోంది లీల. తలంటుకున్న తలేమో పవనుని కొంటెతనానికి తట్టుకోలేక అవస్థ పడుతున్నాయి ముంగురులు. పెన్ను క్రింద పెట్టి, గడ్డంక్రింది చెయ్యి తీసేసి వేళ్ళు టపటపా విరుచుకుంది. గడ్డిపరకల్ని తెంపి, మునిపంట కొరుకుతూ ఆలోచించింది. అయినా కావలసిన పాయింటు దొరక్క తల విదిలించింది. కణతలు గట్టిగా నొక్కుకుంది.

"ఏమిటి లీలా, అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్."

కళ్ళమీద ఉన్న వేతుల్ని తీసి "నువ్వా ? కూర్చో రఘూ." చీర సర్దుకుని సరిగా కూర్చుంది.

"రాయబోయే నవల గురించా ?" అన్నాడు మళ్ళీ.

"సగం రాయడం అయిందిలే. ఒకోసారి ఐడియా బుర్రలో ఉన్నా రాయడానికి మాటలు దొరకవు. ఇందాకట్నుంచి ఎంత ఆలోచిస్తున్నా వాక్య నిర్మాణం సరిగా కుదరడంలేదు."

"అయితే కాసేపు దాన్ని పక్కనపెట్టు, కొద్దిగా మాట్లాడాలి నీతో" అన్నాడు.

పెన్ కేప్ పెడుతూ "మధ్యాహ్నం జరిగిన దాని గురించేనా ?" అంది.

"అవును నీ నిర్ణయం బాగాలేదు."

"ఎందుకని ?"

"నేను కాదన్నానని అసలు పెళ్ళి మీదే విరక్తిని పెంచుకోవడం నాకు చాలా బాధగా అనిపిస్తోంది లీలా."

"నువ్వు చాలా పిచ్చివాడివి రఘూ. నువ్వు కాదన్నంత మాత్రాన దేశంలో మగవాళ్లే కరువయ్యారా నేను పెళ్ళి చేసుకోవాలనుకుంటే? అసలు చేసుకోననడంలేదుగా, నేనిలా నిర్ణయం తీసుకోడానికి నువ్వేకారణం అనుకుని అనవసరంగా బాధపడకు. అసలే నీ ఆరోగ్యం బాగాలేదు."

"అదీకాదు లీలా ! అసలు నీకు ఆటువంటి ఉద్దేశ్యం ఎందుకు కలిగింది ?"

"అనాదిగా మన సంఘంలో పాతుకుపోయి ఉన్న దురాచారాలకి బలైపోతున్న స్త్రీలు కోకొల్లలు. కామాంధుల పశుత్వానికి బలైపోయి, ఆ అవమానం భరించలేక ఆత్మహత్యలు చేసుకునే వాళ్ళు ఎంతోమంది. చిన్నవయసులోనే పెళ్ళిళ్ళు అయి దురదృష్టవశాత్తు భర్త చనిపోతే అత్తింటి వాళ్ళు ఆదరించక, పుట్టింటి వాళ్ళకి బరువై, సరిఅయిన రక్షణ లేక ఆత్మహత్యలు చేసుకునే అనాధ స్త్రీలు ఎందరో."

చెవులు రెండూ గట్టిగా మూసుకున్నాడు రఘు.

ఒక్క నిముషం ఆగి "అటువంటి వాళ్ల కోసం ప్రభుత్వం ఎన్నో ఏర్పాట్లు చేస్తూనే ఉందిగా" అన్నాడు.

"ఎక్కడ ? కాగితాల్లో, రికార్డుల్లో కొన్ని కోట్లు ఖర్చు చేస్తున్నట్లు ఉంటుందిగానీ, కొన్ని వందలు కూడా ఖర్చు పెట్టడం జరగదు. ఆ డబ్బంతా నిజంగా ఖర్చుచేసి ఉంటే రోజూ ఇన్ని ఆత్మహత్యల గురించి పేపర్లో చదవాల్సి వచ్చేది కాదు. ఆదర్శాలు వల్లించేవాళ్ళే గాని, ఆచరణలో పెట్టేవాళ్ళు లేరు. అయినా ప్రతి దానికీ ప్రభుత్వంమీద ఆధారపడితే అయ్యే పనులా ? మనకి చేతనైనది మనం చేద్దాం. చదువుకున్న స్త్రీకీ, ఉద్యోగం చేస్తున్న స్త్రీకి కూడా భద్రత, రక్షణ లేవు మన సమాజంలో. రాజకీయాల్లో మన స్త్రీల పాత్ర అతి తక్కువ. అవన్నీ ఆలోచిస్తూంటే నా కెంత బాధగా ఉంటుందో తెలుసా ?"

"లీలా ! నువ్వొక్కదానివీ బాధ పడుతూ కూర్చుంటే ఈ పరిస్థితులన్నీ మారవమ్మా. సమిష్టిగా చెయ్యాల్సిన పన్లు అలాంటివన్నీ."

"ఎవరికి వారే అలా అనుకుంటే ఈ దేశం బాగుపడేదెప్పుడు రఘూ ? నిజానికి నువ్వు ఏ సిటీలో అయినా ప్రాక్టీసు పెట్టి వుంటే వేలకి వేలు సంపాదించి ఉండేవాడివి. పట్టుదలగా ఈ ఊళ్ళో ఆస్పత్రి పెట్టావ్ ! ఓర్పుతో చెప్పినవే చెప్పి అజ్ఞానాన్ని పోగొట్టి ఆలోచింపజేస్తున్నావ్ ! అవన్నీ నీ ఒక్కడివల్లా కాలేదా ? "పట్టుదలే ఉంటే కాగలడు మరో బ్రహ్మ" అన్నాడు మహాకవి ఒకరు. మనలాంటి మారుమూల గ్రామాలకి అన్ని సౌకర్యాలూ సమకూరాలంటే ఏళ్ళు గడిచిపోతాయి తప్ప పని జరగదు. నువ్వున్నావు. రేణు ఉంది. అమ్మ, నాన్న ఉన్నారు మనందరం ఒక పద్ధతి ప్రకారం ప్రొసీడ్ అవుతూంటే అది చూసి మరో నలుగురు చేతులు కలుపుతారు. ఆ తరువాత ఇంకో పదిమంది ... వందలు ... వేలు ... చాలు. మన ఊరు బాగుపడినట్లే."

**జరిగినకథ — 5:** వీరరాఘవులు, విశ్వనాధం ఇద్దరూ బాల్యస్నేహితులు. వీరరాఘవులు వ్యాపార నిమిత్తం విజయవాడలో స్థిరపడతాడు. విశ్వనాధం వూర్లోనే వ్యవసాయం చేసుకొంటుంటాడు. పెద్ద కామందు. వీరరాఘవులు పెద్దకొడుకు రఘు అమెరికా వెళ్లి సర్జరీలో అనుభవాన్ని సంపాయించుకొని తిరిగివస్తాడు. విశ్వనాధం ఏకైక కుమార్తె లీలని అతనికిచ్చి చేయాలని ఇరువురూ నిర్ణయించుకొంటారు. లీల కూడా అతన్నే ప్రేమిస్తుంది. కానీ ఎవరూ ఊహించని విధంగా రఘు లీలని చెల్లెలిగా భావిస్తున్నానని చెప్తాడు. తన కిప్పుడే పెళ్లి చేసుకోవాలని లేదని మంచి సంబంధం చూస్తానన్న రఘుతో చెప్తుంది లీల. రఘుకి తన చిన్ననాటి స్నేహితురాలు రేణుక తారసపడుతుంది. రఘు తన చాకచక్యంతో వెంకటేశాన్ని మంచి మనిషిగా తీర్చిదిద్దుతాడు. రఘు, రేణుక తన చిన్ననాటి తలపులు నెమరువేసుకొంటారు. తనకు వాగ్దత్త అయిన రేణుని ఒకరికి అర్పించలేను అన్న వెంకటేశానికి ఆమె జోలికి వెళ్లనని మాట ఇస్తాడు రఘు. కానీ లీల రఘు, రేణులని ఒకటిగా చేస్తుంది. ఓ అనాధశరణాలయాన్ని నడపాలని నిశ్చయించుకొంటుంది లీల.

"నీ ఇష్టం లీలా. నిన్ను నిరాశపరచడం నా అభిమతం కాదు. మరి, అందుకు బిల్డింగు, ఇతర వసతులు కావాలిగా ?"

"ఛ! అన్నీ నీకు ధర్మసందేహాలే. చూస్తూ ఉండు. నా ప్లాను కార్యరూపంలో పెట్టడానికి నీ సహాయం కూడా అవసరమే. నువ్వు చెయ్యాల్సినవి చెప్తాను. చేస్తూండు. చాలు."

మరికాస్సేపు కబుర్లు చెప్పుకుని లోపలికి వచ్చేశారిద్దరూ. అప్పటికి విశ్వనాథంగారుకూడా పొలంనుంచి వచ్చేశారు. వస్తూ సపోటాపళ్ళు పాలేరు నెత్తిమీద గంపపెట్టి పట్టించుకొచ్చారు. ప్రభావతమ్మ అవన్నీ వలిచి ఇస్తూంటే తింటూ కబుర్లలో పడ్డారు. విశ్వనాథంగారు పొలం విషయాలు తప్ప మిగిలిన విషయాలు అట్టే మాట్లాడరు. లీల అయితే నవలల గురించిగానీ, ఆదర్శాల గురించి తప్ప మరోదాని గురించి అట్టే మాట్లాడదు. ఒకవేళ వేరే విషయం గురించి మొదలు పెట్టినా చివరికి అందులోకి వెళ్ళాస్సిందే. ఇద్దరి పద్ధతీ నచ్చదు రఘుకి. అయినా మధ్యలో వెళ్ళిపోతే మనసు కష్టపెట్టుకుంటారని బలవంతంగా ఊకొడుతూ ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చుంటాడు. తనయితే లీల అన్నట్టు రోగాల గురించి వాటి చికిత్సా విధానం గురించి గంటల తరబడి లెక్చరివ్వగలడు. నవ్వుకున్నాడు రఘు.

"ఆ జోకు ఏమిటో చెప్తే మేమూ నవ్వుతాం కదా! చెప్పరాదూ ?" అనడంతో "ఏమీ లేదు లీలా. ఏదో జ్ఞాపకం వచ్చింది" అన్నాడు.

"సరే దాచుకో." మూతి తిప్పింది.

నవ్వి "రేపు ఉదయం మందులకోసం పట్నం వెడుతున్నాను. నీకేమైనా కావాలా ?" అడిగాడు.

తను నోట్‌చేసి పెట్టుకున్న లేటెస్టు నవలల లిస్టు ఇచ్చింది. అది చూసి నవ్వుతూ తాను అంతకు ముందు మనసులో అనుకున్న మాట చెప్పాడు రఘు.

"అవును మరి, ఏ రూట్‌లో వెళ్ళేవాళ్ళు ఆ పరిభాషలోనే మాట్లాడతారు. తాము ఎక్కువగా మసిలే ప్రదేశాల గురించి గానీ, వాడే వస్తువుల గురించి గానీ, మాటల మధ్యలో తమకి తెలియకుండానే చెప్పేస్తూ ఉంటారు. ఎదుటివాళ్ళు బోర్‌గా ఫీలవుతున్నా, వినకపోయినా కూడా పట్టించుకోరు కొంతమంది అయితే."

"ఇక కబుర్లు చాలర్రా, భోజనాలు చేసి పెందరాళే పడుకోండి, నిన్నరాత్రి నిద్ర పోలేదుగా" ప్రభావతమ్మ అనగానే హఠాత్తుగా నిద్ర ముంచుకొస్తున్నట్టు అనిపించి బద్ధకంగా లేచారు.

* * *

మరునాడు మామూలుగా ఆస్పత్రికి వెళ్ళాడు రఘు — వెంకటేశం రాలేదు. నర్సు అన్ని పనులూ చూసుకుంటోంది.

రేణు కంగారుగా వచ్చింది.

"ఏమండీ! వెంకటేశం రాత్రి ఇంటికి రాలేదు" చెప్పింది.

"కాస్త హర్ట్ అయ్యాడుగా. నాలుగు రోజులు తిరిగి వస్తాడు. పోనీలే నువ్వేం కంగారు పడకు" తన పనిలో తాను ఉండే సమాధానం ఇచ్చాడు. నిజమే అనిపించింది రేణుకి.

బిజీగాఉన్న రఘుతో ఇంకేమీ మాట్లాడాలనిపించక స్కూలుకి బయలుదేరింది. లీలతో ఆ మాట చెప్తే "శని వదిలినందుకు సంతోషించక ఏడుపు మొహం పెట్టావేమిటే ?" అని విసుక్కుంది.

పిల్లల్ని చదువుకోమనిచెప్పి తన ప్రణాళికల్ని ఆమెకి వివరించి చెప్పింది. అంతా విన్నాక "నీ ప్రణాళికలన్నీ బాగానేఉన్నాయిగానీ, అసలు నీ నిర్ణయమే బాగాలేదే" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది రేణుక.

"మొద్దూ! ఏమిటే, నేనేదో కానిపని చేస్తున్నట్టు మీరందరూ ఈ ఏడుపులు ?" విసుక్కుంది లీల.

"అదికాదే, అసలు..."

"అసలు లేదు, కొసరులేదుగానీ ఇంకా ఏమైనా సవరణలు ఉన్నాయేమో చూడు" మాట తప్పించింది.

తనకు తోచిన సవరణలు చెప్పి "ఈ ఖాళీ స్థలమంతా ఇచ్చెయ్యడమే కాక ఇంత డబ్బు ఖర్చుచెయ్యడానికి పెదనాన్నగారు ఒప్పుకున్నారా?"

"రాజాలా ఒప్పుకున్నారు. నా పెళ్ళికోసం లక్ష రూపాయలు దాచిపెట్టారు. అదంతా బయటికి తీయిస్తాను" నవ్వింది లీల.

"అంటే అసలు పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యం లేదా ?"

"అని నేను అనలేదుగా. కట్నం తీసుకోని వాడినే చేసుకుంటాను. అదీ రిజిస్టర్ మేరేజ్. ఇంక డబ్బుతో పనేముంది ?"

పిల్లల అల్లరి పోట్లాటల్లోకి దిగడంతో "వెళ్ళవే బాబూ! తోకొక్కటే తక్కువ"



అంటూ లీలని ఆమె క్లాసులోకి పంపించేసింది రేణు.

ఒకపక్క అనాధ శరణాలయానికి ఇల్లు కట్టించే ప్రయత్నాలు చేస్తూనే, రఘు రేణుల పెళ్ళి విషయంలో విశ్వనాధంగారిని తొందరపెట్ట సాగింది. మరోవైపు నవలా రచన. క్షణం తీరిక లేకుండా పని చేస్తోందే కానీ, ఆమెలో మునుపటి ఉత్సాహం లేదు. కూతుర్ని అలా చూడలేక, అలా అని ఏమీ అనూలేక భర్తమీద విరుచుకు పడుతోంది ప్రభావతమ్మ.

''అసలు మీరే దాన్ని అలా తయారుచేశారు. అది అన్నదానికి తందాన తాన అనే సరికి కొండెక్కి కూర్చుంది. లేనిపోని గొడవలన్నీ నెత్తిన వేసుకుని ఎలా అయిపోయిందో చూడండి నా తల్లి.''

''నన్నేం చెయ్యమంటావే ? దాన్ని అలా చూడ్డం నాకుమాత్రం సరదా అనుకున్నావుటే?''

''ఈ ఊళ్ళో ఉన్న చదువుతో సరిపెట్టి పెళ్ళి చేసి పంపించెయ్యండంటే విన్నారు కాదు. కాలేజీలో చేరతాననేసరికి చంకలెగరేసుకుంటూ వెళ్ళి చేర్పించారు పట్నంలో. ఆ వెధవ చదువుల వల్లనే తెలివిమీరిపోయి ఇలా మొండికేస్తోంది.''

''బాగుందే ! నాకు మాత్రం దాని పెళ్ళిచేసి పిల్లలతో కళకళలాడుతూంటే చూడాలని లేదనుకుంటున్నావా ?''

''అన్నీ ఉన్నాయి. ఎందుకులేవు. కానీ, మన ముఖాన అవన్నీ చూసి ఆనందించే రాత లేక పోయింది.''

లీల గదిలో నుంచి బయటికి వచ్చి ''ఏమిటమ్మా నీ పిచ్చి ? ఎందుకలా రోజూ నాన్నగార్ని సాధిస్తావు ? పెళ్ళి చేసుకోనన్నది నేనుగానీ, నాన్నగారు చెయ్యననలేదుగా'' అంది చిరాగ్గా.

''అంటావే తల్లీ అంటావు. నువ్వూ తల్లి వైననాడు అర్థం అవుతుంది మా బాధ.''

ఫక్కున నవ్వి ''దానికింకా చాలా టైము ఉందమ్మా. మంచో చెడ్డో మీకు చెప్పి, బ్రతిమాలో, బాధపెట్టో మిమ్మల్ని ఒప్పించి చేస్తున్నాను నేను. కానీ, మా పిల్లల టైము వచ్చేసరికి మాకు చెప్పకుండానే, మా అనుమతి లేకుండానే తమకు తోచింది ముందు వెనుకలు ఆలోచించకుండా చేసుకుపోయేకాలం వస్తుంది. అప్పుడు నేను మాత్రం నీలా చాదస్తంగా సణుగుతూ, నా మొగుణ్ణి సాధిస్తూ కూర్చోను. 'ప్రాసీడ్ మై చిల్డ్రన్' అని పిల్లల భుజంతట్టి మరింత ఉత్సాహపరుస్తాను. ఒకవేళ దానివల్ల ఏదైనా చెడు జరిగిందనుకో ''అయ్యో పాపం!'' అని జాలిపడతాను తల్లిని కనుక. ఎవరి ఖర్మకి వారేకదా కర్తలు. బిడ్డల్ని కంటాముగానీ, రాతల్ని కంటామా అని రోజూ నువ్వేకదమ్మా అంటూంటావు.''

''ఇదెక్కడి చోద్యమే తల్లీ. చెడిపోయావే. ఆ పుస్తకాలు చదివి పూర్తిగా చెడిపోయావు. అంతా నీ ఖర్మ. వెళ్ళు. రామిగాడిని బాత్ రూములో నీళ్ళు పెట్టమన్నాను. పెట్టాడో లేదో చూసి స్నానం చేసిరా'' కూతురితో వాదన పెంచుకోవడం ఇష్టంలేక లోపలికి వెళ్ళిపోయింది ప్రభావతమ్మ.

తండ్రి పేపరు చదవడంలో నిమగ్నమై ఉండడం గమనించి దీర్ఘంగా నిట్టూర్చి స్నానానికి బయలుదేరింది లీల.

* * *

కౌసల్యకి అంతగా ఇష్టంలేకపోయినా, లీల పట్టుదల వల్ల వీరరాఘవులుగారు రఘు, రేణుల పెళ్ళి జరిపించేశారు. లీల ఆనందానికి అవధులు లేవు. వెంటనే రేణు కాపురానికి వచ్చేసింది.

''రేణూ ! చీటికీ మాటికీ నీ దగ్గరకు పరుగెత్తుకుంటూ రానవసరంలేదు. నువ్వే నా దగ్గరకు వచ్చేశావు. థాంక్యూ డియర్'' రేణుని కౌగలించుకుంది లీల.

తెల్లారి లేచింది మొదలు, రాత్రి పడుకునే వరకూ ఇద్దరూ ఒకేచోట, ఇద్దరిదీ ఒకేమాట. ఏదో ఆ రాత్రిపూట తప్ప మిగిలిన సమయంలో అసలు ఏకాంతంగా దొరకడం లేదని రఘు ఉడుక్కుంటూంటే నవ్వుకునేదే తప్ప లీలని మాత్రం విడిచి వచ్చేదికాదు రేణు.

అనాధశరణాలయపు నిర్మాణం, ప్రారంభోత్సవం లీల అనుకున్నదానికంటే ఘనంగానే జరిగాయి.

ఊరి పెద్దలందరూ లీల పట్టుదలని, ఉత్సాహాన్నీ చూసి ఎంతగానో ప్రశంసించారు.

ఆమె ఆదర్శభావాలని అర్థం చేసుకుని ఆచరణలో పెట్టడానికి తగిన సహాయ, సహకారాలు అందించినందుకు విశ్వనాధంగారిని అభినందించారు.

ఆ సమయంలో తన మనోవేదనను మరచి పోయి నిజంగా చాలా గర్వించారు ఆయన. మరో పక్క రచయిత్రిగా మంచి పేరు ప్రఖ్యాతులు! ఇంతకంటే ఏ తండ్రి అయినా కోరుకునేదే ముంటుంది ? నిజమే. అది చెప్పినట్లు జీవితానికి పెళ్ళి ఒకటే ముఖ్యమా ? నలుగురికీ ఉపయోగించే పన్లు చేస్తూ తనకంటూ ఒక ప్రత్యేకతను, విలువను సంపాదించుకోవాలి. ''పరోపకారార్థ మిదం శరీరం'' అన్నారు. అదే జీవిత పరమార్థం. చేతిలో డబ్బున్నా నేను చెయ్యలేని పనిని నా కూతురు చేసింది అనుకుని గర్వంగా ఫీలయ్యా రాయన.

పుట్టెడు దుఃఖంతో అవమాన భారాన్ని దిగమింగుతూ ఎంతో ఆశతో తన దగ్గరికి వచ్చిన స్త్రీలని ఆప్యాయంగా చేరదీసి అక్కున చేర్చుకుని ఆశ్రయం ఇస్తోంది లీల. వారు గతాన్ని మరచిపోయి ఆనందంగా జీవించడానికి ఎంతో శ్రద్ధ తీసుకుంటోంది.

పెరటి తోటల పెంపకం, కుట్లు, అల్లికలు, టైలరింగ్, చదువుమీద శ్రద్ధ ఉన్నవారికి చదువుచెప్పి పరీక్షలకి కట్టించి చదువు నేర్పిస్తోంది. కాలక్షేపానికి ఒక గ్రంధాలయం ఏర్పాటు చేసింది.

టైలరింగ్‌కి మాత్రం వేరే టీచర్ని ఏర్పాటుచేసి, మిగిలినవన్నీ రేణు సహాయంతో తనే నిర్వహిస్తోంది. రఘు సలహామీద ఇష్టపడిన స్త్రీలని నర్సు ట్రైనింగ్, టీచర్ ట్రైనింగ్



హార్లిక్స్ మా కుటుంబంలో ప్రతి ఒక్కరికి మిత్రుడు వంటిది - రోజంతా ఆఫీసు పనితో అలసి వచ్చే మా శ్రీవారికి, కాలేజికి, డాన్సు క్లాసుకి వెళ్ళివచ్చే మా అమ్మాయికి, ఫుట్‌బాల్ హీరో మా అబ్బాయికి. అంతెందుకు, రోజూ మార్కెట్ పని ముగించుకుని ఇంటికి వచ్చాక , నేను కూడా ఒక కప్పు హార్లిక్స్ త్రాగవలసిందే! హార్లిక్స్ మాలో ప్రతి ఒక్కరికి మేలు చేస్తుందని నా నమ్మకం.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు పచ్చ గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా ఒక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం.

పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్ముతారు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?




కొత్త సమయం,
కొత్త రూపం




మంచి పుష్టికరమైనది

**వనితలకు మనవి**

కొత్తరకం వంటలు
క్లుప్తంగా రాసి పంపితే
త్వరగా పరిశీలించ వీలవుతుంది. —సం.

**మ న వి**

డాక్టర్ సలహాలు, ప్రశ్నావళి శీర్షికలకి ప్రశ్నలు పంపేవారు తాము పంపే శీర్షిక పేరు రాసి కేరాఫ్ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగర్, విజయవాడ – 520 003 అన్న చిరునామాకి పంపాలి. రాసిన వారి పూర్తి పేరు, చిరునామా యివ్వడం ఎంతైనా అవసరం. —సం.



# అనురాగ తరంగాలు

లకి పంపిస్తోంది. చుట్టుపక్కల గ్రామాల్లో కూడా లీల పేరు మారుమోగిపోవడమేకాక పత్రికలలో కూడా సంఘ సంస్కర్తగా పేర్కొనబడుతోంది.

"నీమీద నాకు చాలా ఈర్ష్యగా ఉందే లీలా. ఎక్కడ చూసినా, ఎవరి నోట విన్నా, ఏ పేపరు చదివినా నీగురించే."

చిన్నగా నవ్వి "నిజంగా ఈర్ష్య ఉన్నవాళ్ళు పైకి చెప్పరే రేణూ. అయినా పేరుదేముంది ? చిన్న మంచిపని చేస్తే గొప్పగా చెప్పుకున్నట్లే చిన్న పొరపాటుపని చేస్తే పది రకాలుగా విమర్శిస్తారు. నేను చేసిన పని నలుగురికీ ఉపయోగపడుతోంది. అదే ఆనందం." అంది లీల.

"నిజమే లీలా. మొదటిసారిగా నీ నోట ఆ మాట వినగానే నీకు నిజంగా పిచ్చిపట్టింది అనుకున్నాను. ఆడపిల్లవి, చిన్నపిల్లవి నీవల్ల అయే పనేనా అనుకున్నాను. ఇప్పుడు నిన్ను చూసి నిజంగానే గర్వపడుతున్నాను."

"ప్రధానిగా ఒకస్త్రీ పరిపాలిస్తున్న దేశంలో ఇలాంటి చిన్నపనులకి కూడా స్త్రీలు భయపడడం నిజంగా సిగ్గుపడాల్సిన విషయమే రేణూ. అవకాశం దొరికితే అణగదొక్కడం తప్ప ఎలాగూ ఆదుకోరు పురుషులు. స్త్రీకి స్త్రీలే శత్రువులు అని ఎవరో అన్న మాటల్ని బలపరుస్తూ ఉన్నారు నేటి కొందరు స్త్రీలు. అత్త ఆడబిడ్డల పోరు పడలేక ఆత్మహత్యలు చేసుకున్న స్త్రీలు ఎందరు లేరు ? పెళ్ళి అయిందని తెలిసికూడా స్నేహం పెంచుకుని, సెక్సు సంబంధాన్ని సృష్టించుకుని సాటి స్త్రీ జీవితంలో నిప్పులు పోసే స్త్రీలు కోకొల్లలు. సాంప్రదాయ విరుద్ధమైన అటువంటి పన్లు ఎంత హీనస్థితికి దిగజారుస్తాయో ఒక్కసారి కూడా ఆలోచించరు. ఆలోచిస్తుంటే ఈ దేశంలోని స్త్రీ జీవితం ఎప్పటికి ... ఎన్నేళ్ళకయినా బాగుపడుతుందా ? అసలు ఎప్పటికైనా బాగుపడుతుందా! అనిపిస్తుంటుంది." బాధగా అంది లీల.

"నిజమే లీలా. సెక్స్ సింబల్‌గా, స్టేటస్ సింబల్‌గా తప్ప మరోరకంగా స్త్రీకి విలువ లేకుండాపోయింది. అయినా ఇందులో మన స్త్రీల తప్పు కూడా లేకపోలేదు. పూర్తిగా మగవాళ్ళదే తప్పు అనుకోడానికి లేదు."

"నిజమే రేణూ! ఎవరో మోసంచేసి ఉంటాడని ఆదరించి ఆశ్రయం ఇచ్చామా ఆ కల్పనకి నెలలు నిండాక రఘు సలహామీద అతని నర్సింగ్‌హోమ్‌లో చేర్పించామా ? డెలివరీ టైములో దగ్గరుండి ధైర్యం చెప్పామా ? తీరా చేసి బిడ్డను వదిలేసి రాత్రికి రాత్రి చెప్పకుండా పారిపోయింది. ఛ! మంచికి విలువ లేదు అనిపిస్తూంటుంది ఒకోసారి!"

## వెట్ అండ్ డ్రై

సరళరేఖమీద నడుస్తూ
పాత సైకిళ్ళెక్కి
కొత్త ఉద్యోగంలో, ఇద్దరం
ఒకేసారి చేరాం —
పక్క పక్కనే టేబుల్స్
సీట్లు మాత్రం వేరే...

*　　　*　　　*

మా యిద్దరిదీ యిప్పుడు
సమానాంతర రేఖల ప్రయాణం
మూణ్ణెళ్ళు తిరిగాయి —
నారోగేజంత దూరం...
ఆర్నెల్లు తిరిగాయి —
మీటర్‌గేజంత దూరం...
ఏడాది తిరిగింది —
బ్రాడ్‌గేజంత దూరం...
సైకిల్‌కు పంచరువేయిస్తూ నేను !
స్కూటర్ కిక్కుకొడ్తూ వాడు !!

— కంచనపల్లి వెంకటకిషన్‌రావు.

"నిజమే లీలా! ఆ బాబు ఎంత ముద్దొస్తున్నాడో కదూ ? వదిలి వెళ్ళడానికి ఆ తల్లికి ఎలా మనసు ఒప్పిందో ?"

"కట్టుకున్నవాడు అయినా, ప్రేమించిన వాడు అయినా అన్యాయం చేస్తే ఆ స్త్రీయే కష్టపడి, ఎంతో ఓర్పుతో ఆ బిడ్డను పెంచిపెద్ద చేస్తుంది. అది స్త్రీలోని ప్రకృతి సహజంగా ఉండే మాతృత్వ గుణం. ఆ మాతృప్రేమను ఎలా చంపేసుకోగలిగిందో ఆ కల్పన. ముద్దులు మూటగట్టే ఆ చిన్నారిబాబు ఆయాల దయాధర్మంమీద ఆధారపడి బ్రతకాల్సిందే" ఇలా అనుకోగానే లీల కడుపులో దేవినట్లు అయింది.

'నా పిల్లల సంఖ్య మరొకటి పెరిగింది' అనుకోగానే తృప్తిగా ఫీలయింది.

*　　　*　　　*

అనాథశరణాలయంతో పాటే పక్కన రఘు నిర్మించిన నర్సింగ్‌హోమ్ కూడా బలంపుంజుకుంది. అన్ని రకాల పరికరాలను ఏర్పాటు చేసి ఏ సమయంలో ఎవరు వచ్చినా వైద్య సహాయం అందేలా మరో ఇద్దరు డాక్టర్లని ఏర్పాటు చేశాడు. ప్రైమరీ స్కూలు హైస్కూలు అయింది. ప్రతిదానికీ పట్నం పరుగెత్తనవసరం లేకుండా ఎన్నో దుకాణాలు వెలిశాయి. పట్నం వెళ్ళడానికి ప్రతీగంటకీ వచ్చేపోయే బస్సులు. నాలుగు సంవత్సరాల క్రితం చూసిన వాళ్ళు తిరిగి ఆ ఊరు వచ్చి 'ఇది పుచ్చపల్లేనా' అన్నంతగా ఆశ్చర్యపోతున్నారు.

( ఇంకా వుంది )

## సి. హెచ్. ఎస్. _ నిడదవోలు

ముందు కాలంలో, ఈ కాలంలో పెళ్లి చేసుకున్నవాళ్లు ఒకే రీతిగా వుంటున్నారు. భార్యని ఒక బానిసగా చూస్తున్నారే తప్ప బంధం ప్రేమలేకుండా క్రూరంగ చూస్తున్నారు. దీనికి అంతేలేదా ? ముందు ముందు కాలం యిలాగే వుంటుందంటారా ?

★ ఉండదు ! ఆడవాళ్లు మారుతున్నారు. గమనించడం లేదా ?!

## వెంకట్ _ ఉరవకొండ

సాధారణంగా డబ్బున్న వాళ్లకే దేవుడిమీద నమ్మకం ఎక్కువగా వుంటుందంటారు. నిజమేనా ?

★ కావచ్చు. ఆ డబ్బు ఎక్కడపోతుందో నన్నభయమే భక్తిని పెంచవచ్చు.

మగజాతి అభివృద్ధి ఆడదాని అదృష్టాన్ని పట్టివుంటుందా ?

★ మగవాని బుద్ధినిపట్టి వుంటుంది.

## పి. వి. _ మార్టేరు

ఎవరైనా అమ్మాయి ఆరుద్రగారిని "ఐ లౌయూ" అని రాస్తే మీరు ఏమంటారు?

★ నేనేం అనను. ఆయనగారే యిబ్బంది పడిపోయి 'చూశావా రామా, కాస్త శారదా మేనక కేసు కాబోలు' అంటారు !

## కె. పి. _ వెంకటాపురం

వివాహాలు స్వర్గంలో నిశ్చయం అవుతాయి అంటారు కదా, మరి అవి భూమిమీద ఎందుకు విడిపోతాయి ?

★ నిర్ణయాల ప్రకారం ఫలితాలు దక్కవు సుమా అని నిరూపించడానికి !

## ఎస్. వి. ఆర్. _ గరుడభద్ర

ప్రపంచంలో ఏవి తగ్గినా లంచగొండితనం, వ్యభిచారం, వరకట్నం తగ్గినట్టులేదు.

★ ఇవి మనిషి సృష్టించిన రోగాలు. తగ్గవు. ప్రకృతి తెచ్చినవైతే – పెట్టూ విడుపూ వుంటుంది.

## ఎస్. పి. ఎస్. _ కాకినాడ

ప్రేమపెళ్లివాటికి జవాబులు మీకు పాతవే కావచ్చు. కాని మేమిద్దరం గాఢంగా ప్రేమించుకున్నాం – ఒకరినొకరు కావాలనుకున్నాం. కాని ఇటువంటి పరిస్థితిలో అమ్మాయి వేరే వూరు కాపురం వెళ్లపోతోంది. ఈ పరిస్థితులలో ఏంచేయాలి.

★ మీరూ కాపురం ఎత్తేయండి – అక్కడికే. లేక ఇంకా ఇద్దరూ కిండర్ గార్డెన్ స్కూలు దాటలేదా ?! ప్రేమ పబ్లిక్ వ్యవహారంగా తయారుచేస్తే – యిలాగే వేళాకోళం చేస్తాను. ఉడుక్కోకూడదు.




## భవాని – మచిలీపట్నం

జీవిత రహస్యం ఏమిటి ?

★ ఏం లేదు. వడ్లగింజలో బియ్యపు గింజ !

వనితా జ్యోతి నవలల పోటీలో రెండో బహుమతి పొందిన రౌద్రి మీ అమ్మాయి అని తెలిసింది. ఆమె పేరు తెలుసుకోవలెనని కుతూహలంగావుంది. అభ్యంతరం లేకపోతే చెప్పకలరు.

★ లలిత.

## ఆర్. వి. _ మాచర్ల

మగవాడు నిన్ను ప్రేమిస్తున్నాను, ప్రేమిస్తున్నాను అని వెంటపడతారెందుకని ?

★ నిజం అనుకొని – నువ్వు వెంటపడడం ప్రారంభించేదాకానే —

## పి. ఎస్. ఆర్. _ సువాబేడ

మీరు మేము పంపిస్తున్న ప్రశ్నలను కూడా సెన్సారు చేస్తున్నారట నిజమేనా ?

★ సెన్సారు చేయడంలేదు. – అప్పుడప్పుడు పొడుగు తగ్గించడానికి ఎడిట్ చేస్తున్నాను. అంతే.

## ఎస్. వి. _ వాత్తేరు

ఒక స్త్రీ తన భర్త ఏ రంగంలోనైనా ప్రాముఖ్యత వహిస్తే ఫలానా వ్యక్తి భార్యనని చెప్పకుంటుంది. అదే పురుషుని విషయంలో – ఫలానా వ్యక్తి భర్తనని చెప్పకోడానికి కించపడతాడెందుకు ?

★ అది ఆ వ్యక్తి సంస్కారాన్ని పట్టి వుంటుంది. మనది మరీ పితృస్వామ్యం కనుక – అన్నీ మగవాడిదే పైచేయిగా వుండాలంటారు... అంతే.

## ఎం. డి. ఆర్. _ దువియాజాక్

మానవుడు కోరేది, మరిచిపోలేనిది ఏమిటండి ?

★ మనశ్శాంతి.

## ఆర్. బి. కె. _ కాకినాడ

మనిషికి ముఖ్యం డబ్బు కాదు. ఆత్మీయత, అనురాగం, అభిమానం.

★ డబ్బుంటే—యివన్నీ ప్రదర్శించేవాళ్లూ వుంటారు !

## ఆవారా _ ఖర్గపూరు

జీవితంమీద విరక్తి పుట్టి చావాలనుకుంటే ప్రేమ బంధం అడ్డు వస్తుంది ?

★ విరక్తిపుట్టాక ప్రేమా దోమా ఏమిటి?

## అలివేణి _ అలుదు

స్త్రీలకు ప్రత్యేక విశ్వవిద్యాలయం అవసరం లేదని నా అభిప్రాయం.

★ ఈ దేశంలో వెనుకబడిన తరగతులను రక్షించి – పోషిస్తున్నట్టు– స్త్రీలని కూడా పోషిస్తేనే– ఇంకో శతాబ్దానికైనా స్త్రీ కూడా మనిషి– వ్యక్తి అని గుర్తిస్తారు. ★



# కొత్త వెలుగు

## స్వరూప్ సిన్హా

సంధ్యవాలి చాలాసేపయింది. గుట్టమీదుండే పురాతనమైన ఆ అమ్మవారి దేవాలయంలోకి జనం ఇంకా వస్తూనే ఉన్నారు. అవి జాతర రోజులు కాబట్టి ఊళ్ళోని జనమంతా ఆ కోవెల్లోనే పోగయినట్టు అగుపిస్తున్నారు! కాసేపటికి ''తప్పుకోండి, తప్పుకోండి!'' అని కేకలేసుకుంటూ, పెట్రోమాక్సు లైట్లూ, మంగళవాద్యాలూ. వీటి మధ్యన బోయీలు కొందరు అమ్మవారి పల్లకీ మోసుకొంటూ మెట్లెక్కి వచ్చారు. జనసందోహం రెండుగా చీలి పల్లకీ వెళ్లేందుకు దారి ఏర్పడింది. దాన్ని మోసుకొచ్చిన వారిలో పదహారేళ్ల పడుచువాళ్ల మొదలుకొని, యాభై పైబడిన వృద్ధుల దాకా... అన్ని వయసుల మగాళ్ళూ ఉన్నారు. వాళ్లంతా ఉదయమే టౌనుకెళ్లిపోయి కూలీనాలీ చేసుకొచ్చే జనం. వారంలోని ఒక రెండు రోజుల్లోను, ఇలాంటి పండగ దినాల్లోనూ అమ్మవారిని ఊరేగించుకొస్తే వాళ్లకి పూజారిచ్చే ప్రసాదం— అరటిపళ్ళూ, కొబ్బరిముక్కలూ, పటికబెల్లం వగైరాల్లాటివి గిట్టుబాటవుతాయని ఆశ! సింహద్వారం దగ్గర పల్లకీని దింపేసి, చెమటలు దులుపుకుంటూ ఉసూరుమని అరుగుమీద చతికిలపడ్డారు వాళ్లు. ఆ తరువాత పూజారి దేవీ ప్రసాదాన్ని ఇవ్వడమే తడవుగా ఆత్రంగా అందుకుని తినసాగేరు.

''ఏరా అప్పలకొండా... ఇవాళ కోవెల శుభ్రం చేసే వంతు నీ పెళ్లానిదని తెలీదా? ఉదయం దాన్ని పంపకుండా... వెధవ్వు! నువ్వు మాత్రం ప్రసాదం తింటానికి ఠంచనుగా హాజరయ్యావు!'' పూజారి రామానుజం ఓ పాతికేళ్ల యువకుణ్ణి కోపంగా ప్రశ్నించాడు.

''నా యింటిదానికి ఒంట్లో బాగునేదు, ఉదయాన్నే మా సెట్టిదాన్ని పంపినాను గద పూజారయ్యా?'' అన్నాడా యువకుడు బుర్ర గోక్కుంటూ.

''మహా పంపేవులే ఆ గుంట ముండని! దానిక్కనీసం నీళ్లు తోట్టమయినా చాతనయి చావలేదు. దుక్కలా గున్నావు! నువ్వు రాకూడదూ...? ఇదిగో... మీ అందరికీ ఇప్పుడే చెపుతున్నా, ఇలాంటి పండగ పబ్బాల్లో మీ ఆడాళ్లకి ఒళ్లు బాగాలేనప్పుడు, మీలో ఒక్కళ్లిద్దరు వచ్చి ఉదయమూ సాయంత్రమూ ఆలయం శుభ్రం చేసి వెళ్లాలి. పనీపాటా చేతగాని పిల్లవెధవల్ని పంపుతేమాత్రం కుదర్దు'' అనేసి పిలక సవరించుకొంటూ, తన భారీ శరీరాన్ని మోసుకుంటూ హడావుడిగా వెళ్లిపోయాడు నడివయస్కుడైన రామానుజం. అప్పటికే జనం 'క్యూ'లో నుంచుని అమ్మవారి దర్శనానికి ఎదురుచూస్తున్నారు.

''అబ్బాయ్ వంశీ! అర్చనకు ఏర్పాట్లు చేశావా లేదా...? త్వరగాకానీ మరి. ఇవ్వాళ జనాన్ని పంపేటప్పటికి ఏ పదకొండో దాటేట్టుంది...'' ఓ వైపు మంత్రాలు చదువుతూనే మరోవైపు వంశీతో మాట్లాడసాగేడు రామానుజం. వంశీకృష్ణ మౌనంగా హారతి పళ్లెం సిద్ధం చెయ్యసాగేడు. అతనికి సుమారు పాతికేళ్లుంటాయి. పూజారిగా అతనీ ఆలయానికొచ్చి సుమారొకటి రెండు మాసాలు గడిచాయి. తనకంటే వయసులో, అనుభవంలో పెద్దవాడైన రామానుజం హడావిడిగా జరిపే పూజ తంతు చూస్తే వంశీకి విచిత్రంగా అనిపిస్తుంది. పూజకు ప్రాతిపదికలైన భక్తిభావం—ఏకాగ్రత—ధ్యానంలాటివి ఆ పూజారి పూర్తిగా విస్మరించినట్టుగా తోచేదతనికి. ఏదో మొక్కుబడి తీర్చుకున్నట్టు నాలుగు మంత్రాలో, దేవీస్తోత్రమో గడగడా చదివేస్తూ, ''నడవండి, నడవండి! అలా నుంచుని చూస్తారేం? ఇంకా మీ వెనకాల చాంతాడంత 'క్యూ' ఉంది.'' అని భక్తులను అదిలిస్తూ, మొత్తానికి కోవెలకొచ్చిన జనానికి 'హమ్మయ్య! దర్శనం అయింది.' అనిపించి పంపించేవాడు.

ఆ రాత్రి జాతర సందడి సర్దుమణిగి జనాన్ని పంపేటప్పటికి రామానుజం భయపడ్డట్టే పదిన్నర దాటింది. ఆయన హడావిడిగా ప్రసాదాన్ని మూటగట్టుకుని వెళ్లిపోయాడు, వంశీకృష్ణను తాళాలూ అవీ వేసుకుని వెనకాల రమ్మని చెప్పి. ఆ రాత్రివేళ ఆలయ ప్రాంగణమంతా నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉంది. వెన్నెల్లో తెల్లగన్నేరుపూలు వెండిపూలలా మెరిసిపోతున్నాయి! చల్లటి గాలి ప్రాణానికి సేదదీరుస్తూంది. వంశీ గర్భగుడికి తాళం వెయ్యబోతూ ఒక్కమారు దేవి విగ్రహాన్ని తృప్తిగా చూసుకుని దణ్ణం పెట్టుకున్నాడు. దేవి చిరునవ్వులు చిందిస్తూ, చెయ్యెత్తి ఆశీర్వదిస్తున్న భావన అతనికి భక్తిపారవశ్యాన్ని కలిగించింది. ఆ నిర్మల వాతావరణంలో, అలాగే కన్నార్పకుండా ఆ దేవతామూర్తిని చూస్తూ గడిపెయ్యాలనిపించిందతనికి. కాసేపు గడిచాక నెమ్మదిగా తాళాలు వేసుకుని ప్రాకారం బయటికొచ్చాడతను. కోవెల ప్రాంగణంలో ఎవరో నుంచున్నట్టనిపించిందతనికి. ''ఎవరదీ...?'' అన్నాడతను ఆ వ్యక్తిని పరీక్షగా చూస్తూ.

''నేను పూజారయ్యా! యాదిని...!'' ఓ చేత పూలమాలనూ, మరోచేత పసివాణ్ణీ పట్టుకుని బెరుగ్గా సమాధానమిచ్చింది యాది.

''ఏం యాదీ...! గుడి మూసేసాక వచ్చావు... అందునా ఇంత రాత్రప్పుడు?'' అన్నాడు వంశీ ఆశ్చర్యంగా.

''నాను అమ్మోర్ని సూడకుంటే మాత్తరం యేట్నెండి బాబూ! ఈ పూలు మీకిచ్చేసి పోదారని వచ్చాను. అమ్మోరి జాతరని ఊళ్లో అనుకుంటా ఉంటే తెలిసిందయ్యా'' అంటూ గులాబీ మాల అందించింది.

''వచ్చినప్పుడల్లా భలే చక్కటి పూలు పట్టుకొస్తావు! ఎక్కణ్ణించి తెస్తావు యాదీ?'' సిగ్గుపడింది యాది. నెమ్మదిగా చెప్పింది.

''నాను రోజా టౌనుకి దొరగారింట్లో పనికెల్తాను బాబూ! ఆ బాబు రోజా రెండు పూట్లా దేవుడి పూజ సేత్తారు. ఆ దేవుడికాడ యెట్టి తీసీసినయే ఈ పూలన్నీని! అమ్మగోరు యాడైనా పారేసి రమ్మంటారు. ఇయ్యి 'మైల' పూలని తెలుసు బాబూ. కానీ శుక్కోరాలూ, పండగ పొద్దులూ అమ్మోర్ని సూడటానికి ఉట్టి సేతుల్తో రాబుద్ధి పుట్టదయ్యా! పేదదాన్ని. ఇలాగ సేతికి దొరికిన పూలట్టుకొస్తుంటాను.'' ఆమె కళ్లల్లో అమాయకత ఉంది. ఆ కంఠంలో నిజాయితీ ఉంది.

''స్వచ్ఛమైన మనసుతో అర్పించినదానికి 'మైల' ఎక్కడిదసలు?'' అనిపించింది వంశీకృష్ణకు. మాల అందుకున్నాడు, 'ఎవరికి తెలుసు! ఈవేళ వచ్చిన అర్పణలన్నింటిలోకీ దేవికి ఈ పూలే యిష్టమవుతాయేమో!' అనుకున్నాడు.

''చాలాసార్లు గమనించాను. నీవొచ్చినపుడెల్లా తలుపు లేసేసాక వస్తావేం యాదీ? కాస్త పండగ రోజుల్లో అయినా ముందుగా వచ్చి అమ్మవార్ని చూడరాదా!'' అన్నాడతను చిర్నవ్వుతో... మాలను ద్వారానికి అలంకరిస్తూ.

''అమ్మో...! ఆ పెద్ద పూజారయ్య నన్ను గుళ్లోన సూస్తే సంపేస్తడు. నాను యానాది దాన్ని గందా! మీరు తలుపులేసుకెళ్లిపోయినా నానొచ్చి పూలు తలుపుకాడ యెట్టేసి దణ్ణమెట్టేసుకుని యెల్లిపోతాగానీ గుడిలోకి రావడమే? ఓలమ్మో! నానలాగ రాకూడదు బాబూ. మీరు సిన్నోరు... కొత్తగొచ్చినారు, మీకు తెలవదు...'' అంది యాది. అప్రతిభుడయ్యాడతను. యాది అతనికి నమస్కరించి పిల్లాణ్ణెత్తుకుని వెళ్లిపోయింది. కొన్ని క్షణాల క్రితం ప్రశాంతంగా

ఉండిన అతని మనసిప్పుడు అల్లకల్లోలమై పోయింది.

* * *

''ఇంతాలస్యమైందేం... ? భోంచేద్దురు గాని పదండి'' కాత్యాయిని చదువుతున్న పుస్తకాన్ని పడేసి లేచి నుంచుంది వంశీకృష్ణను చూసి.

''భోజనం అక్కర్లేదు కాత్యాయినీ, ఆకలిగా లేదు. కాసిని మజ్జిగ నీళ్లుంటే ఇవ్వు.'' అన్నాడతను అలసటగా పక్కమీద కూచుంటూ. కుండలోంచి మజ్జిగ వంపుకుని తెచ్చి గ్లాసతని చేతికందించి, ప్రక్కనే కూచుంది వీవనతో విసురూ్తూ. మజ్జిగ తాగేసి, మౌనంగా గ్లాసామె చేతికందించాడతను.

''అదేలా ఉన్నారేం ? జనం చాలా ఎక్కువగా వచ్చారా ? ఆలస్యమైపోయింది'' అందామె భర్త ముఖంలోకి పరీక్షగా చూస్తూ.

''అమ్మవారి జాతర గదా, ఈ పదిరోజులూ జనం ఎక్కువగానే వస్తారు. రద్దీవల్ల కాస్త అలసటగా ఉంది. అంతే, మరేంలేదు !'' అన్నాడతను ఆవులిస్తూ. ఆమె మాట్లాడలేదు.

''నువింకా భోంచెయ్యనట్టుంది. భోంచేసేసి పడుకో కాత్యాయనీ ! నేనూ పడుకుని మళ్లీ తెల్లవారు ఝామున నాలుగింటికి లేస్తాను.'' మనసులో దేవిని ధ్యానించుకుని, నమస్కరించుకుని నడుంవాల్చాడు వంశీ.

నిట్టూర్చి లోనికెళ్లిపోయింది కాత్యాయిని. ఆమె కాపరానికొచ్చి ఏడాది దాటింది. ఆమె తండ్రి ఓ బడి పంతులు. ఆయన రిటైరయ్యే లోపల ఇద్దరాడపిల్లల పెళ్లిళ్లు అష్టకష్టాలు పడి చేసాడు. ఆఖరిదైన కాత్యాయిని పెళ్లి చెయ్యడం ఆ తరువాత అతనికి తలకు మించిన పనే అయింది. మధ్యవర్తుల ద్వారా ఆయన వంశీకృష్ణను గురించి విన్నాడు. ఆ సంగతి కూతురికి చెప్పినప్పుడామె ''ఛీ ! ఓ పూజారిని పెళ్లి చేసుకోవాల్సిన ఖర్మ నాకేంపట్టింది ... ?



# కొత్త వెలుగు

అక్కయ్యలకిద్దరికీ మంచి మంచి సంబంధాలు చూసిచేశావు... నేనంటే నీకు నిర్లక్ష్యం నాన్నా, అందుకే నాకీ సంబంధం అంటగట్టాలని చూస్తున్నావు'' అని కోపగించుకుంది తండ్రి మీద.

''అబ్బాయి ఉత్తముడు అన్నారమ్మా ... అలాటి వాడు కట్నం పొయ్యకుండా దొరకడం సులభంకాదు. నా పరిస్థితి కూడా ఆలోచించు తల్లీ !'' అన్నాడాయన నీరసంగా.

''ఓ పూజారిని మనిళ్ళల్లో ఏ ఆడపిల్లా చేసుకున్న దాఖలా లేదు ! పెళ్ళయ్యాక వాళ్ళ జీవన విధానానికి మనం అలవాటు పడగలమో లేదో కూడా తెలీదు. కాబట్టి నాకిష్టంలేదు !'' అని మొదట్లో ఖచ్చితంగా చెప్పేసింది. పూజారంటే రూపురేఖలు బాగోని ఓ అనాకారని ఊహించుకుందామె. అదామె తప్పుకాదు. పదో తరగతి ఫెయిలయిన ఆమెకు క్లాసు పుస్తకాలందించిన లోకజ్ఞానం అంతంత మాత్రమే ! ఆ పైన చేతికి దొరికిన నవలలన్నిటినీ చదివి భవిష్యత్తును గురించి ఆమె ఖరీదైన కలలే కంది ! అయితే తండ్రి బాధ చూళ్ళేక అయిష్టంగానే పెళ్ళిచూపులకు మాత్రం ఒప్పుకుంది. వంశీకృష్ణను చూశాక మాత్రం నివ్వెరపోయింది. అతను ఆమె ఊహించినట్లు అనాకారి కాకపోగా, 'మనుచరిత్ర'లోని ప్రవరాఖ్యుని ముమ్మూర్తులా పోలి ఉన్నాడనిపించింది. ఆ రాత్రి అతని ఎత్తైన పసిమిరంగు రూపం, విశాల వక్షం, అందం, గాంభీర్యం పోటీపడే వదనం... ఆమెను నిద్ర పోనియ్యలేదు. గుండెల్లో తియ్యటి బాధ ! ఊహల్లోని నాయకుణ్ణి పొందబోతున్నానన్న ఆనందం...! ఆ మన్మధునితో తన భవిష్యత్తును గూర్చిన రంగుల కలలు...! ఉదయానికల్లా కాత్యాయిని వివాహానికి అంగీకరించింది.

పెళ్ళయ్యాక రెండు మూడు నెల్లవరకూ వైవాహిక జీవితం సంతృప్తికరంగానే గడించిందామెకు. కానీ రాను రానూ ఏదో వెలితి కనిపించసాగిందామెకు. 'ఎంత పూజారయితే మాత్రం ! పట్టుమని పాతికేళ్ళయినా నిండని ఇతనికేమిటింత భక్తి ?' అని లోలోపల విసుక్కునేది. వంశీకృష్ణ ఉదయం నాలుగింటికే నిద్రలేచి స్నాన సంధ్యలు ముగించుకుని ఆలయానికి వెళ్ళిపోతాడు. మళ్ళా మధ్యాహ్నం పన్నెండింటికొచ్చి భోంచేసి, కాసేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ సాయంకాలం సంధ్యవార్చి కోవెలకెళ్ళి, రాత్రి ఎనిమిదింటికో, పండగ రోజుల్లో అయితే ఏ పదింటికో అలసిపోయి తిరిగొస్తాడు. యాంత్రికమైన అతని ఈ దినచర్య ఆమెలో చికాకుని పెంచింది. సమయం దొరికినప్పుడల్లా అతను వేద గ్రంథాలు చదివి వాటిలోని ధర్మసూక్ష్మాల్ని భార్యకు విడమర్చి చెప్పేవాడు. ఆమెనా ఆధ్యాత్మిక గ్రంథాలు

# కొత్త వెలుగు

ఏ మాత్రం ఆకర్షించలేకపోయేవి! వాటిల్లో నవలల్లోలాగా అందమైన కలలూ, కల్పనలూ ఉండవు కాబట్టి, సహజంగానే ఆమె వాటిని పట్టించుకునేదికాదు. భర్త ఆలయానికెళ్లిపోయాక తనమానాన తాను తనకిష్టమైన పుస్తకాల్ని చదువుతూ గడిపేది. 'తన భర్త కూడా నవలల్లోని నాయకుడిలాగే గొప్ప అందగాడు. కానీ ఏం లాభం? అతనికి భార్య అందాన్ని పొగట్టం చేతకాదు. తనను అపరిమితమైన సుఖాల్లో, భోగాల్లో తేలియాడించటం అసలే చేతకానివాడు... ప్చ్! స్నేహితురాళ్ళు వాళ్ల దాంపత్య సుఖాన్ని గుసగుసలుగా తనకు చెప్పినప్పుడు... చచ్చేటంత సిగ్గు!... ఛ. ఛ వాళ్లంతగా వాళ్ల వాళ్ల భర్తల్ని గురించి గొప్పలు చెప్పకుంటారో!' అని నిట్టూర్చేది కాత్యాయిని. "ఇవన్నీ నీకు తెలీదు లేవే! మీ ఆయనో వెర్రిబాగుల పూజారి... అంతేగా" అని ఆమె ఎదటే ఆమె స్నేహితురాళ్లు హేళన చేసే వాళ్లు. ఆ రకంగా భర్త దాంపత్య సుఖాన్ని విస్మరించుకున్నా, ఆమెలో వైవాహిక జీవితం పట్ల అసంతృప్తి పెరిగిపోయింది...

భోజనం ముగించుకుని పాత్రలు కడిగేసాక, వంటిల్లు సర్దుకుని ఆరుబయట నిద్రిస్తున్న భర్త పక్కకు చేరింది కాత్యాయిని. తలకిందుగా ఓ చెయ్యి ఉంచుకుని ప్రక్కకు ఒత్తిగిలిపడుకున్న భర్తవేపు ఓ క్షణం రెప్ప వాల్చకుండా చూసింది. 'అసలు అందంలో ఈయన ముందు రాజారావు ఎందుకు పనికొస్తాడు...?' అనుకుంది.

రాజారావు! నెల క్రితం సుడిగాలిలా తన జీవితంలోకి ప్రవేశించిన వ్యక్తి! ఇప్పుడు తన తనువులో, మనసులో చెప్పలేని అలజడిని సృష్టిస్తున్న వ్యక్తి! రాజారావు వాళ్లూరివాడే. ఆమె పెళ్లికి ముందు ముఖ పరిచయం మాత్రముండేది. తండ్రి దగ్గరికి ఏవేవో వ్యాపార సంబంధమైన సలహాలకోసం వచ్చేవాడు. ఆమె పెళ్లైపోయాక, వ్యాపారం పనిమీద ఆ ఊరొచ్చినపుడల్లా ఆమెను చూసిపోడానికొచ్చేవాడు. ఎన్నెన్నో పుస్తకాలు తెచ్చిచ్చేవాడు. అవి ఆమెకెంతో ప్రీతిపాత్రమైన నవలలు. ఇద్దరూ వాటి గురించి గంటలతరబడి చర్చించుకునేవాళ్లు. వారి పరిచయం క్రమంగా పెరిగింది. "అసలు నువెంత అందంగా వుంటావో నీకు తెలుసా కాత్యాయినీ? తెలీదు. ఎందుకంటే ఈ సంగతి పాపం నీకెవరూ చెప్పరుగా! నిజంగా నిన్ను చూస్తుంటే నా మతి పోతోంది. నీకు పెళ్లి చేస్తున్నట్టు ముందుగా మాస్టారు నా కొక్కమాట చెప్పి ఉంటే నిన్ను ఆ పళంగా లేవదీసుకు పోయేవాణ్ణి. ఎందుకంటే మీది చాలా సాంప్రదాయమైన కుటుంబం. మన పెళ్లికి మాస్టారు ఒప్పుకోరని నాకు తెలుసు!" అని నిట్టూర్చేవాడు రాజారావు. అతనలా నిట్టూర్చినపుడల్లా ఆమెకోవైపు భయమూ, మరోవైపు ఆనందమూ కలిగేవి. ఒళ్లు పులకరించేది! ఎందుకంటే భర్త ఎన్నడూ ఆమెతో ఇలాటి 'థ్రిల్లింగ్' విషయాలు మాట్లాళ్లేదు మరి! ఓ ఉదయం భర్త కోవెల కెళ్లిపోయాక కుండ పోతగా వాన కురుస్తోంది. రాజారావిచ్చిన ఓ పుస్తకం తెరిచింది కాత్యాయిని. నాలుగు పేజీలు చదవగానే అదొక చవకబారు 'సెక్సు' పుస్తకం అని తెలిసిపోయింది. కానీ... ఏకాంతం రెచ్చగొడుతుంటే, కుతూహలాన్ని చంపుకోలేక దాంట్లో లీనమైపోయి చదవసాగింది. రాజారావు వానలో ముద్దయిపోయి లోనికి రావడంగానీ..., అతను తలుపులు గడియ పెట్టడంగానీ ఆమె గమనించలేదు. ఆతనామె దగ్గరగా వెళ్లి నుంచున్నాడు. ఆమె అప్రయత్నంగానే లేచి నుంచుంది. ఒక్క ఉదుటున ఆమెను సుడిగాలిలా చుట్టేసి హత్తుకు పోయాడతను. ఆ క్షణం ఆమెకు భర్తగానీ అతను బోధించిన ధార్మిక విషయాలుగానీ... ఏవీ గుర్తుకురాలేదు. కామం పురివిప్పి పెనవేసుకున్న కౌగిట్లో విచక్షణ ఊపిరాడక ఉక్కిరిబిక్కిరయ్యింది! శరీరాలు ఎదురు తిరిగి ఆలోచన గొంతు నులిమేశాయి! ఆ క్షణాల్లో సిగ్గు బిక్కచచ్చిపోయింది. ఆ తరవాత చాలాసార్లు వాళ్లిద్దరూ ఆ అనుభూతిని చాటుమాటుగా చవిచూడ్డంలో గొప్ప 'థ్రిల్'ను ఫీలయ్యేవారు. కానీ కాత్యాయినిలో క్రమంగా ఉదాసీనత చోటు చేసుకుంది. 'భర్తకీ విషయం తెలిస్తే?' అన్న భయం ఆమెను పట్టి పీడించ సాగింది. ఆమెలో వివాహబంధానికీ, వాంఛకీ మధ్యన ఘర్షణ నానాటికీ పెరిగిపోసాగింది.

"ఇలా అటూ ఇటూ గాక ఊగిసలాడే మనసుతో ఎన్నాళ్లు బాధపడుతూ ఉంటావిక్కడ? నాతో వచ్చెయ్యి... నీ జీవితాన్ని నిస్సారం చేసుకోకు! మనం మళ్లీ పెళ్లి చేసుకుని హాయిగా ఉందాం...! ఏం, మాట్లాడవు?", రాజారావు బలమైన కౌగిట్లో బంధించి గుసగుసల మధ్యన అడిగాడామె నారోజు...

నిద్దట్లో మెళకువ వచ్చి కళ్లు తెరిచి చూసాడు వంశీకృష్ణ. ప్రక్కనే కూచుని ఆలోచిస్తున్న భార్య అగుపడింది.

"కాత్యాయినీ! నువింకా పడుకోలేదా? ఇలా తెల్లవార్లూ మేలుకుంటే ఆరోగ్యం చెడిపోదూ? ఇలా రా...!" భార్యను దగ్గరికి తీసుకుని ఆమె కళ్లల్లోకి చూశాడతను. "ఏమిటి విషయం...?" చిరునవ్వుతో ప్రశ్నించాడు.

"అబ్బే...! మరేం లేదండీ. ఏదో పీడకల వచ్చి మెళకువ వచ్చింది! మీరు పడుకోండి. మళ్లీ పొద్దున్నే లేవాలి గదా!" అంది నెమ్మదిగా అతన్ని విడిపించుకుని. కానీ జరుగుతున్నది పీడకలలాటి వాస్తవమే అని ఆమెకు తెలుసు. చాటుగా తప్పు చేస్తూ భర్త ముఖంలోకి సూటిగా చూడాలంటేనే భయంగా ఉందామెకు.

తెల్లవార్లూ నిద్రపట్టక ఆకాశంలోకి చూస్తూ పడుకుందామె, అంత కంత కూ దూరంగా పరుగెడుతున్నట్టు అగుపిస్తున్న చందమామని చూస్తూ!

*   *   *

శిశిరఋతువు ప్రవేశించింది! మారిపోయిన ఋతువులు కొందరి జీవితవిధానాన్ని కూడా మార్చేసాయి! పల్లకీ బోయీలు ప్రసాదంతో పాటుగా కొంత కూలీని ముట్టజెపుతేగానీ పనిలోకి రామన్నారు క్రమంగా అమ్మవారి ఊరేగింపు మూలనపడింది. వాళ్లు తమ ఆడాళ్లకి జీతభత్యాలు నిర్ణయిస్తేగానీ పనిలోకి పంపమని మొండికేసారు. అమ్మవారి పూజా పునస్కారాలకే ఆంతరాయం ఏర్పడ్డంలో సమస్య గ్రామ పెద్ద వరకూ వెళ్లింది. ఊరు ఊరంతా ఓ రోజు పంచాయితీ పెట్టి, పనివాళ్ల స్వార్థబుద్ధిని తిట్టిపోసారు. దేవికి ఆగ్రహం వస్తే ఆ నీచుల కుటుంబాలన్నీ నామరూపాల్లేకుండా తుడిచి పెట్టుకు పోతాయని పెద్దపూజారి రామానుజం శాపనార్థాలు పెట్టాడు. 'ఆలయాన్ని ఎవరు శుభ్రం చెయ్యాలి?' అనే ప్రశ్నకు పరిష్కారం దొరక్క పంచాయితీ ప్రెసిడెంటుకు దిక్కు తోచకుండా ఉంది. "జీతమిచ్చి మనుషుల్ని పెట్టాలంటే దానికి కొన్నాళ్లు పోవాలి, గవర్నమెంటు గ్రాంటొచ్చేదాకా... మరెలా?" అని ఆయనగారు మథనపడుతుంటే వంశీకృష్ణ ఓ పరిష్కారాన్ని సూచించాడు. అది విని ఊరు ఊరంతా బిత్తరబోయారు. "కుర్రవెధవ! అతితెలివి వీడునూ" అని గొణుక్కున్నారు కొందరు.

"మనూళ్లో సుమారు ఇరవై ముప్పై కుటుంబాలకంటే ఎక్కువలేవు. రోజువారీ వంతులు వేసుకుని ప్రతి కుటుంబంలోంచీ ఓ వ్యక్తి వచ్చి దేవి ఆలయాన్ని శుభ్రం చేసేట్టు అయితే ఏ గొడవా రాదు. ఇక పండగలప్పుడు మనమే పల్లకీమోసి దేవిని ఊరేగించుకుందాం. దీనికోసం ప్రత్యేకంగా బోయీలెందుకూ?" అన్నాడు అంతే.

"అబ్బే...! అదెలా కుదురుతుందీ?" అన్నాడాయన నీళ్లు నములుతూ; ప్రెసిడెంటు గారికి భయం పట్టుకుంది తనెక్కడ పల్లకీ మోయాల్సి వస్తుందోనని!

"ఎందుక్కుదరదండీ? మన పని మనమే చేసుకుంటాం! దేవి పట్ల ఇంతకంటే మన భక్తిని వెల్లడించుకునే మార్గం వేరే ఏముంది?" అన్నాడు వంశీ.

"నీ ఉద్దేశం ఏమిటబ్బాయ్! ప్రెసిడెంటు గారింటినుంచి కూడా మనుషులొచ్చి కోవెల ఊడిచి వెళ్లాలనా?" రామానుజం వంశీవేపు తిరిగి కోపంగా ప్రశ్నించాడు.

"తప్పేముందండీ! దైవం ముందు అందరూ సమానమేగా! గొప్పా — పేదా తారతమ్య మెక్కడుందసలు? అలా ఉండాలని మీరే వేదగ్రంథంలోనైనా చదివారా పూజారి గారూ?" చిరునవ్వుతో ప్రశ్నించాడు వంశీ.

ఒళ్లుమండిన రామానుజం సమాధాన మివ్వ బోయేంతలో, గుంపులోంచి నెమ్మదిగా ముందు కొచ్చి నుంచుంది యాది. వంశీకృష్ణకు నమస్కరించి, "బాబూ, మీ రొప్పుకుంటే అమ్మోరిగుడి రోజూ నాను సుబ్బరం సేసి పెడతాను. మీరు నాకేపీ ముట్టజెప్పక్కరనేదు." అంది వినయంగా. రామానుజం యాదికేసి యీసడింపుగా చూసాడు.

"ఛీ ఛీ! నువ్వు కోవెల శుభ్రం చేస్తావా? నీలాటి తక్కువ కులంది గుడి తుడిస్తే భక్తుల మాట దేవుడెరుగు, ముందాకోవెల్లోని అమ్మవారు అక్కడ ఉండకుండా వెళ్లిపోతుంది" అన్నాడు.

ఘొల్లుమన్నారు జనం.

యాది కళ్లలో నీరు తిరిగింది. బిక్కు బిక్కు మంటూ వంశీకృష్ణ కేసి చూసి తలొంచుకుని నుంచుంది. ప్రెసిడెంటూ మరికొందరూ మాత్రం 'హమ్మయ్య!' అనుకున్నారు పని తప్పిందన్న ఉద్దేశంతో. ఇంకొందరు ఆ తక్కువ కులంది అసలు కోవెల్లోకి అడుగుపెట్టడమే నిషిద్ధమన్నారు. వాదోపవాదాలు జరిగేయి. చిట్టచివరికి వాళ్ల అవసరం యాదిని పనికి కుదిరేటందుకు అంగీకరింప జేసింది. అవసరాన్ని గడుపుకుందుకు ఊర్ప్రజలు తీసుకున్న నిర్ణయాన్నిచూసి వంశీ నవ్వుకున్నాడు. అతనీ విషయాన్ని ముందుగానే ఊహించాడు. అందుకే ఎవరితోనూ వాదించక మౌనంగా ఉండిపోయాడు.

ఓ ఉదయం కోవెల ముంగిలి అలికి ముగ్గులు తీరుస్తున్న యాదిని అడిగాడు వంశీ:

"యాదీ, రోజూ క్రమం తప్పకుండా అమ్మవారికి సేవచేసి పోతుంటావు గదా! నీకేం కావాలని అమ్మవారిని కోరుకుంటావు?"

"నాకేటి కావాల పూజారయ్యా? ఆయమ్మ నా మావనూ, సంటోణ్ణీ సల్లంగ చూస్తే సాలు ... అసలాయమ్మను చూస్తేసాలు నా మనసు నిండినట్టు ఉంటాది!"

"మీ ఆయనేం చేస్తుంటాడు? టౌనులో పనికెళతాడా?"

"ఒకప్పుడెల్లీవోడు బాబూ! మా సంటోడు పుట్టిన నెలక్కావోసు, తాపీపని సేసేటప్పుడదేదో భవంతి మీదనుంచి పడిపోనాడు. నడుంకి దెబ్బలు తగిలి పచ్చవాతమొచ్చేసి కాళ్లు సచ్చుబడిపోయినయ్! ఆయాల నుంచీ మరీ మంచం మీదనుంచి దిగనేదు. మా గూడెంలోనా మాకు ముందూ యెనకా యెవురూ నేరయ్యా! అందుకని ఇక్కడే ఉండిపోనాము. నాను దొరగారింట్లో పనికి కుదిరినాను. నాను పంజేసి తెచ్చి దానితోనే మా సంసారం గడుసుద్దయ్యా! అంతా ఆ అమ్మోరి దయ." కాళ్లూ, చేతులూ కడుక్కుని భక్తిగా దేవికి దండం పెట్టుకుని "ఎల్లొస్తాను పూజారయ్యా. మల్లా సాయంకాలవొస్తాను!" అనేసి చకచకా మెట్లుదిగి వెళ్లిపోతున్న యాది కేసి అలా చాలాసేపు చూస్తూ నుంచుండి పోయాడు వంశీ.

మధ్యాహ్నం ఇంటికెళ్లిన అతనికి కాత్యాయిని కనిపించలేదు. పక్కింటికి గానీ వెళ్లిందేమోననుకుని భోంచేసి పడుకున్నాడతను. సాయంకాలం అయిదు అవుతున్నా భార్య జాడలేదు. పక్కింట్లో వాకబు చేస్తే ఉదయం రాజారావు రావడం చూసామనీ, ఆ తరవాత వాళ్లిద్దరూ ఎక్కడికైనా వెళ్లారేమో తమకు తెలీదనీ సమాధానం వచ్చింది. చికాగ్గా ఇల్లంతా కలయదిరిగాడతను. కాత్యాయిని పెట్టెదగ్గిర మాసిన బట్టలు కొన్ని



చిందర వందరగా పడున్నాయి. పెట్టె తెరిచి చూసాడు. ఖాళీగా ఉంది. 'తనతో చెప్పకుండా ఎక్కడికి వెళ్లినట్టు ?' అనుకుంటూ ఖంగారుగా పూజ గదిలోకి వెళ్లాడు. దేవి విగ్రహం ముందు దీపం వెలిగించిన జాడలేదు ! అక్కడొక కాయితం రెపరెప లాడుతూంది. వణుకుతున్న చేతుల్తో దాని తీసుకుని చదివాడు. రెండే రెండు వాక్యాలున్నాయి —

"మీతో జీవిత విధానం నాకు సరిపోలేదు. నచ్చిన జీవితాన్ని వెతుక్కుని, నచ్చిన వ్యక్తితో వెళ్లిపోతున్నాను —కాత్యాయిని."

'వాళ్లిద్దర్నీ స్నేహితులుగా భావించి ఏమాత్రం అనుమానించకుండా ఊరుకున్నందుకు తనకు దక్కిన ప్రతిఫలం ఇదా ?'

"కాత్యాయనీ ! నన్నెందుకు వదిలి వెళ్లిపోయావు ? నేన్నీకేం ద్రోహం చేసాను ?" దేవి విగ్రహంముందు కుప్ప కూలిపోయి పసి పిల్లాడిలా వెక్కివెక్కి రోదించాడు అతను.

* * *

భార్య వెళ్లిపోయాక వంశీ మళ్లీ మామూలు మనిషిగా మారడానికి చాలా రోజులు పట్టింది. క్రమంగా అతనిలో ఒక విధమైన నిర్లిప్తత చోటు చేసుకుంది. వేళకింత ఉడకేసుకుని తినడం, వీలయినంత ఎక్కువకాలం భగవత్సాన్నిధ్యంలో గడపడం అలవాటయిపోయింది. 'ఆధ్యాత్మిక చింతనా, ఆలయంలో అప్పిన బాధ్యతా తనకు లేకుండా ఉండి ఉంటే తనేనాడో పిచ్చివాడై రోడ్డున పడేవాడు !' అనుకునేవాడు. సంగతి ఎరిగున్నవాళ్లు అతన్ని ఓదార్చబోయారు. వాళ్లను వారించి దయుంచి తనని ఒంటరిగా వదిలిపెట్టమని ప్రాధేయపడేవాడు. చాలామంది 'ఇతనికి పిచ్చిగానీ పట్టలేదుకదా !' అని ఆశ్చర్యపోయారు.

ఓ రోజుదయం ఆలయానికి బయలుదేరాడతను. అప్పుడు తెల్లవారుఝాము నాలుగ్గంటలు దాటింది. ఆ ప్రశాంతమైన నిశ్శబ్దాన్ని ఛేదించుకుంటూ కోవెల గంట రెండు మూడుసార్లు మ్రోగి ఎవరో చేత్తో పట్టుకుని ఆపేసినట్టు ఠక్కున ఆగిపోయింది. ఉలిక్కిపడ్డాడతను. అది మామూలుగా కోవెల తెరిచే సమయమే. ఒక్కోసారి తనకంటే ముందే రామానుజం దేవిని మేలుకొలపడానికి వెళుతూఉంటాడు. కానీ, ఆ గంటలు కొట్టిన తీరు ఎందుకో ఖంగారుగా, అపసవ్యంగా ధ్వనించింది అతనికి. 'ఏదో జరగబోతూంది !' అని అతని మనసతన్ని హెచ్చరించినట్టనిపించింది. పరుగులాంటి నడకతో మెట్లెక్కి కోవెల చేరుకున్నాడు. ఆవరణలో ఎవరూలేరు. కోవెల వెనుక వైపునుంచి మాత్రం ఏవో గొంతులు వినిపించాయతనికి. చప్పుడుకాకుండా ఆ వైపుగా

వెళ్లి అక్కడి దృశ్యాన్ని చూసి స్థాణువులా నుంచుండిపోయాడు.

"ఒద్దు బాబూ ! మీకు దండం పెడతానండయ్యా. నానలాంటిదాన్ని కాను. నన్నొదిలిపెట్టండయ్యా." నేలమీంచి లేవడానికి ప్రయత్నిస్తూ గిలగిల్లాడుతూంది యాధి.

"ష్...! అరవకే. ఈ సంగతి మూడో కంటికి తెలీనివ్వను. బెట్టుచెయ్యకు ! పక్షవాతం మొగుడితో నీకేం సుఖం చెప్పు ?" ఆమెతో పెనుగులాడుతూ ఆమె నాక్రమించుకోడానికి ప్రయత్నిస్తున్నాడు రామానుజం.

"థూ...! ఏం పూజారయ్యవయ్యా నువ్వు? రోగమొచ్చి మంచాన ఉన్నా నా మావే నాకు దేవుడు ! నానుంకోడ్ని ఒల్లను... స్సీ...! నన్నొగ్గు. నేకుంటే కేకలెట్టి నీ పరువుతీత్తాను" దుఃఖంతో, కోపంతో ఒణికిపోతూంది యాది.

"నోరు ముయ్యవే ! పతివ్రత కబుర్లు నువ్వూనూ. ఈ వేళప్పుడు నిన్నెవడాదుకుంటాడు..." మాట పూర్తి చెయ్యకుండానే యాది చీరెను పశువులా లాగేస్తూ ఆమె మీదకు లంఘించాడు రామానుజం. గుండె లవిసిపోయేట్టు అరిచింది యాది. అంతలో, మెడమీద పడ్డ దెబ్బతో విద్యుద్ఘాతం తిన్నవాడిలా ఎగిరి అవతల పడ్డాడు రామానుజం. అతని తలను చేత చిక్కించుకొని పిచ్చివాడిలా నేలకేసి బాదసాగేడు వంశీ. చావుకేకలు పెట్టాడు రామానుజం. "పశువుకంటే హీనుడివి...థూ ! నువ్వొటా పూజారివి ? ఇప్పుడు యాది కులం అడ్డు రాలేదా నీకు ? ఈ రోజు నా చేతుల్లో నీకు చావు మూడింది!" ఆవేశంతో ఒణికిపోతూ చేతుల్తోనూ,. కాళ్లతోనూ రామానుజాన్ని కుళ్లపొడిచాడు వంశీ. చివరికెలాగో తప్పించుకుని హీనమైన ఒంటితో, పీలికలైన పంచెతో ఇంటికి పరుగుతీశాడా పూజారి. కన్నీళ్లు తుడుచుకుని, దండం పెడుతూ కృతజ్ఞతలు చెప్పుకోబోయిన యాదిని వారించి "ముందాలయం శుభ్రం చెయ్యి యాదీ, దేవీ పూజకు వేళ మించిపోతోంది" అన్నాడు శాంత స్వరంతో. అంతలోనే శాంతంగా మారిపోయిన అతన్ని ఆశ్చర్యంగా చూస్తూ, చీపురు తీసుకుని బయలుదేరింది యాది.

* * *

ఆ సాయంకాలం ఆలయ ఆవరణలో జనం చాలామంది గుమిగూడి ఉన్నారు. "ఛ! ఆ చచ్చేదేదో గుళ్లోనే చావాలా ! అప్పుడే సాయంత్రమైపోయింది. ఇప్పుడెలా శవాన్నిక్కడ్నుంచి కదల్చటం ?"

"ఇప్పడీ కులంగాని కులందాని శవాన్ని ఎవరు తీసుకెళ్లేది ? రామచంద్రా ! ఎలాటి చిక్కొచ్చిపడింది" అందరూ తలోరకంగా వ్యాఖ్యానాలు చేస్తూ నుంచున్నారు. అప్పుడే వచ్చిన వంశీకృష్ణ జనాన్ని తప్పించుకుని అక్కడి దృశ్యాన్ని చూసి హతాశయుడైపోయాడు. పురాతనమైన ఆ కోవెల ప్రాకారంలోని ఓ రాతి స్తంభం క్రింద యాది నిర్జీవంగా రక్తపుమడుగులో పడి ఉంది.

"ఎలా... ఎలా జరిగిందీ ఘోరం ?" పిచ్చిగా చుట్టూ చూస్తూ కంపిత స్వరంతో అడిగాడు వంశీ.

"ఏముందీ ! కోవెల పాతకాలంది. పైగా కూలడానికి సిద్ధంగా ఉందాయె ! ఈ ముదనష్టపుది సరిగ్గా స్తంభం కూలే సమయానికి అక్కడే ఊడుస్తూ చచ్చిందట. పోతే పోయిందిలే ! మన గుడికి గ్రాంటు సాంక్షనయ్యింది. ఇక మీదట జీతమిచ్చి మనుషుల్ని పెట్టుకోవచ్చు. కానీ ఆలయం మైలపడిపోయింది !" ప్రెసిడెంటు తాపీగా జవాబిచ్చాడు. వంశీ ఏమీ మాట్లాడలేదు. చుట్టూ కలయజూసి "కాస్త ఎవరైనా వచ్చి ఈ స్తంభాన్ని ప్రక్కకి జరపడానికి సాయం చెయ్యండి" అన్నాడు బిగ్గరగా. "మునిసిపాలిటీ వాళ్లను టౌన్నుంచి రమ్మని కబురెడదాం. ఎవరూ ముట్టుకోకండి!" అరిచారెవరో. "మీకే చెవుతూంట ! స్తంభాన్ని తాకినంత మాత్రాన మీరెవరూ మైలపడిపోరు" గట్టిగా అరిచాడు వంశీ. మౌనంగా ఓ ఇరవైమందొచ్చి అతనికి సాయం చేసారు. అతనామె శవాన్ని చేతుల్లోకి ఎత్తుకోబోతుండగా, "ఆగు వంశీ ! ముట్టుకోకు" అని అరిచాడు రామానుజం బిగ్గరగా. జవాబుగా ఒక్కమారతనివేపు ఈసడింపుగా చూసి కాండ్రించి నేలమీద ఉమ్మేసాడు వంశీ. తరవాత మౌనంగా యాది శవాన్నెత్తుకుని కోనేటివేపు కదిలాడు. జనం అతన్నో వెర్రివాణ్ణి చూసినట్టు చూడసాగేరు. అతను నెమ్మదిగా కోనేట్లోకి దిగి యాది శవాన్ని శుభ్రపరిచాడు. అమ్మవారి పట్టువస్త్రాన్ని తెచ్చి యాది శవానికి చుట్టబెట్టాడు. దేవి సన్నిధినుండి పసుపు కుంకాలు తెచ్చి యాది ముఖాన అలంకరించాడు. కోవెల్లో పూసిన గన్నేరు పూలు కోసి ఆమె శవంమీద చల్లాడు.

"చూస్తారేంరా ! మన కోవెలనూ, అమ్మవారినీ కూడా అపవిత్రపరిచాడు. వెధవను నాలుగు తన్ని ఊళ్లోంచి వెలివెయ్యండి." అసహనంగా అరిచాడు ఊరి ప్రెసిడెంటు. జనం ఆవేశంగా వంశీమీదపడి అందినచోటల్లా గుద్దేరు. కొందరు తుపుక్కున ఉమ్మేసారు. అతను మౌనంగా దెబ్బలన్నింటినీ భరించాడు. కాసేపు గడిచాక నెమ్మదిగా తలెత్తిచూసాడు. చుట్టూ చీకట్లు అలుముకుంటున్నాయి. ఇంతలో యాది కొడుకు అయిదేళ్లవాడొచ్చి చెప్పాడు, "అమ్మ ఇంకా ఇంటికి రాలేదని అయ్య నన్ను పంపిండు!" వాడు బిక్కమొహం వేసుకుని వంశీని, వాళ్లమ్మ శవాన్నీ చూడసాగేడు పరిస్థితి అర్థంకాక. వంశీ నెమ్మదిగా లేచినుంచున్నాడు. మొహంమీది రక్తపు చారికల్ని తుడుచుకుని, ఆ పసివాణ్ణి దగ్గిరకు తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు.

"అమ్మ ఇకమీదట రాదు బాబూ ! ఇప్పుడమ్మ అమ్మోరి రూపంలో ఉండే దేవత ! పైనుంచే మనల్ని చూసి చల్లగా ఆశీర్వదిస్తూంటుంది. వెళ్దాం పద !" భుజంమీదికి యాది శవాన్నెత్తుకుని చిట్టచివరిసారిగా దేవికి నమస్కరించాడు. జనం అతన్ని వెర్రిగా చూడసాగేరు.

"మీరు నన్ను కాదుగానీ, దేవుడు, కులం, మతం పేరిట మీరు బ్రతుకుతున్న పాపపంకిలమైన బ్రతుకును నేనే వెలివేస్తున్నాను ! మానవత్వంలేని మీమీది అసహ్యంతో నేనే దూరంగా పోతున్నాను. నేను నిత్యం కొలిచే నా దైవం ఇకమీదట నాకీ పసివాడిలో కనిపిస్తుంది, నిస్సహాయుడైన వీడి తండ్రిలో కనిపిస్తుంది... ఇలాటి కోట్లాది అభాగ్యుల్లో కనిపిస్తుంది." అనేసి పసివాణ్ణి నడిపించుకుంటూ, యాది శవంతో సహా మెట్లు దిగసాగేడు వంశీ.

ఒక్కో మెట్టే దిగుతూంటే చీకటి మరింత దట్టమయిపోతూంది. అతనికి మాత్రం ఏమాత్రం అధైర్యంగా లేదు ! ఈ రాత్రి ఎంతోసేపుండదనీ, ప్రత్యూష వెలుగులు రాక మానవనీ అతనికి తెలుసు ! అతనిలో కొత్త శక్తి నిండింది. అతని మనసులో "కొత్త వెలుగు" వ్యాపించింది. ఇప్పడతనికి ప్రపంచం యావత్తూ తను కొలిచే అమ్మవారే కనిపిస్తూంది. చేతులు చాపి రమ్మంటూంది. కర్తవ్యాన్ని గుర్తుచేస్తూంది... క్రమంగా అతని నడక వేగం హెచ్చింది.

## కళ

స్పందించే
హృదయం
వున్నచోట
కళ విలువ
నిలుస్తుంది !
పెరుగుతుంది !
పశువు ముందు
ఎన్ని బొమ్మలుంచినా
నమిలి
మింగుతుందేగానీ
చూసి
ఆనందించలేదు !

— "సింహం"

# ధర్మ పథం

బులుసు వేంకట రమణయ్య



# గురు నింద.

విద్య నేర్పిన గురువు దైవసమానుడని, ఆయనను ఎంతో గౌరవిస్తారు. అలా గౌరవించడం ధర్మం కూడా. గౌరవించక పోవడం అలా ఉండగా నిందిస్తూ దుర్భాష లాడడం మరీ తప్పు. దానివల్ల తనకే హాని కలగవచ్చు.

పూర్వకాలంలో ఇందీవరాక్షుడనే గంధర్వ రాజు ఉండేవాడు. ఒకప్పుడతడు బ్రహ్మ మిత్రుడనే మహర్షి శిష్యులకు ఆయుర్వేద విద్యను బోధిస్తూ ఉండడం చూచాడు. తనకున్నూ ఆ విద్య నేర్చుకోవాలనే ఆసక్తి కలిగింది. ఆ గంధర్వుడా మహాముని వద్దకు వెళ్లి తనకు కూడా ఆయుర్వేదం బోధించాలని ప్రార్థించాడు. ఆ ముని "గంధర్వులు విలాస పురుషులు. ఆటలు, పాటలు నేర్చి అవినీతిగా ప్రవర్తిస్తారు. నీవు యీ విద్యకు తగవు" అన్నాడు. "నేనట్టివాడను కాను" అని మరలా, మరలా వేడగా ఆ ముని కోపించి "నీకు ఈ విద్య నేర్పకపోతే, మాకు కలిగే నష్టం ఏమి ?" అని చీదరించుకున్నాడు. దాంతో ఇందీవరాక్షునికి పట్టుదలఎక్కువైనది. "ఈ మునికి గంధర్వులంటే ఎంత నిరసన? ఈయన విద్య నేర్పుతాడని సుఖపడడం మాని బిచ్చమెత్తుకోవాలా ? ఎలాగైనా ఈ విద్య నేర్చితీరుతాను" అని నిశ్చయించి మాయా రూపంతో శిష్యుల మధ్య చేరి ఆ మునివల్లనే ఆయుర్వేద విద్యను సమగ్రంగా నేర్చుకున్నాడు. ఇలా తన కోరిక నెరవేరినా, తన్ను తిరస్కరించిన ఆ మునిపయి ఆ గంధర్వునికి కోపం పోలేదు. విద్య పూర్తి అయ్యాక ఇందీవరాక్షుడు నిజరూపం ధరించి, బ్రహ్మమిత్రుని యెదుట నిలిచి తన కసి తీర్చుకుంటూ "ఓయీ! పిచ్చి బ్రాహ్మణుడా! నీవు నన్ను తిరస్కరించినా, నాకు కావలసిన విద్య రానే వచ్చినది. నన్నికల్లు దాచినంత మాత్రాన పెళ్లి ఆగిపోతుందా ? నీ చెడ్డ స్వభావాన్నే వెల్లడించుకున్నావు. కాని బతిమాలుకున్నా చదువు చెప్పడానికి సమ్మతించావు కావు" అని నిందించాడు. ఆ గంధర్వుడు చేసిన మోసానికీ, వాని మాటలకూ మిక్కిలి కోపించి, ఆ మహాముని "ఓరీ దురాత్ముడా ! నన్ను మోసగించి నా వల్ల విద్య సంపాదించడమే కాకుండా; నిందించడం కూడానా ? గురువు ముందరనే గుటగుటలా ? ఈ నీ దుష్ప్రవర్తనకు ఫలితంగా నీవు రాక్షసుడవయి జన్మించు" అని తీవ్రంగా శపించాడు.

ఆ శాపం వల్లనే ఇందీవరాక్షుడు రాక్షసుడుగా జన్మించి, పెక్కు క్రూరకర్మలు చేసి, తన పుత్రికనే చంపబూని, ఆ ముని అనుగ్రహం వల్లనే స్వరోచి వల్ల శాప విముక్తిని పొందగలిగాడు.

గురునిందవలన అనర్థమూ, ఆయన అనుగ్రహం వల్ల మేలూ కలగగలవని దీని వలన మనం గ్రహించవలసి ఉన్నది. ★

# హైదరాబాద్ నోట్‌బుక్

## పరిపాలనకు పత్రికల భాష

అధికారభాషా కమిషన్ అధ్యక్షులు డాక్టర్ సి. నారాయణరెడ్డి అక్టోబర్ 28న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ముచ్చటిస్తూ, పరిపాలన వ్యవహారాలకు అధికారభాషగా పత్రికల భాషను వాడాలని సూచించడం సముచితంగా వుంది. తెలుగు పత్రికల భాష, నాడూ నేడూకూడా శిష్టంగావుంది. ఆంధ్ర దినపత్రికలలో ఆంధ్ర పత్రిక మొదటి దినపత్రిక గనుక, దానిలో పని చేసినవారు కాశీనాధుని నా గే శ్వ ర రా వు, శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు వంటి బహుభాషా కోవిదులూ, సమకాలీన రాజకీయా లలో ఆరితేరినవారూ గనుక ఆంగ్ల పదాలను సమానార్థక తెలుగు పదాలను రూపొందించడంలో ఎంతో శ్రమ, చిత్తశుద్ధి వినియోగించారు; వంగాది ప రి స ర భా ష ల సంప్రదాయాన్ని స్వీకరించారు. దానితో తెలుగు పత్రికా రచనకు మంచి మూలబంధం ఏర్పడింది. నేటి పత్రికలు కూడ చాలవరకు శిష్ట వ్యావహారికాన్నే వాడు తున్నాయి; గ్రాంధికాన్ని విడనాడినా, దానిస్థాయిని వీడలేదు. పత్రికల భాషను కొందరు కవులు మూడు దశాబ్దాల కింద ఈసడించి శృంగభంగం పొందారు. మహా మహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారితో ఢిల్లీనుంచి మద్రాసు వరకు పయనించే భాగ్యం కలిగింది నాకు. ఆయన వంటి గడ్డు గ్రాంధికవాది, "చెబితే గ్రామ్య కవిత్వం పెబులందరు మెచ్చజెప్ప"వలెనని వెక్కి రించినట్టివారుకూడ నిత్యవ్యవహారానికి పత్రికల భాష అవసరమన్నారు. కాని, ప్రాచీన సాహిత్యం చదివి, వ్యవహార భాష వాడడం బాగుంటుందని సలహా ఇచ్చారు. ఏమైనా పరిపాలనా వ్యవహారాలకు నేటి పత్రికల భాష వాడడం సముచితం.

## రాకాసిగుళ్ళ తవ్వకాలు :

రాష్ట్రంలో లోహయుగపు అవశేషాలు చాలా వున్నాయి. ఈ యుగం క్రీస్తు పూర్వం వేయి సంవత్సరాల నుంచి క్రీస్తుపూర్వం 300 ఏళ్ల వరకు అని పురాతత్త్వ శాస్త్రజ్ఞుల నిర్ణయం. అప్పటి ప్రజల జీవిత విధానం మొద లయినవి రాకాసి గుళ్ళు, పాండవుల గుళ్ళు, వీరుల గుళ్ళు వంటి అవశేషాలవల్ల తెలుస్తుంది. పూర్వ కాలంలో వీరులు మరణిస్తే, వారి భౌతిక కాయాలను 40 దినాల వరకు బహిరంగ స్థలాలలో పెట్టేవారు. దానిని కాకులు, గద్దలు తిన్న తర్వాత వారు వాడిన ఆయుధాలు మొద లయిన వాటితోపాటు అస్థిపంజరాలను సమాధి చేసి, వాటిపైన రాళ్లు పేర్చేవారు. వాటిని జనం దయ్యాలుగా భావించడంవల్ల రాకాస గుళ్లనే పేరు వచ్చింది. నల్లగొండ జిల్లా ఏలేశ్వరం వద్ద ఇలాటి సమాధిని తవ్వగా, ఒక అస్థిపంజరం చుట్టూ పెట్టిన ఆ రు పాత్రలు దొరికాయి. మహబూబ్‌నగర్‌లోను, ఇలాంటి పాత్రలతో వున్న అస్థిపంజరాలు వెలువడ్డాయి. సమాధులకు పూర్వులు విశేష ప్రాధాన్య మిచ్చే వారని తెలుస్తుంది. హుజూర్‌నగర్‌లో జరిపిన తవ్వకాలలో వెలువడిన ఒక సమాధిలో తొమ్మిది అరలు కనిపించాయి. వీటన్నిటినీ బట్టి రాష్ట్ర పురాతత్త్వ శాఖ వారు రంగారెడ్డి జిల్లా గచ్చిబౌల్లీ ప్రాంతంలోని సమాధుల తవ్వకాలు కొనసాగించాలని ని ర్ణ యిం చా రు. దీనివల్ల పెక్కు అపూర్వ చారిత్రక విషయాలు వెలువడగలవని ఆశించవచ్చు. భారత దేశంలో ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో పురాతత్త్వ శాఖ నిర్వహించిన, నిర్వహిస్తున్న పనులు గొప్పవి. దాని సేవ అపారం. ఎన్నో చరిత్ర గంట్లు విడివడ్డాయి. ఎన్నో లంకెలు ఏర్పడ్డాయి.

## స్త్రీలకు 30 శాతం ఉద్యోగాలు

ప్రభుత్వ సేవలో స్త్రీలకు 30 శాతం ఉద్యోగాలు కేటాయిస్తూ త్వరలో అది శాసనం (ఆర్డినెన్స్) జారీ చేస్తున్నట్టు ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు నవంబర్ 3వ తేదీన ప్రకటించడం హర్షించదగిన వి ష య ం. 'యత్రనార్యస్తు పూజ్యంతే రమంతేతత్రదేవతాః' అని మనువు చెప్పిన మాటకు సార్థక్యం మహిళలకు ఆర్థికంగా సమాన ప్రతిపత్తి వున్నప్పుడే కలుగు తుంది. ఎన్ని ధర్మపన్నాలు చెప్పినా, ఎన్ని ప్రబోధాలు చేసినా, ఆర్థిక ప్రతిపత్తి అనేది ఈ వ్యవహార ప్రపంచంలో సమానత్వం కలిగించేది, గౌరవదాయకమైనదీని కనుక స్త్రీలకు సంఘంలో గౌరవం కలగాలంటే ఆర్థిక ప్రతిపత్తి మెరుగు పడాలి. అది సామాన్య ప్రజలలో భావ పరిణా మంతోపాటు ప్రభుత్వ శాసనాలూ అవసరం. హరిజన, గిరిజనులకు, ఇతరులకు కేటాయింపు లున్నట్లే మహిళలకు కేటాయింపులు ఉండడం అవసరం. ఒక తరంలోగా స్త్రీలకు సహస్రాబ్దా లలో కలగని గౌరవ ప్రతిపత్తులు కలుగుతాయి దీనివల్ల. ముఖ్యమంత్రి చర్య భారతదేశంలోనే విప్లవాత్మకమైంది ఇతర రాష్ట్రాలకు ఈ చర్య వరవడిగా వుంటుంది.

## ఉపశ్రుతి :

ఏమండీ తీరికగా కూచున్నారు?—అనడిగారు ఒకరు ఒక పత్రికా విలేఖరిని. తీ రి క గా క మరేముందండీ. పూర్వం కాంగ్రెస్ ప్రభుత్వంలో నయితే, ఎక్కడ బడితే అక్కడ సభలు, సమా వేశాలు, శంకుస్థాపనలు. చేతినిండా పని. ఇప్పుడయితే, తీరికంటే తీరికే— అన్నారు ఆ విలేఖరి.

— తిరుమల రామచంద్ర *

## డాక్టర్ కృష్ణకుమారి సాహితీ రజతోత్సవం

హైదరాబాదులోని అశోక్‌నగరు శ్రీ శారదా మహిళా మండలి వారు ఇటీవల డాక్టర్ కె. వి. కృష్ణకుమారి సాహిత్య ర జ తో త్స వా న్ని శ్రీ త్యాగరాయ గాన సభలో నిర్వహించారు.

సభకు డాక్టర్ దాశరధి అధ్యక్షత

డా. కె.వి. కృష్ణకుమారి సాహిత్య జీవిత రజతోత్సవ సభలో ఆశీర్వదిస్తున్న డా. అక్కినేని, సంస్థ అధ్యక్షులు శ్రీమతి రాధ, కార్యదర్శి శ్రీమతి భవాని, ఉప కార్యదర్శి శ్రీమతి లక్ష్మి, కళావతిగార్లని చిత్రంలో చూడవచ్చు.



# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ యితర రచనలు పంప దలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీ నగరం, విజయవాడ–520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షిక పేరు పేర్కొ నడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి– హామీపత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు– వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ళ లంటిం చిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తరప్రత్యుత్త రాలకి తావులేదు కాని–తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయ వలసివస్తే రచయితలు– రచన పేరు– అది పంపిన తేదీ, వివ రంగా వ్రాయండే, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ళ లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్‌లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగు తుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ "ప్రతు"లను– కాల క్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలోపోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు.

సం॥



వహించారు. ముఖ్య అతిథిగా డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు విచ్చేశారు.

శ్రీ శారదా మహిళామండలి తరపున అక్కినేని డాక్టర్ కె. వి. కృష్ణకుమారిని సన్మానించారు. డాక్టర్ దాశరథి మొమెంటో అందచేశారు.

ఈ సందర్భంగా ప్రచురించిన "కృష్ణ గీత" ప్రత్యేక సంచికను శాసన సభ్యురాలు శ్రీమతి నన్నపనేని రాజకుమారి ఆవిష్క రించారు. శ్రీయుతులు పి. జగన్‌మోహన్, యం. వి. సుబ్బారావు, జె. రాజారావు, డి. ఇందిర, శోభానాయుడు, పి. ఎస్. మూర్తి, పేకేటి, పి. వెంకటేశ్వర్లు మొదలైనవారు ప్రసంగించారు.

ప్రారంభంలో సభకు సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి కె. రాధానాగేంద్రం స్వాగతం చెప్పారు. సభా కార్యక్రమానికి ముందు 'గోకుల్ విహార్' నృత్య నాటికను ప్రదర్శించారు. శ్రీమతి బి. వి. యస్. యస్. లక్ష్మి వందన సమర్పణ చేశారు.

## రాష్ట్రస్థాయి కార్టూన్ల పోటీ

ప్రతి యేడు విజయవాడ కార్టూనిస్టులచే నిర్వహించబడే కార్టూన్ల పోటీ ఈ సం॥ కూడా రాష్ట్ర స్థాయిలో నిర్వహిస్తున్నారు. ఈ పోటీకి సామాజిక, రాజకీయ అంశాలపై మూడు కార్టూన్లకు మించకుండా '9 × 7' అంగుళాల సైజులో పంపవలసి వుంటుంది. 1984 జనవరి 1వ తేదీన విజయవాడలోని ఠాగూర్ లైబ్రరి హాల్లో జరిగే కార్టూన్ల ప్రదర్శన అనంతరం సాయంత్రం సమావేశంలో విజేతలకు బహుమతులు అందజేయడం జరుగుతుంది. కార్టూన్లు పంపే కవరుపై 'కార్టూన్ల పోటీకి' అని స్పష్టంగా రాసి – 'శేఖర్' (కార్టూనిస్టు) రజకవీధి, దుర్గాపురం, విజయవాడ-520 003. అనే చిరునామాకు డిసెంబర్ 15వ తేదీ లోపు అందేలా పంపాలి. పోటీకి పంపిన కార్టూన్లు త్రిప్పి పంపబడవు – అని విజయవాడ కార్టూనిస్టుల సంఘంవారు తెలియచేశారు.

## నాగార్జునసాగర్‌లో సమావేశము

నాగార్జునసాగర్‌లో కథా రచయితల సమావేశము జరపాలని సంకల్పించినాము. తెలుగు కథా రచయితలందరినీ ఆహ్వానించడానికి వీలుగా వారి చిరునామాలు పంపి సహకరించవలసినదిగా కోరుచున్నాము.

సి.హెచ్.ఎస్.ఆర్. ప్రసాద్, బి/766 : హిల్ కాలని, నాగార్జునసాగర్–508 202. ★

*Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao St., Gandhinagar, Vijayawada-3, Editor. S. Radhakrishna*

-41 ANDHRA SACHITRA VARA PATRIKA

# ఉన్నతమైన నాణ్యత ప్రియలోనే వుంది




ఎన్నిక చేసిన దినుసులన్నీ సమపాళ్లలో
మేళవించి అద్భుతమైన రుచులతో
రూపొందించినవే ప్రియ పచ్చళ్ళు.
మీ భోజనానికి సంతృప్తి సరిజోడు-ప్రియ
ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి తీసుకువెళ్ళండి.

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKETING
PRIVATE LIMITED